# ఆంధ్రకేసరి కథ


రెండేళ్ళు గడిచాయి. అద్దంకిలో బావగారి ఇంట్లో ఉంటున్న ప్రకాశం చదువు అయిపోయింది
ప్రకాశం! మీ నాన్నగారు నిన్ను నాయుడుపేట పంపమన్నారు. అక్కడ నీకు ఇంగ్లీషు చదువు చెప్పిస్తారట!


గోపాల కృష్ణయ్య ప్రకాశం చదువు కోసం ఇంత కాలంగా వల్లూరులో ఉన్న కుటుంబాన్ని నాయుడుపేట రప్పించాడు. అక్కడ సంసారం పెట్టాడు.
ప్రకాశంతో తమ్ముడు శ్రీరాములు కూడా ఆ ఇంగ్లీషు స్కూల్లో చేరాడు.


అప్పుడప్పుడు తండ్రితో పరిసర గ్రామాలకు రెవెన్యూ వసూళ్ళకు ప్రకాశం కూడా వెళ్ళేవాడు.


పిల్లవాడు వచ్చాడు కదా అని రూపాయో అర్ధో ప్రకాశానికి ఇచ్చేవారు
ఏం! తీసుకో బాబూ!


ఇలా వచ్చిన డబ్బులంతా ఒక డబ్బాలో దాచుకునేవాడు.
తమ్ముడూ! ఇదంతా నీకూ, నాకు!


ఇంతలో గోపాల కృష్ణయ్య ఉద్యోగం పోయింది ఆ రోజుల్లో ఇంగ్లీ- చదువుకున్నవాళ్ళకే ఉద్యోగాలు ఇచ్చేవారు.
ఎలాగ.... ఈ సంసారం నడపడం!


పిల్లవాడు కాస్త చేతికి అంది వచ్చేదాకా ఉద్యోగం ఉంటే చాలు.
పెద్దల్ని ఆశ్రయించి మళ్ళీ ఉద్యోగం సంపాదించాడు.


ఇక ప్రకాశం స్కూల్లో చదువుతూనే అటు రౌడీలతో నేస్తం కట్టాడు-
ఎవడ్రా మమ్మల్ని ఎదిరించేది!

# ఆంధ్ర ప్రదేశ్

సంపుటి : 16

జూన్, 1972
జ్యేష్ఠ - ఆషాఢ 1894

సంచిక : 8

ప్రధాన సంపాదకులు
పెండ్యాల వామనరావు

సంపాదకులు
కప్పగంతుల లక్ష్మణశాస్త్రి




పేజీ

3. దేశం బాగుపడాలంటే......
ప్రధానమంత్రి ప్రసంగం
6. నా ఆలోచన ఎప్పుడూ సామాన్యుణ్ణి గురించే
–ముఖ్యమంత్రి
7. త్వరలో శ్రీశైలం ప్రాజెక్టు
9. భూముల అన్యాక్రాంతం నిషేధిస్తూ ఆర్డినెన్సు
10. సామాన్యులలో అసమాన్యుడు...సంజీవయ్య మరణం
12. ఆంధ్రకేసరి: కొన్ని మధురస్మృతులు
14. ఆంధ్రకేసరి ప్రకాశం పంతులూ–ఆనాటి మా కుట్రకేసూ
19. జగిత్యాల సమితి
20. ఓరుగల్లు పునరాక్రమణ (సీరియల్)
23. అరవింద సాహిత్యము
27. వరకట్న దురాచార నిర్మూలన మార్గములు
30. తెలుగునాట కవితా విప్లవం
33. మహా భారతము (సీరియల్)
37. కొండాపురం
41. కాటేసిన కల (కథ)
45. కార్మికుల కుటుంబ పెన్షను పథకం
51. జిల్లా వార్తలు

రెండవ అట్ట :
మూడవ అట్ట : } ప్రకాశం జీవితచరిత్ర : బొమ్మల సీరియల్

నాల్గవ అట్ట :

భవిష్యత్తులోకి...... ........

సాలు చందా ఆరు రూపాయలు

వెల : 50 పైసలు

రిజిష్టరు నెం : 133

ఈ సంచికలోని రచయితలు వెలిబుచ్చిన అభిప్రాయాలు తప్పనిసరిగా ప్రభుత్వానికి సంబంధించినవిగా భావించ నక్కర లేదు.

# అభ్యుదయ పథంలో భూసంస్కరణలు

భూకమతాల గరిష్ఠపరిమితిపై సమగ్రశాసనాన్ని ప్రవేశపెట్టేలోగా భూములను అన్యాక్రాంతం చేయడాన్ని నిషేధిస్తూ యిటీవల జారీ చేసిన ఆర్డినెన్సుకు సర్వత్రా హర్షం వెల్లడైంది. వ్యవసాయ భూకమతాల గరిష్ఠ పరిమితిని తగ్గిస్తూ మౌలికమైన భూసంస్కరణలను ప్రవేశపెట్టడం ప్రభుత్వ అభిమతం. రానున్న రాష్ట్రశాసనసభ సమావేశంలో యిందుకు సంబంధించి శాసనం చేయబడుతుంది. ప్రస్తుతం భూకమతాలపరిమితిచట్టం అమలులో లేకపోలేదు. అయితే యిప్పుడు చేయదలచిన చట్టం వల్ల అసమానతలు తగ్గిపోయి, సాంఘిక న్యాయం కల్పింపబడి, వ్యవసాయోత్పత్తులు పెరగడానికి వీలు కల్పించాలని ఉద్దేశం. ఇంతవరకు అప్పుడే 4,000 ఎకరాల మిగులు భూమి స్వాధీనం చేసుకోవడం జరిగింది. దీనిని భూములేని పేదవారికి పంపిణీ చేసే ఏర్పాట్లు కూడా జరుగుతున్నాయి. ఇంకా 50 వేల ఎకరాలు అదనపు భూమి లభిస్తుందని అంచనా. ఇంతవరకు 25,743 ఎకరాల విస్తీర్ణాన్ని మిగులు భూమిగా ప్రకటించడం జరిగింది.

ఈ ఆర్డినెన్సు తాత్కాలికమైనది మాత్రమే. భూకమతాల గరిష్ఠ పరిమితి నిర్ణయిస్తూ గడచిన కాలానికి కూడా వర్తించే విధంగా కొత్త శాసనం రూపొందేవరకు మాత్రమే యీ ఆర్డినెన్సు అమలులో వుంటుంది. తమ భూములను అన్యాక్రాంతం చేయాలనే ప్రలోభం కలిగే వారు అటువంటి చర్యకు పూనుకొని డబ్బు దుబారా చేయకుండా కూడా యీ ఆర్డినెన్సు ఉపయోగపడింది. రైతులలో భయాందోళనలు రేకెత్తకుండా వుండడానికై భూకమతాల పరిమితికి సంబంధించిన వివరాలను ఈ ఆర్డినెన్సులో పేర్కొనలేదు. శాసనసభ పూర్తిగాచర్చించిన అనంతరమే భూకమతాల గరిష్ఠ పరిమితి నిర్ణయింప బడుతుంది. ఈ గరిష్ఠ పరిమితి వర్తించేవారు కొద్దిమంది మాత్రమే వుంటారనేది స్పష్టం. మిగతా వారికి యీ చట్టం వల్ల యిబ్బంది లేకపోగా ప్రయోజనమే కలుగుతుంది. అందువల్ల భూములన్నిటినీ ప్రభుత్వం స్వాధీనం చేసుకుంటున్నదని ప్రజలను భయ భ్రాంతులను చేయడంలో అర్థం లేదు. సన్నకారు రైతులు, ఒక మాదిరి భూవసతి గల రైతులు దీనివల్ల పోగొట్టుకొనేది ఏమీలేదు. పైపెచ్చు లాభం పొందుతారు కూడా. పెద్ద పెద్ద భూకమతాలుగల భూస్వాములు తమ పలుకుబడి ఉపయోగించి, రైతులకు ఉద్దేశించిన పరపతి సౌకర్యాలను, ఎరువుల సౌకర్యాలను, ఎక్కువ మేరకు తామే అనుభవించకుండా కూడా యీ గరిష్ఠ పరిమితి చట్టం తోడ్పడుతుంది.

గ్రామీణ ప్రాంతాలలో ఒకవ్యక్తికి ఎంత భూవసతి వుందో దాన్నిబట్టే అతనికి సంఘంలో గౌరవం హోదా వుండడం నిజానికి ఒక పెద్ద లోపం. ఈ కొత్త శాసనంవల్ల కొత్త విలువలు ఏర్పడతాయనేది తథ్యం. ఆ విలువలు వ్యక్తికివున్న ఆస్తినిబట్టి కాక సమాజంలో అతడు చేసిన పని, సాధించిన ఫలితాల మీద ఆధారపడి వుంటాయి. పెద్దపెద్ద భూకమతాలవల్ల తప్పని సరిగా ఎక్కువ దిగుబడులు వుంటాయని అనుకోనక్కరలేదు. ఇది మనఅనుభవంలోని విషయమే. విస్తారమైన భూకమతాలున్నవారు సమర్థవంతంగానూ తీవ్రతరంగానూ వ్యవసాయం చేయకపోవడం సర్వసాధారణంగా జరుగుతుంటుంది. చిన్నకమతాల్లో వ్యక్తిగత అజమాయిషీ వుంటుంది గనుక ఎక్కువ శ్రద్ధతో వ్యవసాయం చేసుకుని సత్ఫలితాల్ని పొందడానికి వీలవుతుంది. భూముల గరిష్ఠ పరిమితిచట్టం కేవలం సాంఘిక సంస్కరణ మాత్రమేకాదు. అది వ్యక్తులమధ్యవున్న ఆర్థిక వ్యత్యాసాల్ని తొలగించడానికీ, అధికోత్పత్తిని సాధించడానికీ తోడ్పడే చర్య. వీటన్నిటికీ మించి ప్రభుత్వం ప్రజలకు యిచ్చిన వాగ్దానాన్ని నెరవేర్చుకొనే ప్రయత్నం. ప్రభుత్వం చిత్తశుద్ధితో హృదయపూర్వకంగా ఈ చట్టాన్ని అక్షరాలా అమలుపరచడానికి దృఢనిశ్చయంతో వుంది.

గ్రామీణ ప్రాంతాల ప్రజలు ఆశతో ఎదురు చూస్తున్నారు. కేవలం వాగ్దానాలతో వారు తృప్తిపడే స్థితిలో లేరు భూసంస్కరణలకు సంబంధించిన విషయాలకు ఒక నూతన దృక్పథాన్నీ, నూతన శక్తినీ యిచ్చిన ముఖ్యమంత్రి శ్రీ పి.వి.నరసింహారావుగారు, ఓటర్లకుయిచ్చిన వాగ్దానాలనునెరవేర్చాలనే దృఢనిశ్చయంతో, ఆతురతతో కృషిచేస్తున్నారు. భూముల అన్యాక్రాంతాలను నిషేధించే చట్టాన్ని ఉల్లంఘించే అవకాశం లేకుండా ప్రభుత్వం తీసుకున్న కఠిన చర్యలే, ప్రభుత్వం యీ విషయంలో కృతనిశ్చయంతో వున్నదనేవిషయాన్ని ఋజువు పరుస్తున్నాయి.

—పి. వి. ఆర్

# దేశం బాగుపడాలంటే.....

ఈ సమావేశంలో పాల్గొనగలిగినందుకు నాకు చాలా సంతోషమైంది. మీ సమస్యను గూర్చి నాకు ఇంతకుముందే తెలుసు. మీ ప్రతినిధులను కూడా నేను కలుసుకున్నాను. మన దేశంలో అనేక విషయాలు మంచివీ, చెడ్డవీ కూడా ఉన్నాయి. స్వాతంత్ర్యోద్యమం ప్రారంభంనుంచి కూడా గాంధీజీ, మన సమాజంలో ఎంతవరకైతే ధనవంతులూ, దరిద్రులూ, గొప్పవారూ తక్కువవారూ అనే తారతమ్యం పోదో, ఎంతవరకైతే ప్రజలందరు సమానదృష్టితో చూడబడరో, అందరికీ సమాన అవకాశాలు వుండవో, అంతదాక మనకు స్వరాజ్యం పూర్తిగా లభించినట్టుగాదు; అది స్థిరమైన పునాదులపై నిలబడిందని కూడా భావించజాలము. అని చెప్పుతుండేవారు. ఇది ఒక ఉన్నత ఆదర్శం. దీనిని ఒక ప్రధానమైన మూల సూత్రంగా మనం భావించాలి. ఎందుకంటే సమాజంలో అందరూ సమానమే అనేభావం దేశాన్ని సుస్థిరం చేసి మన పురోభివృద్ధికీ, అభ్యుదయానికీ చాలా దోహదం చేస్తుంది. ఎంతవరకైతే ప్రజలందరూ దేశాభివృద్ధి కార్యక్రమాలలో కలిసికట్టుగా, సమైక్యంగా పాల్గొని పనిచేయరో అంతవరకు ఏ విధమైన అభివృద్ధీ సాధించలేరు. దేశానికి పేరు ప్రతిష్ఠలు వచ్చాయి. పెద్దపెద్ద భవనాలు, ఇళ్లు నిర్మించబడ్డాయి. మనం వాటిని చూడగలుగుతామేగానీ, వాటితో దేశాభివృద్ధిని కొలవడం సాధ్యం కాదు. దేశంలో వెనుకబడిన ప్రజలు ఏ విధంగా ఉన్నారు అనే విషయాన్నిబట్టి మనం దేశాభివృద్ధిని కొలుస్తున్నాం. మనకు స్వాతంత్ర్యం లభించిన తర్వాత పౌరులందరికి సమానమైన హక్కులు రాజ్యాంగంలో ఇవ్వబడినాయి. అయితే ఈ హక్కులవల్ల అందరూ లాభం



(భారత ప్రధాని శ్రీమతి ఇందిరా గాంధీ హైదరాబాదులో వెనుకబడిన తరగతుల మహాసభ ఆధ్వర్యంలో జరిగిన ఒక బ్రహ్మాండమైన బహిరంగ సమావేశంలో చేసిన ఉర్దూ ప్రసంగం ఆధారంగా)

పొందలేకుండా వున్నారని మనకందరికీ తెలుసు. వెనుకబడిన జాతులకు చెందిన మన సోదరీ సోదరులందరికీ హక్కులు లభించాయి. కాని దీనివల్ల వారు లాభం పొందలేకుండా ఉన్నారు. 'వెనుకబడిన తనము' అనేమాట నాకు చాలా చెడ్డ మాటగా కనిపిస్తుంది. మన మనసులోనుండి ఈ మాట ఎంత తొందరగా తొలగిపోతే అంతమంచిది. అలాంటి శుభదినం కోసం నేను ఎదురు చూస్తున్నాను. కొన్ని నియామాలు, నిబంధనలు యేర్పరచడం ద్వారా ఇది సాధించవచ్చని అనుకున్నాం. అలాంటివి ఎన్నో నియమ నిబంధనలు చేయబడ్డాయి. వాటి ప్రకారం కార్యక్రమాలు కూడా కొన్ని చేపట్టినాము. కాని ఏమయింది? ప్రతిజాతిలో నుంచి కొందరు ముందుకు వచ్చారు. అలాగే అన్ని జాతులలో నుంచి కొంతమంది ముందుకు వచ్చారు. వాళ్లలో కొందరు మాత్రమే చదువుకొని మంచి స్థానాలు సంపాదించగలిగారు. అ కొందరు ఉన్నత స్థానాలను అందుకొన్నారు. కాని ఆ జాతి యింతవరకు ఉన్నచోటే వుంది. ఏమి జరగలేదని అనడానికి వీలులేదు. కానీ జరిగిన అభివృద్ధి కొంత మందికి మాత్రమే జరిగింది. మొత్తం ఆ జాతికి జరగలేదు. అలా కొందరికి మాత్రం లాభం కలగడం అనేది పెద్ద విషయం కాదు. కొంతవరకు మంచిదైనా దానివల్ల అందరూ లాభం పొందలేదు. ఇపుడేంచేయాలి అనే ప్రశ్న మనలను ఎదుర్కొంటున్నది.

కాకాసాహేబ్ కౌన్సిలు రిపోర్టు నేను ఇంతవరకూ చూడ లేదు. నేను గయనుండి వెళ్లిన తర్వాత వెంటనే ఆ రిపోర్టు చదివి అన్ని విషయాలను అవగాహన చేసుకుంటానని బాలగోవిందజీతో చెప్పాను. ఈ విషయంలో ఎలాంటి చర్య తీసుకోవలెనో త్వరలో యోచించడం చాలా అవసరం. న్యాయం ప్రకారం చూస్తే ఇది ఒక గొప్ప బాధ్యతగల విషయం. మొత్తం సమాజం పైన ఈ బాధ్యత ఉంది. నియమాలు సక్రమంగా అమలు పరచబడుతున్నాయా? అని సమాజం కనిపెడుతూ ఉండాలి. నియమాలూ, నిబంధనలూ చాలా ఉన్నాయి. అయితే కొన్ని చోట్లలో వెనుకబడిన జాతులవారు అణగిపోయే ఉన్నారనీ, మరి కొన్ని చోట్ల దీనికి పూర్తి వ్యతిరేకంగా ఉన్నారనీ ఇప్పుడే కొండాలక్ష్మణ్ బాపూజీ నాకు తెలిపారు. రకరకాలుగా ఈ జాతులవారు బాధింపబడుతున్నారు. సమాజంలో మార్పు తీసికొనిరావడం మన లక్ష్యంలో ఒక ముఖ్యమైన అంశం. గాంధీజీ కూడా ఇది ఒక ఆదర్శంగా భావించేవారు. ఈ విషయంలో నా ఉద్దేశం వేరేవిధంగా ఉంది. ఇది ఆదర్శం కావని నేను అనను. మనం దేశంలో ఇపుడు చేయదలచుకున్న చిన్న చిన్న పనులు కూడా ఆదర్శమనవచ్చును. మనం ఒకవేళ ఈ సమస్యను పరిష్కరించకపోతే ఏపని కూడా పూర్తిచేయలేము. మన భారత దేశం బాగా సుస్థిరం కావాలని నేను కోరుతున్నాను. మనదేశంలో వెనుకబడిన తెగలుంటే అది సుస్థిరం ఎట్లా అవుతుంది? భారత దేశమంటే భూమి అనిగానీ నదులు అనిగానీ పర్వతాలు అనిగానీ కాదు. దేశమంటే భారతీయ జన సమాజమనీ, జానపద, నగరవాసులనీ అర్థం. ఎంతవరకు అయితే సంఘంలో వెనుకబడిన తరగతుల వారు ఉంటారో అంతదాక దేశం సుస్థిరమనిపించుకోలేదు. పైపైన చూడడానికి సుస్థిరత కనపడవచ్చు. కృత్రిమమైన సుస్థిరత మనకు కనపడుతూ ఉండవచ్చు. అది పునాదులపై కట్టిన సుస్థిరత మాత్రంకాదు. ఒక గొలుసులో అన్ని కడియాలు చాలా గట్టిగా ఉండి అందులో ఒక్క కడియమైనా గట్టిదికాకపోతే, బోలుగాఉంటే గొలుసు అంతా పనికిరానిది అయిపోతుంది. ఎందుకంటే ఆ గొలుసుపైన బరువు పడినా లేక ఏదైనా ఒత్తిడి కలిగినా ఆ బోలు కడియం విరిగిపోతుంది. ఇతర కడియాలు ఎంత గట్టిగా ఉన్నా ఆ గొలుసువల్ల ఏమాత్రం ఉపయోగం ఉండదు. ఈ విధంగానే సంఘంలో కూడా వెనుకబడిన తరగతులు ఉన్నంతవరకు అది దేశానికి ఒక విధంగా భారంగానే ఉంటుంది. తల్లిదండ్రులు తమ పిల్లలందరిని సమానంగానే ప్రేమిస్తారు. అయితే వారిలో ఒక పిల్లవాడు జబ్బుపడినా, లేక దుర్బలుడుగా ఉన్నా, ఆ పిల్లవాడు త్వరగా బాగుపడాలనీ, ఇకపైని ఎపుడూ, వాని జబ్బు విషయమై చింతచేయ నవసరంలేని పరిస్థితి రావాలనీ వారు కోరుకుంటారు. వాని యెడలనే తల్లిదండ్రులు ఎక్కువ శ్రద్ధ చూపుతూ ఉంటారు. అలాగే మనదేశంలో ఎందరైతే వెనుకబడిన జాతులవారున్నారో వారందరు సమాజంలో ఒకవిధంగా రోగులుగానూ, దుర్బలులుగానూ ఉంటారు. కాబట్టి సాధ్యమైనంత త్వరలో వారు మనకు సహాయపడే శక్తి సంపన్నులుగా తయారు కావటానికి తగిన సహాయం వాళ్లకు లభించేటట్లు చూడవలసిన భారం మనపై ఉంది. ఇందులో సమాజానికి ఒక స్వార్థం కూడా యిమిడి ఉంది. అదేమంటే మీకు శక్తి ఏర్పడినపుడే మీ బాధ్యతను దేశానికి పూర్తిగా వినియోగించ గలుగుతారు. సంఘంలో మార్పు తేవాలని మనం అంటూ ఉంటాం. సంఘ సేవకొరకు మాత్రమే అలా చెప్పడం జరుగుతున్నది. అనుకోకూడదు. సంఘంలో ప్రతి యింటికి, ప్రతివానికి రోగాలు కలుగుతూనే ఉంటాయి. ఇది పూర్వం నుంచి కూడా మన దేశంలో ఉంటూనే ఉన్నది. రోగాలు ఒక వ్యక్తిని, ఒక కులానిని, ఒక యింటిని ప్రత్యేకంగా కాక అందరికీ సమానంగానే కలుగుతూ ఉంటాయి. ఒక ఊళ్ళో అగ్ని మండుతూ వ్యాపించినపుడు ఆ మంటలు ముఖ్యంగా ఒక యింటికే పోతాయనీ మరో యింటికి పోవనీ చెప్పలేము. సంఘంలో వ్యక్తులందరు సమానులే. అందరికీ సమాన అవకాశాలు కల్పించే నిమిత్తం అన్ని కులాల వారికి సాంఘిక హక్కులు పూర్తిగా లభించేలాగు అతి త్వరలో కార్యక్రమాలు చేపట్టడం అవసరం.

## శాసన సభల్లో ప్రాతినిధ్యం

శాసనసభగానీ, లోకసభగానీ సాధ్యమైనంతవరకు వేరువేరుగా చిన్న చిన్న కులాల ప్రతినిధులను ఎన్నుకోవాలి అనేదే మా ప్రయత్నం. ఇలా చేయడం ఒక విధంగా మంచిదే. ఎందుకంటే ఒక మనిషి ముందుకు పోయినపుడే ఏమైనా పని చేయగలుగుతాడు. మరోవిధంగా చూస్తే యిలా వేర్వేరు కులాలకు ఎన్నికలు జరపడం మంచిది గాదనిపిస్తుంది. ఎందుకంటే ఈ కారణంగా దేశంలో కుల తత్వాలు పెరిగిపోయి ఫలానా కులానికి ప్రాతినిధ్యం యివ్వబడ లేదనీ, లేక ఫలానా కులానికి ప్రాతినిధ్యం లభించలేదనీ వాదాలు తిరిగి తలెత్తుతాయి. ఇలా చేయడంవల్ల అందరికీ మంచి జరగడానికి బదులుగా అందరూ పరస్పరం జగడాలలో పడతారు. ఇది మంచి విషయం కాదు. మనం కులం పేరుతో యోచించకూడదు. ఏ కులానికైతే యింతదాక పూర్తి హక్కులు లభించలేదో అట్టివారికి వారి హక్కులు లభించడానికి అనువైన మార్గాలను కనిపెట్టవలసి వుంది. శాసన సభలలోనూ, లోక సభలోనూ వుండే లోపాలు దూరమై దేశంలో ప్రజలందరికీ విశ్వాస పూర్వకంగా యివ్వబడిన హక్కులవల్ల పూర్తిగా లాభంపొందడానికి అనువైన విధానాలను రూపొందించడం అవసరం. అందరికీ సమానంగా హక్కులు లభించాలి అనే నినాదం మనంచేస్తున్నాం. నిజంగా చూస్తే దాని భావం అందరికీ సమానమైన అవకాశాలు లభించేలాగు మన సమాజ వ్యవస్థ యేర్పడాలి అనేది మాత్రమే. అందరూ సమానంగా వుండలేరు. కొందరు మంచి బుద్ధిశాలురుగా ఉంటారు. మరి కొందరు గొప్ప బుద్ధిశాలురుగా ఉండరు. కొందరు పొడుగ్గా ఉంటారు. కొందరు పొట్టిగా ఉంటారు. కొందరు కొన్ని పనులు చేయడానికి సమర్థులై వుంటే, మరి కొందరు మరికొన్ని పనులు చేయడానికి సమర్థులై వుంటారు. అయితే యీ యోగ్యత గానీ, నైపుణ్యంగానీ కులంపైన ఆధారపడి వుండదు. ఒకడు పెద్దకులంవాడు మరియొకడు చిన్నకులంవాడు, ఒకడు హరిజనుడు అనే వారు మన సమాజంలో ఉన్నారు. అంతమాత్రంచేత వారు అసమర్థులు, అయోగ్యులుఅని చెప్పడానికి వీలులేదు. కులాలను బట్టి యోగ్యతను నిర్ణయించడం తప్పు. సమానంగా అవకాశాలు అందరికీ లభించినపుడే ఎవనిలో ఎంత శక్తి, ఎంత యోగ్యత ఉన్నదీ తెలుస్తుంది. మేము బీహారులో అనేక సంవత్సరాల క్రిందట ఒక పాఠశాల తెరిచాం. దానిలో విద్యావంతుల పిల్లలు మాత్రమే

వచ్చి చేరుతుండేవారు. స్కాలరుషిప్పు ఎవరికైనా లభించవచ్చును. ధనవంతులు, యింకా అటువంటి వారు యీ పాఠశాలలకు రాకుండా ఉండేలా చూడాలని మా ప్రయత్నంకాదు. కానీ అన్నివర్గాలకు చెందిన పిల్లలు ఆ పాఠశాలలకు వచ్చి సమానమైన అవకాశం పొందడంచేత చాలా మంది విద్యలో యోగ్యులుగా తయారయ్యారు. చాలా మంది మన సైనికులలో కొన్ని ప్రాంతాల వారు బాగా యుద్ధం చేసేవారనీ యితర ప్రాంతాలవారు యుద్ధం చేయలేరని, వీరులు కారని, శూరులు కారనీ అనుకుంటుంటారు. కాని వారికి శిక్షణ యిచ్చిన తర్వాత ఎవరూ శౌర్యములో తగ్గినవారు కాదని మనకు తెలిసింది. వాళ్ళు మద్రాసువాళ్ళైనా, హైదరాబాదు వాళ్ళైనా మరి యే యితర ప్రాంతం వారైనాసరే మన సైన్యంలో సమస్త భారత దేశవ్యక్తులు ఉన్నారు అన్ని కులాలవారూ, అన్ని మతాలవారూ ఉన్నారు. అన్నిభాషలవారూ ఉన్నారు. వీరచక్రం ఎవరెవరికి లభించినది మహావీరచక్రం ఎవరెవరికి లభించింది. ఆ జాబితాను చూడండి. లేదా ఆస్పత్రులలో క్షతగాత్రులుగా పడివున్నవారిని చూడండి వారిలో అన్ని మతాలవారూ, అన్ని భాషలవారూ, అన్ని ప్రాంతాలవారూ మీకు కనబడతారు. ఒకడు ఒక పనిచేస్తుంటే వాడు యెల్లప్పటికీ అదే పని చేస్తుండాలి, వేరేపని చేయకూడదు అనేమాటలో ఏమాత్రం సత్యంలేదు. కొన్నిపనులు నీచమైనవి అనేమాట వింటే గాంధీజీకి చాలా కోపం వస్తూండేది. అలా అనేపద్ధతి మన సంఘంలో ఉన్నది. ఏపనీ నీచమైనది కాదు. ఎందుకంటే ఆపని ఆగిపోతే మొత్తం సంఘానికే యిబ్బంది బాధ ఏర్పడుతుంది. ఒక కులం వారు ఒకపనే చేస్తూవుండాలనడం చాలా తప్పు. ఎవనికి ఏపని చేయడానికి అభిలాష ఉంటుందో, ఆపని చేసే నేర్పు ఉంటుందో వాడు ఆపని చేయవచ్చు. ఏపనీ చిన్నదికాదు, పెద్దదికాదు. చిన్నపనులు పూర్తికాకపోయినపుడు ఎవడు కూడా పెద్ద పనిని చేయజాలడు. చిన్నపనుల నుంచే పెద్దపనులవుతాయి. కేంద్ర ప్రభుత్వం దృష్టిలో పౌరులందరు దేశంలోని అన్ని ప్రాంతాలవారు సమానమేకానీ ఎవరికైతే యింతదాక అన్యాయం జరిగిందో, లేక ఏ ప్రాంతంలోగానీ, జిల్లాలోగానీ వెనుకబడిన ప్రజలు ఉన్నారో అట్టివారిపట్ల మనం ఎక్కువ సానుభూతి చూపించవలసివున్నది. అలాంటివారికి అతిత్వరలో సహాయం చేయవలసివున్నది. ఎంత త్వరగా వాళ్లు సంఘానికి సేవచేయగలుగుతారో అంతత్వరలోనే మనదేశం యొక్క పునాదులు గట్టిపడతాయి. మనం మనదేశాన్ని ఉన్నతస్థితికి తీసుకుపోగలుగుతాం. ఈ పనిలో అందరూ నడుంకట్టి ముందుకుసాగాలి.

## ఐక్యతాశక్తి

ఏదైనా సంకటస్థితి వచ్చినపుడు, కష్టాలు, అపాయాలు కలిగినపుడు అందరూ ఏకమై ఒక త్రాటిమీద నడుస్తున్నారు అనే విషయం యిప్పుడిప్పుడే రుజువుపరచి చూపించాం. అలాంటి సంకట పరిస్థితుల్లో అందరూ తమ పరస్పర ద్వేషాలు జగడాలు మరచిపోతారని కూడా రుజువుపరచాం. ఇది మన అద్భుతమైన శక్తి. ఐక్యత అంటే యిదే. మన ఈ ఐక్యతే యే సమస్యలనైనా పరిష్కరించగలుగుతుంది. సంఘంలో ఉండే దురాచారాలను పోగొట్టే కార్యక్రమం ఒక పెద్దస్థాయిలో జరుపవలసినపని అని కొందరు అనుకుంటారు. కానీ ఈ పని ప్రతి కుటుంబంలోను చేయవలసివుంది. ఇందుల్లో మన సంఘంలో గలిగే బాధఏమంటే ఉన్నత కులాలవారు కొందరు కొన్ని కులాల వారిని నీచకులాలవారని తలుస్తారు. కాబట్టి అట్లాతలచే ఉన్నత కులాలవారు చెడ్డవారని అంటారు. కానీ యిలాంటి తారతమ్య భావం వెనుకబడిన కులాల్లో కూడా వుంది వాళ్లు కూడా పరస్పరం యిలాగే భేదభావంతో వుంటారు వాళ్లు తమకుతాము అలా చేయకూడదని తలచినపుడు పని సులభం అయిపోతుంది. ఇతరులు వాళ్లను చూచి నేర్చుకునేలాగు మెలగడం చాలా అవసరం దీనివల్ల మొత్తం సంఘం యొక్క దృష్టి కోణంలో కూడా మార్పు తీసుకురావచ్చు. దీనితోపాటే కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల బాధ్యతకూడా ఎక్కువగావున్నది. ఈ కార్యక్రమంలో ఎదురయ్యే యిబ్బందులను తొలగించడానికి రెండు ప్రభుత్వాలు పూర్తిగా ప్రయత్నించవలసి వుంటుంది. ముఖ్యంగా ప్రభుత్వ అధికారులపైన కూడా బాధ్యత ఎక్కువగా వుంటుంది. వాళ్లు జిల్లాజిల్లాకు, గ్రామ గ్రామానికి వీధి వీధికి తిరిగి ఎక్కడయితే మన విధానాలు అమలు జరగడంలేదో, ఎక్కడైతే అన్యాయాలు, అక్రమాలు జరుగుతున్నవో అక్కడంతా పరిశీలించి వాటిని తొలగించడానికి పూర్తిగా ప్రయత్నించాలి. ఈ కార్యక్రమంలో ఎట్టిచర్య తీసికోవలసి వుంటుందో దానిని వారే పరిశీలించి నిర్ణయించుకోవలసి వుంటుంది. తిరిగి యిటువంటి లోపాలు కలగకుండా ఉండడానికి తగిన కార్యక్రమాలు చేపట్టి నడపవలసివుంటుంది. మీరందరూ ఈ మహాకార్యక్రమంలో విజయాన్ని సాధించడానికి గాను నేను మీకు నా హృదయపూర్వక శుభాకాంక్షలను అందచేస్తున్నాను. మనం సహాయం చేయవలసిన ప్రజలు అధిక సంఖ్యలో ఉన్నారు. కాబట్టి ఈ పని అంతసులభసాధ్యంకాదు అయినా మనం నవభారత దేశం ఏ భారాన్ని అయినా వహించగలమనీ, ఏపనైనా చేయగలదనీ నిరూపించి చూపించాం ఒక్కొక్క అడుగు ముందుకు వేస్తూపోతే మనం గమ్యస్థానం చేరుకోగలం. ఈ పని ఒక్కసారే గారడీవలె చేయడానికి వీలుకాదు. ఎంత త్వరగా ఈ పని మనం ప్రారంభిస్తామో అంతత్వరలోనే అది పూర్తికాగలుగుతుంది. ఆంధ్రప్రదేశ్‌లో ముఖ్యంగా చూడవలసిందేమంటే ఈ కార్యక్రమంలో యెలాంటి ఆటంకాలు వస్తున్నాయి; కొందరి మనస్సుల్లో కొన్ని తప్పుడు ఊహలు ఉంటే వాటిని యేవిధంగా తొలగించాలి అనే విషయాలను కూడా పూర్తిగా విచారించవలసి వున్నది ఇంతేకాక తప్పుచేసిన వారిని ఎలా దండించాలి? అని కూడా విచారించాలి. సంఘంలో ఎవరు కూడా యిటువంటి తప్పులను చేయజాలకుండేలాగు మీరు చూస్తూఉండాలని నేను విజ్ఞప్తి చేస్తున్నాను.



# "నా ఆలోచన ఎప్పుడూ సామాన్యుణ్ణి గురించే"

—ముఖ్యమంత్రి

"నా ఆలోచన ఎప్పుడూ సామాన్యుణ్ణి గురించే. ప్రస్తుతం అంతంతమాత్రంగానే వున్న ఆర్థిక వ్యవస్థను పునర్వ్యవస్థీకరించడమే ప్రస్తుత తక్షణ కర్తవ్యం" అని ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ పి. వి. నరసింహారావు "స్టేట్స్‌మన్" విలేఖరికి యిచ్చిన ఇంటర్వ్యూలో తెలియజేశారు. 'ముఖాముఖి' శీర్షికతో స్టేట్స్‌మన్ పత్రికలో ధారవాహికంగా వచ్చే పరిచయం క్రింద ఈ ఇంటర్వ్యూ ఏర్పాటు చేయబడింది.

ఇంటర్వ్యూ సందర్భంగా స్టేట్స్‌మన్ పత్రిక విలేఖరి అడిగిన ప్రశ్నలూ, వాటికి ముఖ్యమంత్రి యిచ్చిన సమాధానాలూ—

ప్రశ్న: చదువుకొనే రోజుల్లో మీరు గణితశాస్త్రంలో నిష్ణాతులై రేంగ్లర్ కావాలని అనుకున్నారేమో కదా మరి ఇప్పుడు అదంతా గుర్తొస్తే మీకు ఏమనిపిస్తుంది?

జవా: నిజమే. చదువుకొనే రోజుల్లో లెక్కలు అంటే పడిచచ్చే వాడిని. గణితశాస్త్రంలో నా అభిరుచి ఆ తరువాతికాలంలో నాకు ఆయా విషయాలను సరిగా పరిశీలించేందుకూ, క్షుణ్ణంగా అర్థం చేసుకునేందుకూ తోడ్పడిందని నేను తరచుగా అనుకుంటూ వుంటాను. ఇది నా ప్రజా జీవితానికి ఎంతగానో తోడ్పడింది.

ప్రశ్న: ఆరునెలల క్రితం మీరు ముఖ్య మంత్రి అయ్యారు. ఇప్పుడు మళ్ళీ అయ్యారు. అయితే అప్పటికీ యిప్పటికీ రాజకీయ వాతావరణంలో మార్పువచ్చింది కదా. దీనిని దృష్టిలో పెట్టుకుని అప్పుడు మీకు ఎలా అనిపించిందో, ఇప్పుడు ఎలా అనిపించిందో కాస్త తెలియజేస్తారా ?

జవా: మొదటిసారి ముఖ్యమంత్రి అయినప్పుడు ఆ అనుభవమే నాకు కొత్తగా వుంది. కాని ఆ తర్వాత అలా అనిపించలేదు. ఈనాడు నాకు మరింత విశ్వాసం కలిగింది. అయితే ఒక విషయం మాత్రం చెప్పాలి. ఈ రెండు సందర్భాలలో కూడా నాకు ఒకలాగే అనిపించింది.

ప్రశ్న: శాసనసభలో వెనుకబడిన తరగతులవారికి బలహీన వర్గాలవారికి ఎక్కువ ప్రాతినిధ్యం ఇవ్వాలని మీ పార్టీ ఒక ప్రయోగం చేసింది కదా. ఇది ఏవిధంగా సమాజంలో హెచ్చుతగ్గులు లేకుండా సమానతను కాపాడడంలో తోడ్పడుతుందని మీరు అనుకుంటున్నారు ?

జవా: అసలు దీన్ని ప్రయోగం అని నేను అనను. ఎప్పుడో జరుగవలసిన పని యిది. రాజకీయమైన చర్య ఇది. సరైన పద్ధతని నా విశ్వాసం. సమాజంలో హెచ్చుతగ్గుల్ని రూపుమాపి సమసమాజస్థాపనకు తోడ్పడుతుందని గట్టి నమ్మకం నాకు వుంది.

ప్రశ్న: కాంగ్రెసు వ్యవస్థలో పాతుకుపోయిన కొన్ని కులాల వారిమీద యీ ప్రయోగం, ప్రభావం ఏ విధంగా వుంది? పెద్ద ఎత్తున ఆర్థిక కార్యక్రమాలను అమలు పరచడానికి యిది తోడ్పడిందంటారా? లేక అడ్డు పడిందంటారా? ఒకవేళ సాంఘిక సమానత్వాన్ని ప్రతిష్ఠించడానికి పాటుపడుతున్న శక్తులకు సవాలుగా స్వార్థపూరిత శక్తులు సమీకరించుకోడానికి వీలు కలిగించినట్లవుతుందా ?

జవా: ఈ కొత్త పరిష్కారమార్గానికి కాంగ్రెసు సంస్థలోని అన్ని వర్గాల వారూ స్వాగతం పలికారనే చెప్పవచ్చు. ఆర్థిక కార్యక్రమాలను అమలు పరచడంవల్ల యిదుముందు ఎంతో మేలు చేకూరగలదు. సాంఘిక న్యాయానికిసంబంధించిన నూతన శక్తులు చాలా శక్తివంతమైనవి. వాటిని ఎవరూ అణచివేసే ప్రమాదం ఎంత మాత్రం నాకు కనిపించడం లేదు.

ప్రశ్న: తెలంగాణాలో ఓటర్లు వేర్పాటు ధోరణిని చివరకు వదిలివేశారని మీరు అనుకుంటున్నారా? సమైక్యతా రాష్ట్రం కొనసాగింపుకు యిక ఏలాటి అవాంతరం లేదని మీరు భావిస్తారా?

జవా: సమైక్యత శక్తులు బలపడ్డాయనే నేను భావిస్తున్నాను.

ప్రశ్న: ఇప్పుడు మీ పరిపాలన యంత్రాంగం వెనువెంటనే చేపట్టవలసిన ముఖ్యమైన కార్యం ఏదని మీరు అనుకుంటున్నారు?

జవా: ప్రస్తుతం అంతంత మాత్రంగానేవున్న రాష్ట్ర ఆర్థిక వ్యవస్థను పునర్వ్యవస్థీకరించడమే సత్వరం చేపట్టాల్సిన పనిగా నేను భావిస్తున్నాను. మరో ముఖ్యమైన పని—బలహీన వర్గాల వారి కార్యక్రమాలను కూడా వెంటనే చేపట్టడం.

ప్రశ్న: పరిపాలనా యంత్రాంగం లోపాలను తొలగించి సామాన్యుని చైతన్యవంతుణ్ణి చేసే ప్రయత్నంలో మీకు ఆటంకం ఏముంది ?

జవా: నేను ఎరిగినంత వరకు అలాంటి కృషిలో నన్ను ఆటంక పరచేది ఏమీలేదు. నా లక్ష్యాలేవిటో నేను తెలుసుకోవాలి. ఈ లక్ష్యాల్ని సాధించడంలో త్వరపడాలి నేను. సామాన్యుని చైతన్యవంతుని చెయ్యగలనని చెప్పలేను. కాని నా ఆలోచనలు ఎప్పుడూ సామాన్యుణ్ణి గురించే. నా ఆలోచనల పరిధికి సామాన్యుడే కేంద్రం.

# త్వరలోనే శ్రీశైలం ప్రాజెక్టు —

పి. వి. నరసింహారావు

శ్రీశైలానికి ప్రతియుగంలో ఏదో ఒక ప్రాముఖ్యత వుంటూ వచ్చింది. నాడు శ్రీశైలమల్లికార్జునుడి ప్రాముఖ్యం. అది నాటికీ నేటికీ వుంది. ఇక మీదకూడా వుంటుంది ఈనాడేమో ఆధునిక దేవాలయం అనిపించుకొనే ఒక బ్రహ్మాండమైన ప్రాజెక్టు. ప్రాకృతికంగా మనకు ఉపలబ్ధమయ్యేటువంటి శక్తిని ఇక్కడ సమీకరించుకొనేటువంటి ప్రాజెక్టు: ఒకవైపు దైవశక్తి, మరోవైపు ప్రాకృతికశక్తి. ఈ రెండిటికీ సమ్మేళనం కుదిర్చేటువంటి ఈ స్థలం మనందరికీ ఎంతో పూజనీయమైనది. చరిత్రాత్మకమైనది. అందుకనే పునరావృతమవుతూవున్నది. మన చరిత్ర అనిపిస్తుంది. ఆనాడు ప్రముఖంగా వున్నటువంటి కేంద్రాలన్నీ కూడా మరొక విధంగా ఈనాడు ప్రాముఖ్యాన్ని సంపాదిస్తూవున్నాయి. వాటిని మరొక విధంగా ఆధునికమైనటువంటి అన్ని పరికరాలతో అన్ని హంగులతో ప్రముఖ కేంద్రాలుగా మనం రూపొందించుకొంటున్నాము. ఇది చాలా ముఖ్యమైనటువంటి విషయం. దేశంలో మన సంస్కృతీ మన చరిత్ర ఖండితం కాలేదు. అఖండంగా నడుస్తున్నవి. ఇక్కడికి అయిపోయింది. ఇంకొక యుగం వచ్చింది. అనే మాట కాకుండా, నిరంతరం నడుస్తున్నటువంటి కృష్ణానదిపలెనే మన సంస్కృతి కూడా నడుస్తూవుండడం ఇక్కడ కనపడుతూ వున్నది. అందుకని ఈనాడు ఉభయప్రాంతాలను కలిపి ఈ రెండు జిల్లాలవారికేకాక, హైదరాబాదు నుంచి కూడా శ్రీశైలానికి వచ్చే వేలాది ప్రజానీకానికి. వేలాది యాత్రికులకూ సౌకర్యం కల్పించే ఈ వంతెన ప్రారంభోత్సవం జరగడం అందరికీ ముదావహంగా వుంది. ఇది ఎంతో ఉపయోగపడుతుందనడంలో సందేహంలేదు. సాంకేతిక నైపుణ్యంలో కూడా ఈ వంతెన కొంత ప్రాముఖ్యం కలిగివున్నది. ఇంత ఎత్తైనవంతెన ఇంతవరకు ఎక్కడా కట్టబడలేదు. దీంట్లో సాంకేతికంగా ఎన్నో చిక్కులు వచ్చినాయి. శ్రీశైలం ప్రాజెక్టులో వచ్చిన సాంకేతికమైనటువంటి చిక్కులు బహుశా ప్రపంచంలో ఏ ప్రాజెక్టులో రాలేదు వాటిని ఎట్లా పరిష్కారం చెయ్యాలనే విషయంలో ప్రపంచమంతటా వున్నటువంటి పేరుపొందిన ఇంజనీర్లంతా వచ్చి కూడా పరిశీలించారు. చివరకు మళ్లీ మన ఇంజనీర్లు మాత్రమే దానికొక మార్గాన్ని సూచించి ఆ సమస్యలన్నిటినీ పరిష్కారంచేశారు. ఇది కూడా మనమందరం గర్వించదగిన విషయం. శ్రీశైలం ప్రాజెక్టు తప్పక పూర్తి అవుతుంది. ఎన్ని సంవత్సరాలనేది చాలా విషయాలమీద ఆధారపడి వుంటుందిని కాని మన చేతిలో వున్నటువంటి వనరులు. వాటి దృష్ట్యా దీనిని వీలైనంత త్వరలో పూర్తి చేయాలనే ఆదుర్దా ప్రభుత్వానికి వుందని మాత్రం నేను మనవి చేస్తున్నాను. 770 మెగావాట్ల విద్యుచ్ఛక్తి మనకు వస్తుందన్నప్పుడు మరి దానిని గురించి మనం ఆలస్యం చేస్తే ఎవడికి లాభం? ఖర్చులు పెరిగి పోవడం, వడ్డీలు పెరిగి పోవడం మనకు వచ్చేటువంటి విద్యుచ్ఛక్తి రాకుండా పోవడం. దాని వల్ల మనకు వచ్చేటువంటి ఉపయోగాలన్నీకూడా ఆలస్యం కావడం: ఇవన్నీ కూడా ఎవరూ కోరేటువంటి విషయాలు కావు అయితే ఈనాడు పరిమితులు కొన్ని వున్నాయి. వాటికి లోబడి వీలైనంత త్వరలో దీన్ని పూర్తిచేయడానికి తప్పక ప్రయత్నం చేస్తాము. ఈనాడు ఆంధ్రప్రదేశ్‌లో అందరు విద్యుచ్ఛక్తి కొరతతో నీటి కొరతతో బాధ పడుతున్నాం, నీటి కొరత ఒక నెలరోజులలో ఎలాగో పోతుంది. ఒక వర్షం పడిందంటే, నాలుగు వర్షాలు పడినాయంటే ఈ కొరత సందరూ మరచిపోతారు. కాని, విద్యుచ్ఛక్తి కొరత మాత్రం కోటాను కోట్ల రూపాయలు ఖర్చుపెడితేనే తప్ప పూరికే పోయేటువంటి కొరత కాదు ఇంక రెండు మూడు సంవత్సరాలలో మనం ఏమి చేసినాసరే, మన దగ్గిర వుత్పత్తి అయ్యే విద్యుచ్ఛక్తి మనకు చాలదు, అదనంగా చేసుకోవలసి వుంటుంది అని విశేషజ్ఞులు చెబుతున్నారు. ఈనాడు మన ప్రణాళికలో మనకు ఒక పెద్ద ద్వంద్వ సమస్య వచ్చింది. మనమీ ప్రాజెక్టులపైన ఎక్కువ డబ్బు ఖర్చు పెట్టడమా లేక సాంఘిక సంక్షేమంమీద ఖర్చు చేయడమా? కోటానుకోట్ల ప్రజానీకానికి ఇంతవరకు ఏమీ దారి దొరకలేదే! ఎక్కడివాళ్లు అక్కడేవున్నారు. వాళ్ళకు చదువులేదు, సంధ్యలేదు, ఆరోగ్యంలేదు. ఏమీ లేనటువంటి పరిస్థితుల్లో వాళ్ళున్నారు. సోషల్ సర్వీసెస్ అనే కార్యక్రమం పూర్తిగా కుంటుపడిపోయింది. ఇరవైఅయిదు సంవత్సరాలుగా ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్‌లో ఇతర రాష్ట్రాలతో పోల్చి చూచినట్లయితే మన దగ్గర ఈ కార్యక్రమం చాలా కుంటుపడిపోయింది దీనికి కారణాలేవో మనకుతెలుసు. బ్రహ్మాండమైన, ప్రాజెక్టులు మనం నిర్మించుకున్నాం. ఆ ప్రాజెక్టులకు వందల కోట్లు మనం ఖర్చు పెట్టుకున్నాం. ఆ ప్రాజెక్టులను చూపి మనం

ఈనాడు గర్వపడుతున్నాం. వాటివల్ల లాభపడుతున్నారు కొందరు. కొన్ని జిల్లాలవారు, కొందరు కాని దానివల్ల యావత్ రాష్ట్రంలో కూడా మనం ఈ సాంఘిక సంక్షేమానికి సంబంధించినటువంటి కార్యక్రమాలు ఈ కోటానుకోట్ల ప్రజానీకానికి మనం చేయవలసిన కార్యక్రమాలు అవన్నీ కూడా కుంటుపడినాయి. కాస్త మళ్ళీ మనం సర్దుబాటు చేసుకోవలసిన సమయం వచ్చింది ఇదుగో, ఆగండి ఇంకొక 5 సంవత్సరాలు మా శ్రీశైలం అయిన తరువాత మీమాట ఆలోచిస్తామంటే ఎవ్వరూ వినడానికి సిద్ధంగాలేరు. కాస్త ఆగండి 5 సంవత్సరాలు! మా వంశధారనో లేకపోతే నాగార్జునసాగరు 2వ దశ పూర్తి అయిన తరువాత అప్పుడు మీ విద్యను గురించి, మీ బడిని గురించి మీ ఆరోగ్యాన్ని గురించి ఆలోచిస్తామంటే ఎవ్వరూ వినడానికి సిద్ధంగాలేరు అందుకని ఈనాడు ప్రజల మానసిక పరిస్థితి ఏమిటో కూడా మనం గ్రహించవలసిన అవసరం వున్నది. దానిని మనం కాదనలేము. దీన్ని కాదని కళ్ళు మూసుకుంటే మాత్రం మనం చాలా వెనుకబడిపోతాము. ఆర్థికంగా మనకు పునాది అయ్యేటువంటి పెద్ద పెద్ద ప్రాజెక్టులు మనకు కావాలి. దాని వెనువెంటనే, మరి ఈనాడు ఈతరం వారికి ఈనాడు వున్నటువంటి పిల్లలకి ఈనాడు ఉసూరోమని బాధపడుతున్నటువంటి ప్రజలకు కూడా వచ్చే 5 సంవత్సరాలలో మనమేదో కాస్త మెరుగైనటువంటి పరిస్థితి చూపించలేకపోతే వాళ్ళుమాత్రం మనలను క్షమించరు ఈ రెండింటిమధ్య ఏదో ఒక విధంగా సర్దుబాటు చెయ్యక తప్పదు. ఈ సంవత్సరం, విద్యకు కాస్త ఎక్కువ కేటాయించడం జరిగింది. ఒక 30 లక్షలు 40 లక్షలు ఇదివరకు మన అనుభవం ఏమిటంటే, ఎప్పుడు కోతపెట్టవలసి వచ్చినా విద్యారంగాన్ని మొట్టమొదలు కోత పెట్టేవారు ఇప్పుడు కోతపెట్టడమనేది మాని, ఒక 30, 40 లక్షలు దానికి అదనంగా కేటాయించాము. అట్లాగే యీ సాంఘిక సంక్షేమానికి సంబంధించిన కార్యక్రమాల్లో కూడా వీలైనంతవరకు వాటిని కోతకు గురిచేయకుండా కాస్త ఎక్కువ కేటాయించడానికి ప్రయత్నంచేస్తూ వున్నాము. దానివల్ల వాళ్ళేదో ఉద్ధరింపపడతారనేమాటకాదు. కాని యిదివరకుకన్నా యిప్పుడు కాస్త మెరుగైనటువంటి పరిస్థితి. అయితే యీ పెద్ద పెద్ద ప్రాజెక్టులు రావాలన్నప్పుడు ఎవరి దగ్గరికో అప్పుకు పోవడమో, ఎక్కడినుంచో తెచ్చుకోవడమో, కేంద్ర ప్రభుత్వాన్ని అర్థించడమో ఏదో విధంగా కాస్త మనం వత్తిడి తీసుకొచ్చి యివి తొందరగా అయ్యేట్లు చేయాల్సి వస్తుంది అక్కడా యిక్కడా ఏదో సేకరించి 10 లక్షలు 5 లక్షలు అంటే వీళ్ళకు ఒక పూట, ఒక గంట ఖర్చుకు చాలదు 10 లక్షలు తెచ్చామంటే పాపం వీరవారు బాగుంటారు. ఎక్కడో ఒక జిల్లాలో మనం 10 లక్షలు యిచ్చి వాళ్ళకు స్కాలర్‌షిప్పులు యిచ్చామంటే చాలామంది పిల్లలు బాగుపడతారు. కాని శ్రీశైలం ప్రాజెక్టు ఛీఫ్ ఇంజనీరుగారికి 10 లక్షలు యిస్తే గంటసేపట్లో ఖర్చుపెడతారు. ఏమిటి లాభం అందుకని యిక్కడ కోట్లమాట పది కోట్లో, 20 కోట్లో, 30 కోట్లో ఎక్కడినుంచో కొట్టుకురావాలి అప్పుడుగాని యివన్నీకావు పార్లమెంట్లో ఉన్న సభ్యులు, మేము అంతా కలిసి యీ పని చేస్తాం తప్పకుండా యీ పెద్ద పెద్ద ప్రాజెక్టులు కావాల్సిందే వీలైనంత త్వరలో వీటిని చేసుకోవాల్సిన అవసరం వుంది. వీటిని గురించి కూడా క్షుణ్ణంగా, జాగ్రత్తగా ఆలోచించి ఏర్పాటు చేస్తామని మనవి చేస్తున్నాను. శ్రీశైలం ప్రాజెక్టు భవిష్యత్తు ఏమిటి? ఎప్పుడు చేస్తారు? ఎన్నడు పూర్తి అవుతుంది? అని చెప్పి అటు కార్మికులు ఇటు ఇంజనీర్లు యిక్కడ పనిచేసేటటువంటివారు, నాయకులు అందరూ కూడా ఆదుర్దాపడుతున్నటువంటి సందర్భంలో నేను వారికి మనవి చేస్తున్నాను దీనిని మరి మన పరిమితులకు లోనయ్యే వీలైనంత త్వరలో పూర్తి చేయడానికే ప్రయత్నం చేస్తాము. ఈ పరిమితులను కూడా అధిగమించి, అదనంగా ఏమైనా దీని కొరకు ప్రత్యేకమైన సహాయం చేయడానికి అవకాశం ఎంతవరకుందో వెంటనే చూచి ఆ అవకాశాన్ని కూడా పూర్తిగా వినియోగించుకోవడం జరుగుతుంది.

(1972 మే 1వ తేదీన శ్రీశైలంలో వంతెన ప్రారంభోత్సవ సందర్భంలో ముఖ్యమంత్రి చేసిన ప్రసంగం ఆధారంగా)

---

# వ్యవసాయ భూముల అన్యాక్రాంతం నిషేధిస్తూ ఆర్డినెన్సు

దేశంలో భూసంస్కరణలను గురించి కేంద్రసంఘం చేసిన సిఫారసులను అనుసరించి, వ్యవసాయభూములకు పరిమితి విధించే విషయమై రాష్ట్ర ప్రభుత్వం తీవ్రంగా ఆలోచిస్తున్నది. అయితే ఈ లోపల భూములు భారీ యెత్తున ఏదో ఒక విధంగా అన్యాక్రాంతమై భూముల పరిమితికి సంబంధించిన శాసనం విఫలప్రయోజనం అయ్యే ప్రమాదం వున్నందువల్లనూ, రాష్ట్ర శాసనసభ ప్రస్తుతము సమావేశంలో లేనందువల్లనూ, రాష్ట్రగవర్నరు, వ్యవసాయ భూముల అన్యాక్రాంతాన్ని నిషేధిస్తూ 1972 మే 2వ తేదీన ఒక ఆర్డినెన్సు జారీ చేశారు. రాష్ట్ర శాసనసభ ఈ విషయంలో ఆమోదించేంత వరకు ఈ ఆర్డినెన్సు అమల్లో వుంటుంది.

ఆర్డినెన్సులోని 6వ సెక్షను ప్రకారం, ఆర్డినెన్సు అమల్లోకి వచ్చిన తేదీనుంచి, నిర్ణీత పరిమితికన్నా యెక్కువ భూములు వున్నవారు ఆ భూములను కానీ, వాటిలో కొంత భాగాన్ని కాని విక్రయించడం, బహుమానం క్రింద ఇవ్వడం, తాకట్టుపెట్టడం, భాగాలుగా పంచడం లేదా ట్రస్టుగా ఏర్పాటుచేయడం మున్నగు విధాలుగా అన్యాక్రాంతం చేసినట్లయితే, అది చెల్లనేరదు. ఇదే విధంగా కుటుంబసభ్యులకు నిర్ణీత పరిమితికంటె ఎక్కువగా భూములు వున్నట్లయితే, కుటుంబంలోని ఏ సభ్యుడు కూడా అన్యాక్రాంతం చేయడానికి వీలులేదు. ఈ నిషేధం, డిక్రీ అమలులో విక్రయాలకు, సివిల్‌కోర్టు ఉత్తరువులకు లేక ఇతర అధికారిక తీర్పులకు ఉత్తరువులకు కూడా వర్తిస్తుంది. "కుటుంబం" అంటే ఒక వ్యక్తి, అతని భార్య, లేక ఆమె భర్త వారి మైనరు పిల్లలు అందరూ కలసి కుటుంబంగా పరిగణించబడుతారు ఒక వ్యక్తి తాలూకు భూములు లెక్కపెట్టవలసివచ్చినపుడు అవిభక్త కుటుంబంలో అతనికి రావలసిన వాటా ఎంత వుంటుందో అదికూడా లెక్కకట్టబడుతుంది.

ఈ ఆర్డినెన్సు క్రింద భూమి పరిమితి మాగాణిభూము విషయంలో 4 హెక్టార్లు, మెట్టవిషయంలో 10 హెక్టార్లు నిర్ణయించబడింది. మాగాణి భూమిఅంటే, రెవిన్యూ లెక్కలలో మాగాణిగా రిజిస్టరైన భూమి మాత్రమే కాక ప్రభుత్వ నీటి పారుదల వనరులకుచెందిన ఆయకట్టు క్రింద వున్న భూములు 1381 ఫసలీకి ముందున్న మొదటి మూడు ఫసలీల కాలంలో ఎప్పుడైనా ప్రభుత్వ నీటిపారుదల వనరుల క్రింద నీటి సహాయంతో సాగు అయిన భూమి కూడా మాగాణి భూమిగా పరిగణించబడుతుంది.

ఆర్డినెన్సులోని 6వ సెక్షను ప్రకారం, 1908 సం. రిజిస్ట్రేషన్ చట్టంలోని 47వ సెక్షనులో ఏది పేర్కొనబడివున్నప్పటికి, భూముల అన్యాక్రాంతం లేక భాగపరిష్కారం, లేదా ట్రస్టు ఏర్పాటుకు సంబంధించిన డాక్యుమెంటు ఆర్డినెన్సు జారీ అయిన తేదీ లేక ఆ తరువాత రిజిస్టరు అయినట్లయితే అది రిజిస్టరయిన కాలం నుంచి మాత్రమే అమల్లోకి వస్తుంది. ఈ విషయంలో, అన్యాక్రాంతానికి మున్నగువాటికి చెందిన డాక్యుమెంట్ల రిజిస్ట్రేషనుకు సంబంధించిన ఆర్డినెన్సు నిబంధనలు అమలుపరచడానికి ప్రత్యేకంగా నియమావళి తయారుచేయబడుతున్నది. భూముల అన్యాక్రాంతం చేయదలచుకొన్న వ్యక్తులు ఈ విషయంలో తగిన డిక్లరేషనులు దాఖలు చేయడానికి ఈ నియమావళిలో సూచనలు పేర్కొనబడి వుంటాయి.

ఈ నిషేధం తాత్కాలికమైనది మాత్రమే. ప్రస్తుతం వున్న వ్యవసాయ భూపరిమితిని, పునః పరిశీలించి ఈ పరిమితిని తగ్గించడానికి శాసనం తయారయ్యేంతవరకు మాత్రమే ఈ నిషేధం అమల్లో వుంటుందని ప్రభుత్వం స్పష్టం చేస్తున్నది. సాధ్యమైనంత త్వరలో అనువైన చర్యలు తీసుకోవడానికి ప్రభుత్వం అన్ని విధాలా కృషి చేస్తుంది.

# సామాన్యులలో అసామాన్యుడు

అఖిల భారతస్థాయి నాయకులలో అగ్రశ్రేణికి చెందిన శ్రీ దామోదరం సంజీవయ్యగారు మే 7వ తేదీ ఆదివారం రాత్రి 51 వ ఏట అకాల మరణాన్ని పొందారు. వారి జన్మస్థానము కర్నూలు జిల్లా పెద్దపాడు. నిరుపేద హరిజన కుటుంబంలో 1921 ఫిబ్రవరి 14వ తేదీన జన్మించారు. పుట్టడంతోనే 5 రోజులలోనే తండ్రిని గోల్పోయారు. తండ్రిని పొట్ట బెట్టుకున్నాడన్న కినుకతో కుటుంబంలో మొదట్లో ఆయనపట్ల నిర్లక్ష్య వైఖరి అవలంబించబడింది. ఒకసారి కుడితితొట్టిలో పడిపోయాడు. అదృష్టవశాత్తు ఎవరోచూసి పైకి తీశారు. అప్పుడు ఈతడు రాష్ట్రనాయకుడు, దేశనాయకుడు కాబోతున్నాడని ఎవ్వరూ ఉహించి ఉండరు. కాని ఒక ముసలమ్మ తనవాక్శుద్ధి వలన యితడు చాలా గొప్పవాడవుతాడని జోస్యం చెప్పిందిట!

సంజీవయ్యగారి పెద్దన్నగారు ఆయనను బడిలో చేర్పించారు. రోజూ కర్నూలులో మునిసిపల్ హైస్కూల్‌కు వెళ్ళిరావడానికి 10 మైళ్లు నడవవలసి వచ్చేది. వదినగారి మెడలోవున్న కొద్దీ గొప్ప బంగారం అమ్మి పరీక్ష ఫీజులు చెల్లించ వలసివచ్చింది.

సంజీవయ్యగారు స్వయం కృషివల్ల పైకివచ్చిన కష్టజీవి. నిరుపేదల కుటుంబంలో పుట్టి ఆయన అందరికీ స్నేహపాత్రుడైన జాతీయ నాయకుడుగా పేరెన్నిక గన్నారు.

అనంతపురం ప్రభుత్వ ఆర్ట్సు కళాశాలలో పట్టభద్రులైనారు. బళ్ళారి డివిజన్‌లో కొన్నాళ్ళు సివిల్ సప్లయిల యిన్‌స్పెక్టరుగా పని చేసి, తరువాత మద్రాసులో న్యాయశాస్త్ర పట్టం పుచ్చుకున్నారు. ట్రిప్లికేన్ హిందూ హైస్కూల్లో కొన్నాళ్ళు ఉపాధ్యాయ వృత్తి నిర్వహించారు.

1950లో పార్లమెంటు సభ్యత్వం వచ్చింది. 1952లో కోడుమూరు నియోజక వర్గంనుంచి మద్రాసు శాసన సభకు ఎన్నికైనారు. అప్పటికే ఆయన మేధస్సును పసికట్టిన శ్రీ చక్రవర్తుల రాజగోపాలాచార్యులవారు ఆయన్ను తన మంత్రివర్గంలోకి తీసుకొని సహకార శాఖను అప్పగించారు. తరువాత ఆంధ్రరాష్ట్రం ఏర్పడ్డాక ప్రకాశం మంత్రి వర్గంలోను ఆ తరువాత గోపాలరెడ్డి మంత్రి వర్గంలోను 1956లో ఆంధ్రప్రదేశ్ వచ్చాక సంజీవరెడ్డి మంత్రి వర్గంలోను చేరారు.

1960 జనవరిలో ముఖ్యమంత్రి అయి 1962లో అఖిలభారత కాంగ్రెసు అధ్యక్షులైనారు. శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ మంత్రివర్గంలో కార్మిక మంత్రి అయి, తర్వాత లాల్‌బహదూర్ శాస్త్రి మంత్రి వర్గంలో పరిశ్రమల మంత్రిగా పనిచేశారు. తరువాత శ్రీమతి ఇందిరాగాంధీ మంత్రివర్గంలో గూడా కార్మికశాఖ నిర్వహించారు. 1952 నుండి 1964 వరకు శాసనసభ్యులు. కొన్నాళ్ళు రాజ్యసభ సభ్యులుగా వున్నారు. పార్లమెంటు మధ్యంతర ఎన్నికల అనంతరం రెండవసారి కాంగ్రెసు అధ్యక్షపీఠం అలంకరించారు.

శ్రీ సంజీవయ్యగారు సౌమ్యుడు, సరసుడు, కవి, వాగ్మి. పేదల ఎడ దయగలవారు. తను నవ్వి నలుగుర్ని నవ్వించగల శక్తి గలవారు. సోదాహరణము లైన ఆయన ప్రసంగాలు వినడానికి ప్రజలు చెవి కోసికొనేవారు. కార్యనిర్వహణలో పట్టుదల గలవాడు. నూటికి నూరుపాళ్ళు సోషలిస్టు విశ్వాసం గలనాయకుడు. శ్రీ సంజీవయ్యగారు అనేక సాహితీ సంస్థలకు అధ్వర్యం వహించి అధ్యక్ష పదవిని నిర్వహించినవారు. పేదలకతడు పెన్నిధి. జనంలో కలసిపోయి తానేజనం, జనమే తానుగా తిరిగినవారు.

# సంజీవయ్య అకాల మరణం

శ్రీ సంజీవయ్యగారు కారణజన్ములు, దేశసేవాశక్తి, దీక్షశక్తి ఆయనలో సమపాళ్లలో వుండేవి. దేశమంతటిలోనూ ఒక రాష్ట్రానికి ముఖ్యమంత్రిగా పదవిని నిర్వహించిన హరిజనులలో ప్రథములు. అదేవిధంగా కాంగ్రెసు పీఠ మలంకరించిన తొలిహరిజనులు. ఆయన మృతి ఆంధ్రావనికే కాదు యావద్భారతావనికి తీరని లోటు.



శ్రద్ధాంజలి సమర్పిస్తున్న గవర్నరు, శ్రీ ఖండూభాయి దేశాయ్.

# ముఖ్యమంత్రి సందేశం

''మన నాయకులలో ఒక మహా నాయకుడు శ్రీ దామోదరం సంజీవయ్యగారు మరణించారన్న వార్త విని దిగ్భ్రమచెందాను. నోట మాట రానంతగా శోక సంతప్తుణ్ణి అయ్యాను. ఇటీవల వారి ఆరోగ్యం సరిగా లేదనే విషయం తెలిసినా యింత హఠాత్తుగా యీ విషమ పరిణామం సంభవిస్తుందని ఎవరూ అనుకోలేదు. గొప్ప భవిష్యత్తు గల అటువంటి మహా వ్యక్తి యీ విధంగా చిన్న వయస్సులోనే దుర్విధిపాలై మనలకు వీడి పోవడం భారత జాతి అంతటికీ పెద్దదెబ్బ.''

" సామాన్య ప్రజలు సంజీవయ్యగారి పట్ల ఎంతో ప్రేమాభిమానాలు ప్రకటించారు. అంతగా ప్రజాభిమానం చూరగొన్న సంజీవయ్యగారు అనేక ఘనకార్యాలు సాధించడంలో ప్రథమ స్థానం వహించారు. ఒక రాష్ట్ర ప్రభుత్వ ముఖ్య మంత్రిగానూ, కాంగ్రెసు అధ్యక్షులుగానూ పనిచేసిన హరిజన నాయకులలో ఆయనే ప్రథముడు. 1952 నుండి 1960 వరకు మంత్రిగానూ 1960 నుండి 1962 వరకు ముఖ్యమంత్రిగానూ, రెండు పర్యాయములు కేంద్ర మంత్రిగానూ, రెండు పర్యాయములు కాంగ్రెసు అధ్యక్షుడుగానూ ఆయన పనిచేశారు. ఆయన మంచి సంస్కార వంతుడు, గొప్ప వక్త, కరుణా హృదయుడు. క్లిష్ట సమయాలలో ఆయన దేశానికి చేసిన సేవ చిరస్మరణీయము. ఆయన మరణం ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికీ, దేశానికీ ఒక తీరని కొరత. ఈ కొరతను తీర్చుకోవడం చాలా కష్టం. ఆయన కుటుంబ సభ్యులకు హృదయపూర్వకంగా సంతాప సానుభూతులు ప్రకటిస్తున్నాను.

—పి.వి. నరసింహారావు

ముఖ్యమంత్రి.



సంజీవయ్య మృతదేహం ఢిల్లీ హైదరాబాదుకు వచ్చినప్పుడు ప్రజానీకం శ్రద్ధాంజలి·

## శ్రద్ధాంజలి

(అఖిలభారత కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ దామోదరం సంజీవయ్య మరణ వార్త విని రచించిన గేయం)

దేశమంత పెను చీకటి
అలుముకున్నదీ రాత్రి
సకల సృష్టి ఒకమారు
బావురుమని విలపించింది.
నిద్రించిన పాప లేచి
అదిరి పడిందీ రేయి
ఎటు చూసిన శోకమే
శోక భరిత రాగమే
వ్యధిత జాతి పిలుపు వినే
నాయకుడిక లేడా ?
పేదల మొఱ నాలించే
మహా పురుషుడిక లేడా ?
నాయకులలో మిన్న
మన సంతా వెన్న
తెలుగు తల్లి పుత్రుడు
దళిత జాతుల మిత్రుడు

పండిత పామర జనులకు
తన పలుకే వేదవాక్కు—
పాలక వర్గానికి
తన పిలుపే శంఖారావము !
సమ రాంధుల పెత్తనాల
సహియించని మన ప్రధాని
సమైక్య భావ గీతాలకు
రాగాలను కూర్చి నాడు—
మంచిని మాయం చేసిన
వంచకులను తరిమి నాడు
త్యాగ మూర్తిగా అఖండ
కీర్తిని గడియించి నాడు—
సామాన్యులలో అసామాన్యుడు
సంజీవయ్యకు శ్రద్ధాంజలి !
యాభై కోట్ల భారతీయుల
ప్రేమాంజలి ! శోకాంజలి ! !

గంధం జోయెల్



శ్మశాన వాటికలో

# ఆంధ్ర కేసరి
# ప్రకాశం పంతులుగారు
## కొన్ని మధుర స్మృతులు

ఐ. వి. రమణయ్య

(గత సంచిక తరువాయి)

1947సం॥ మే నెల తరువాత ప్రప్రథమమున రాజగోపాలాచారిగారితో పోటీచేయుచు మద్రాసు రాజధానికి మొదటి కాంగ్రెసు రెవిన్యూమంత్రిగాను, తరువాత ముఖ్యమంత్రిగాను వున్నప్పుడు నాకు ప్రకాశం పంతులుగారి సందర్శన భాగ్యము కలిగినది. అపుడు నేను రెండవ ప్రపంచ సంగ్రామమున తాత్కాలిక సైనికోద్యోగ పదవినుండి విరమించి, స్వతంత్రముగా కొంతకాలము పత్రికా రచయితగా [అప్పటి ప్రముఖ తెలుగు వారపత్రికయగు—కళా ప్రపూర్ణ శ్రీ వావిళ్ళ వేంకటేశ్వర్లుగారి—త్రిలింగం] ఆంధ్ర ఉన్నత పాఠశాలా విద్యార్థులకు సంబంధించిన 'నిర్బంధ వ్యాయామ మిలటరీ శిక్షణ' యను శీర్షిక క్రింద అనేక ఉత్సాహ పూరితములైన ఉపన్యాసములను, రాయలసీమ ఆర్థిక, రాజకీయ, వైజ్ఞానిక విద్యాపథకములకు సంబంధించిన కొన్ని ప్రణాళికలను రచించినాను. ఆ సందర్భముననే పంతులు గారిని మద్రాసులో కలసు కొంటిని. అప్పుడు వారునన్ను మిక్కిలి ఆదరణతో పలుకరించిరి. తదుపరి నేను విద్యాశాఖలో ఉద్యోగములో నున్నపుడు కూడ ఆంధ్ర రాష్ట్ర వతరణము గురించి అందు విలీనము కావలసిన బళ్ళారి ప్రాముఖ్యత గురించి కారణములను, దృష్టాంతములను త్రిలింగ పత్రిక ద్వారా విశదీకరించి యుంటిని.

ఈ సందర్భములో నేను పంతులు గారికి 1936–37 సం॥ ప్రాంతంలో ఆంధ్రమహాసభ ఆధ్వర్యమున గాడిచెర్ల హరిసర్వోత్తమ రావుగారి అధ్యక్షతను విరూపాక్షలయ ప్రాంగణములో విద్యారణ్య పీఠమున జరిగిన శ్రీకృష్ణ రాయ వర్ధంతి సందర్భమున ఆంధ్ర సాహిత్య పరిషత్తు నివేదికను, సంపుటిని అందజేసి యుంటిని. అప్పుడు బళ్ళారి జిల్లా సొండూరు సంస్థానాధిపతులు సుప్రసిద్ధ మహారాష్ట్ర రాజవంశపు సర్దారు ఘోర్పడే ఇచ్చిన గంభీర ప్రారంభోపన్యాసమును కూడా ఉదహరించి అప్పటి బళ్ళారి పట్టణ ప్రముఖ మునిసిపల్ ఉన్నత పాఠశాల అధ్యాపకులు కవి పండితులు శ్రీ సంజీవ మూర్తిగారు, డిప్యూటి ఇన్‌స్పెక్టరు అనేక పరిశోధనలు జరిపి విద్యానగర శిథిల శిల్పకళా విశేషములను ఛాయా చిత్రములతో కూడ యాత్రికుల కుపకరించు తెనుగు గైడు పుస్తకములను తయారు చేసి ఈ సందర్భములో సమర్పించు కొంటిని. ఈ ఛాయా చిత్రములు. గైడు పుస్తకములు హోస్పేట మునిసిపల్ లైబ్రరీలో తెనుగు యాత్రికుల ఉపయోగార్థము ఉచితముగ నుంచి యుంటిమి. కాని ప్రస్తుతమివి కనుపించుట లేదు.

బళ్ళారిలో 1954 సం॥ ప్రతి మునిసిపల్ ఉన్నత పాఠశాలలో ప్రతి తరగతికి రెండు తెలుగు సెక్షనులుండెడివి. కాని ఇప్పుడు ఒకటియైనను కనుపించుటలేదు. ప్రభుత్వాధికారుల యుత్తర్వుల వలన తెలుగు బాల బాలికలు ఇంగ్లీషు లేక కన్నడ భాషలను బోధనా భాషలుగ తప్పనిసరిగ స్వీకరింప వలసిన పరిస్థితి యేర్పడినది. రేడియో ప్రసారమున తెలుగు ప్రసారము లు ఇప్పుడు తొలగించ బడినవి. ఇక్కడి రాష్ట్రేతరాంధ్రుల రాజకీయ, సాంస్కృతిక హక్కులకై కృత నిశ్చయముతో నడుము కట్టి కేంద్ర ప్రభుత్వపు దృష్టికి తీసికొనివచ్చి గట్టి చర్యలు తీసికొనవలసి యున్నది.

ఈ సందర్భములో ఇప్పటికైనను బళ్ళారి నగర సమీపంలో కేంద్ర ప్రభుత్వము నిర్మించ దలచిన బ్రహ్మాండమైన విజయనగర ఉక్కు కర్మాగారములో, విభజింపబడిన బళ్ళారి జిల్లా ఆంధ్రులలో తదితర ఆంధ్ర ప్రదేశములోని సోదర రాయలసీమ జిల్లాల అధిక సంఖ్యాకులైన ఆంధ్రపౌరులకు విద్యార్థి యువక వైజ్ఞానిక, సాంకేతిక పారిశ్రామిక బృందములకు మైసూరు ప్రజలతోబాటు సమానమైన ఉద్యోగ నిర్వహణాధికార అవకాశములు ప్రాంతీయ ప్రాతిపదికమీద కల్పింప వలసినదని నేటి ఆంధ్రప్రదేశ్ ఉన్నత ప్రభుత్వాధికారులు ప్రజానాయకులు కేంద్ర ప్రభుత్వమును ఒప్పించ వలసిన బాధ్యత వున్నది.

బళ్ళారి పట్టణము ఆంధ్ర రాష్ట్రమున విలీనము కావలసినదని, నేను దృష్టాంత పూర్వకముగ పత్రికలలో వివరించి యుంటిని. ఈ సందర్భములో 1954 సం॥న స్వయముగ నేనీ విషయమును పంతులుగారికి నివేదించి యుంటిని. అప్పుడు వారు నా భుజములను ప్రేమ పూర్వకముగ తట్టుచు "ఒరేయి ! ఈ విషయము నేనెన్నడును మరువజాలను. నేను కూడ అప్పుడప్పుడు సుందర బళ్ళారి పట్టణమును సంపూర్ణమైన తెలుగు సీమయని, నా జన్మస్థానమని తలంచెదను. ఎందుకనగా నేనొకప్పుడు యింగ్లండు నుండి బారిష్టరు పరీక్షయందుత్తీర్ణుడై బారిష్టరుగా ప్రాక్టీసు పెట్టుటకై ముందు కొంతకాలము బళ్ళారిలో ప్రఖ్యాత న్యాయవాదియగు శ్రీ కోలాచలం వేంకటరావువద్ద జూనియరుగ పని నేర్చుకొంటిని. అది నిశ్సంశయముగా ఆంధ్రుల పట్టణమే. కేంద్ర ప్రభుత్వము 'ఫజుల్ అలీ కమిషన్' ను త్రోసి పుచ్చినారు. ఇది చాల అన్యాయము. ఇప్పటికి కూడ నీవు పత్రికలో ప్రతి పాదించినట్లు శ్రీ కోలా చలంగారి స్మారక మందిరపు హాలు, దానికి సంబంధించిన విశాల క్రీడామైదానమును వారి వారసులచేత ఒప్పించి, ఆంధ్ర విద్యాలయమును స్థాపించిన యెడల దానిని శాశ్వతముగ ఆంధ్ర విశ్వ విద్యాలయమునకనుబంధం గావించిన ప్రతి సంవత్సరము దాని నిర్వహణకై లక్ష రూపాయలను ప్రభుత్వ గ్రాంటు నిప్పించ గలను." అని గంభీరముగ తెలియబఱచిరి. కాని యప్పటి

బళ్ళారి యాంధ్ర సమితి కార్య నిర్వాహక వర్గమున నైకమత్యము లేక ఈ ప్రతిపాదన రూపొందలేక పోయినది.

1953 సంవత్సరమున ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర స్థాపనోత్సవ సందర్భమున తాత్కాలిక రాజధానిగ పరిగణింపబడిన కర్నూలు ప్రాశస్త్యమెఱుంగక నుత్తరాంధ్ర నాయకులలో యనేక భేదాభిప్రాయములు, తర్జన భర్జనలు జరిగినవి. అప్పుడు నేను దీర్ఘకాల పరిస్థితులను గమనించి ఆంధ్ర శాశ్వత రాజధానిగా నైసర్గికముగ యనుకూల వాతావరణము గలదియు, ఏః ఉమ్మడి యాంధ్ర ప్రజానీకము నివసించెడి ప్రాంతమును, ప్రశస్తమైన ఓడరేవు సముద్రతీర ప్రాంతముగల బాపట్ల, చీరాల మధ్య ప్రాంతమును శాశ్వత ఆంధ్ర రాజధానిగ గుర్తించిన బాగుండునని 'హిందూ' యను ఆంగ్ల పత్రికలోను, త్రిలింగ పత్రికలోను ప్రతిపాదించి యుంటిని. హైదరాబాదు పట్టముపైగల వ్యామోహము యెప్పటికైనను విచార గ్రస్తమని యూహించి వ్రాసి యుంటిని. ఈ సూచనను పంతులుగారు కొంతవరకు అభినందించినను యిట్టి ప్రతిపాదన ప్రస్తుత పరిస్థితులలో చాల ప్రయాసముగను, ఆచరణ యోగ్యముగను లేదని పలికిరి. కాని నేను సందేహించిన ప్రకారము హైదరాబాదు శాశ్వత రాజధాని నిర్ణయము నేటి ప్రత్యేక తెలంగాణా ఆందోళన వలన విశాలాంధ్ర రాష్ట్ర ప్రజల ప్రతిష్ఠకు, నైక్యతకు ముప్పు వాటిల్లినది. 1959 సం. న కర్నూలు నుండి రాజధాని హైదరాబాదునకు తరలించునపుడు అప్పటి తెలంగాణా, ఆంధ్ర ప్రజలలో నుప్పొంగిన యానందోత్సాహములలో వీరిద్దరికంటె మిక్కిలి వెనుకబడిన రాయలసీమ ప్రజల హర్షముకూడ తోడైనది. కాని ఈ సందర్భమున మిక్కిలి బాధకు గురియే తమ అభ్యుదయమును పూర్తిగా కోల్పోయిన వారు రాయలసీమ వారే. ఇప్పటికైనను తెలంగాణా ప్రజలు చిత్తశుద్ధితో నీ విషయమును గుర్తించి తమ యుద్రిక్తతను విస్మరించి ప్రస్తుత మన భారత దేశ ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరా గాంధీగారి సూచనలమేరకు సమైక్యత నెలకొల్పుకొనుట యవసరము.

## ఒంగోలు జిల్లా

1955 సం॥న వేసవిలో పంతులుగారిని, వారి వసతిగృహమగు 'రాక్ హౌసు'లో దర్శించితిని. అప్పుడు వారునన్ను ఆదర పూర్వకముగా యాహ్వానించిరి. అప్పుడు నేను వారి జ్ఞాపక చిహ్నముగా గుంటూరు జిల్లాలోని ఒంగోలును ప్రత్యేక జిల్లాగా నిర్మించవలసిన దనియు, నెల్లూరు, కర్నూలుకు సంబంధించిన 4 తాలూకాలను (వెనుకబడిన) దీనిలో విలీనముచేసి ఈ విశాల యంతర్భాగమును విజయవాడ గుంతకల్లు రైలు మార్గమున కనుగుణ్యముగ ప్రత్యేక రైలు మార్గముగ నేర్పాటుచేయవలసినదని వ్రాసితిని. దానిని చదివి నన్నభినందించిరి. ఒంగోలు తాలూకా పరిచయము నాకెట్లు కలిగెనో తెలుసుకొనగోరిరి. అప్పుడు నేను ప్రభుత్వ విద్యాశాఖలో ఒక చిన్న స్కూళ్ళ ఇన్‌స్పెక్టరుగ పనిచేయుటచే ఆ పరిసర ప్రాంతములలో ముఖ్యముగ గుండ్లకమ్మ లోయలోని రాయలసీమ, సర్కారు ఆంధ్రుల నిత్యజీవిత సమస్యలు, ఆశలు క్షుణ్ణముగ తెలుసుకొను యవకాశము కల్గెననియు, వారి ద్వారా ఒంగోలు తాలూకా ప్రాశస్త్యము తెలుసుకొనుట సంభవించెనని విన్నవించితిని.

శ్రీ పంతులుగారి పరిచయ భాగ్యము మరలనాకు కర్నూలు పట్టణమున కలిగెను. వర్షాకాలమగుటచే తుంగభద్రానదికి యుపనది యగు ఇంద్రావతీనది (హంద్రీ) వరదనీటి ప్రవాహముతో నుప్పొంగుచుండెను. అప్పుడు నేను వంతెన మీదుగ పాదచారినై పోవుచుంటిని. కారులో పోవుచున్న పంతులుగారు నన్ను చూసినంతనే కారు ఆపి, స్నేహపూర్వకముగ నన్ను పలుకరించిరి. అప్పుడు నేను నా యుద్యోగమునగల సాధక బాధలను వివరించుచు "పంతులుగారూ! ఇటీవల నేను విజయవాడ వెళ్ళినప్పుడు అచ్చటి పౌరులు విజయవాడను రాజధానిగా చేయలేదను కోపముతో మీ కాంశ్య విగ్రహమును ధ్వంసము చేసిరి. ఆ దృశ్యము నాకు చాల విచారము కలుగజేసినది" అని చెప్పగా వారు "ఒరేయి! వారు పడగొట్టినది నా విగ్రహమునేగాని నన్నుకాదు. నేను ఎప్పుడును అజేయుడను. నా విగ్రహ ధ్వంసమువలన నాకు ఏమియు కోపము లేదు. నాకు విజయవాడ ఎంత ప్రీతికరమో కర్నూలు పట్టణము కూడ యంతే. దీనికి ఏమి లోటు కలదు? ఇటుచూడు. ఈ పట్టణమున కిరువైపుల రెండు దివ్య జీవనదులు గలవు. దీని నెంతో సుందర పట్టణముగ తీర్చి దిద్దవచ్చును. లండనులోని 'థేమ్స్' నదిని చూచితివా? అది నిజమునకొక దుర్గంధమయమగు మురుగు నీటికాలువ. కాని దానిని యింగ్లీషువారెంతో చక్కగా తీర్చిదిద్దినారు. ఆ నది వంతెన మీది దృశ్యమును జూచి యానందింపని వారెవరూయుండరు. అట్లే కర్నూలును కూడ మీ యందరి సహకారమున్నచో నంత యందముగ తీర్చి దిద్దగలనని" గంభీరముగ పలికిరి.

1956_57 సం॥లలో పంతులుగారు వ్యాధిగ్రస్తులై పదవీ విరమణ చేసిన తదుపరి కూడ వారిని కలుసుకొనిన సందర్భమున వారు నన్ను ఆదరణపూర్వకముగ పలుకరించి "ఇంకను ప్రభుత్వోద్యోగము చేయుచుంటివా? స్వతంత్రముగ జీవింపవలెను. నేనిది వరకు మదరాసులో చెప్పినట్లు స్వతంత్ర జీవనము జేయుచు, దేశసేవకై నీ జీవితము నంకితముచేసిన యెంతయో బాగుండెడిది." అని అనిరి. వారా సందర్భముననే వారి జ్ఞాపక చిహ్నముగా ఒంగోలు జిల్లాను ప్రత్యేక జిల్లాగా రూపొందవలసిన యావశ్యకత గూర్చి దృష్టాంత సహితముగ రచించిన వ్యాసమును ప్రశంసించుచు నచటగల ఇరువురు శాసన సభ్యులకు నన్ను పరిచయము చేయుచు "నేను ముఖ్యమంత్రిగ నున్నప్పుడు ఈ యువకుని సూచన ప్రకారము ఒంగోలు జిల్లా రూపొందించలేక పోయితిని. నా తరువాతి మంత్రివరములవారును, నా మిత్రులయగు శ్రీ నీలం సంజీవరెడ్డిగారు చేయగలరేమో" నన్న యాశాభావమును వ్యక్తబఱచిరి. అప్పుడు వారి నోటనుండి వెలువడిన యా మాటలు, వారి మనోభీష్టము యిటీవలి ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డిగారి యాధ్వర్యమున నెరవేర్పబడుట మిక్కిలి ముదావహము.

ఇట్టి పంతులుగారి ఆదర్శ పూర్వక గంభీర వాక్ప్రసూనములను విను భాగ్యమును, మహామహిమాన్వితులగు వారి పరిచయ భాగ్యమును గలిగించిన శ్రీ బళ్ళారి రాఘవాచార్యులగారికి, వారితో తఱచు కలుసుకొను భాగ్యమును ప్రసాదించిన వారి సన్నిహిత కార్యదర్శిగారైన 'శ్రీ కొండపి'గారికి నా కృతజ్ఞతాభివందనములు.

# ఆంధ్రకేసరి ప్రకాశంగారూ- ఆనాటి మద్రాసు కుట్రకేసూ

—తిరుమల రామచంద్ర

దాదాపు నాలుగు దశాబ్దాల మాట. భారత స్వాతంత్ర్యోద్యమం ముమ్మరంగా సాగుతున్న సమయం. భగత్‌సింగ్ మొదలయిన వారిని బ్రిటిష్ ప్రభుత్వం దౌర్జన్యవాదులనే సాకుతో ఉరితీయించి ఎంతోకాలం కాలేదు. యువకుల నెత్తురు ఉడికిపోతున్నది. కిమ్మంటే కారాగారంలో పడవేసే కరాళ శాసనాల నరకు కాలం.

దేశం ఇంత అల్లకల్లోలంగా ఉన్నా మైలాపూర్ సంస్కృత కళాశాలలో యథాప్రకారం పనులు సాగిపోతున్నాయి. గురువర్యులు లక్ష్మణశాస్త్రిగారు కావ్యాదర్శంపాఠం చెబుతున్నారు :

"స్యాద్వపు : సుందర మపి
శ్విత్రేణై కేన దుర్భగం"

అని కావ్యదోషాలను వివరిస్తున్నారు. నాకు చూడగా, దండి నిర్వచనం అలంకారికంగా కావ్యశరీరానికి గాక రాజకీయంగా దేశానికి అన్వయిస్తున్నట్టు తోచింది. నిజమే శరీరం ఎంత సుందరమైనా, శ్వేతకుష్ఠం ఒక చుక్క ఉన్నా దుర్భరమయినట్టు, కావ్యం ఎంత మధుర సుందరమయినా, ఒక దోషంతో కొరగానిదవుతుంది. అలాగే దేశం ఎంత అందంగా, విశాలంగా, జనసంకులంగా ఉన్నా ఒక్క స్వాతంత్ర్యమనేది లేకుంటే ఎంత దుఃఖ భాజనమయినా అవుతుంది, అని ఆలోచనలు పరుగెత్తుతున్నాయి.

## ఫలానా వారు ఉన్నారా ?

ఇంతలో "ఫలానావారు ఉన్నారా? " అంటూ ఒక పెద్ద మనిషి తరగతి గదిలోకి వచ్చాడు. ఆయన తెల్లటి పంట్లాము, షర్టు కోటు ధరించి ఉన్నాడు-నాకేమి తెలుసు మఫ్టీలో ఉన్న సి. ఐ డి. ఇన్‌స్పెక్టరని. ఎవరో పెద్దమనిషి అనుకున్నాను పాఠం ముగిసేవరకు కాచుకొని ఉన్నాడు. కొంత సేపటికి గంట కొట్టింది. కావ్యాదర్శపాఠం నుంచి లేచి మరొక తరగతికి వెళ్లబోతున్నాను.

"ఇదిగో; నాయనా, ఒక్కమాట" అన్నాడు ఆయన, ఆప్యాయంగా. నేను సమీపించాను.

"నీతో మాట్లాడాలి" అన్నాడు ఆయన, నన్ను ఎగాదిగ చూస్తూ. నన్ను నేను చూచుకొన్నాను. గూడకట్టు పంచ పైన తువాలు. బుజాల మీదికి వేళ్లాడే జుట్టు. ముఖంమీద మూడు ఊర్ధ్వపుండ్రాలు. నన్ను చూస్తూ ఆయన ఆశ్చర్యం మరుగు పరచుకొన్నట్టు అనిపించింది.

నేను ఆలోచనలో పడ్డాను. ఉన్న "నా కాస్తంతబుద్ధినీ స్మృతిపథంలో దౌడాయించాను. ఆయన ఎవరో జ్ఞాపకం రాలేదు. మద్రాసు మహానగరం శ్రీరంగరామేశ్వరాది క్షేత్రాల యాత్రకు ముఖం హైకోర్టు పనిమీద ఎందరో వస్తుంటారు బంధువులు. నాకు తెలియనివారెవరో ఆయివుంటారు. "చూచిరాండి మా వాణ్ణి" అని మానాయనగారో, మా అమ్మో అనివుంటే, యోగక్షేమాలు తెలుసుకొనడానికి వచ్చివుంటాడు—అనుకొన్నాను.

"నావెంటరావాలి" అన్నాడు. ఆయన కంఠంలో కొంచెం అధికారపు జీర వినిపించింది. నా బంధు కోటిలోని ఆప్తుడో, మరే సన్నిహితుడో అయివుంటే, అక్కడే కుశలప్రశ్నలు వేసే వాడుగదా!

"క్లాసులు పూర్తికాలేదు" అన్నాను; వినయంగానే.

"మీ ప్రిన్సిపాలుగారితో చెప్పాను. రెండు మూడు గంటలలో తిరిగిరావచ్చు. ఎక్కువ పనేమీవుండదు" అన్నాడు ఆయన అధికారం పాలు కొంచెం హెచ్చిస్తూ.

ఆయన ధోరణి నాకు అర్థం కాలేదు. ఆయన అధికారం పద్ధతి అంతకన్నా అర్థంకాలేదు. నన్ను అధికారం చేసినవారు ఇంతవరకు ఎవ్వరూ లేరు. నేను అంతవరకు అనుభవించింది ప్రేమ, వాత్సల్యాలే. నన్ను సత్యాగ్రహంలో అరెస్టుచేసిన రన్నయ్య నాయదుకూడా ఎంతో గౌరవంతో చూచాడు. "స్వామీ, మీరు ఆజెయిలు మెతుకులు మింగలేరు. కష్టపడుతారు. నా మాట వినండి. జెయిలు సూపరింటెండెటును మన్నించకోరండి!" అని ఎంత ప్రేమతోనో బుద్ధిచెప్పాడు. అలాంటప్పుడు, వీడెవడో నాతో పనివుంటే, అక్కడే మాట్లాడి పోవచ్చుగదా! నాపై అధికారం చూపదగినంత పెద్దరికం ఏమిటి?

ఇంతలో మరొకవ్యక్తి వచ్చాడు. ఆయనతో సంప్రతించాడు. ఇద్దరూ చెవులు కొరుక్కున్నారు. ఆయన నావైపు తిరిగాడు. "ఏమీభయం లేదు. బయలుదేరండి" అన్నాడు.

భయమా? నాకూ, నా వంశానికీ ఏకోశానాలేదే ఆ భయమనే పదార్థం! ఈ పెద్దమనిషి భయం అంటున్నాడే! ఆ భయం ఉందో, లేదో చూద్దాం. పని ఏమిటో తెలుసుకొందాం—అనిపించిది. సరే, సిద్ధమయ్యాను.

చేతిలోని పుస్తకాలు గదిలో పడేసి, వారివెంట కదిలాను. వారునన్ను ట్రాములో ఎక్కమన్నారు. ట్రాము కదిలింది తిరువల్లికేణిలో దిగాము. ఫర్లాంగు నడిచాము. పార్థసారథి స్వామి తేరు వీధి. ఒకఇంట్లో అడుగు పెట్టాము. లోపలి గోడమీద

ఇత్తడి అక్షరాలతో ఒక ఫలకం మెరిసి పోతున్నది—పార్థసారథి అయ్యంగారు. సి ఐ డి. ఇన్‌స్పెక్టర్ అని.

మెదడులో కొన్ని వేల మెరుపులు మెరిశాయి. వివిధ రంగాల వ్యక్తులతో నాకు పరిచయం, స్నేహం కలిగాయి కారాగారంలో. అప్పటి దక్షిణాపథ నాయకులు ఇతరులు ఎంతోమంది పరిచితులయ్యారు. అరవింద మహర్షి శిష్యుడు అంతరంగిక కార్యదర్శి సురేంద్ర మోహన్ ఘోష్, పెక్కు కుట్రకేసులనబడే వాటితో సంబంధమున్న జీవన్‌లాల్ చటర్జీ, సైన్యంలో విప్లవం తేవడానికి ప్రయత్నించిన మహా సాహసికుడు ప్రతూల్‌చంద్ర గంగూల్, లాహోర్‌కుట్ర కేసులో శిక్షితులు కుందన్‌లాల్ గుప్త చట్కేశ్వర్ దత్—ఇంకా ఎందరో! సురేంద్ర మోహన్ ఘోష్ సంస్కృత సాహిత్య పరిచయం గలవారు రవీంద్రుని సుప్రసిద్ధగీతి, గాంధీజీకి అత్యంత ప్రియమైనది "అకేలా చలో" ను నేను "ఏకాకి చల" అని అనువదించగా విని పొంగిపోయారు.

"ఝుంఝూవాతే,రజనీ సమయే,
నాలోకే సతి, ద్వారేపిహితే
వజ్ర జ్వాలిత వక్షః పంజర
ఏకాకీ చల రే!"

అనే దాన్ని ఆయన పదేపదే చదివించుకొని ఆనందించేవారు... ఇలా ఎన్నో తలపులు మేమింకా కౌమారావస్థ వదలని వారం. వారంతా మాకుచేసిన ఉపదేశాలెన్నెన్నో ఉన్నాయి. వాటిలో కొన్ని ఇతరులకు చెప్పదగినవి, కొన్ని చెప్పదగనివి. ఈ పోలీసులు అలాటి వాటిని పట్టుకొని కేసులు బనాయించదలచి నాలాటి వారిని ప్రశ్నించ దలచుకొన్నారేమో! ఇంతలో......

"ఆచార్యులవారూ, కూర్చోండి." అన్నమాటలు వినిపించాయి. నా ఆలోచనా తంత్రి తెగింది. కూర్చున్నాను.

"మీకు ఫలానావాడు తెలుసా?" అడిగాడు ఆయన.

"తెలుసు" అన్నాను.

పొరపాటయి పోయింది. ప్రశ్నల వర్షం కురిసింది. ఏమి చెబితే ఏమి ప్రమాదమో! ఎవరికి నష్టమో! అంటీ అంటనట్టు సమాధానాలు చెబుతున్నాను. కోపంతో ఆయన ముఖం ఎర్రబడింది. కాని కోపాన్ని కొంత వాత్సల్యాలుగా మార్చుకొనే ప్రయత్నంలో నవ్వుముఖం పెట్టాడు.

## బుకాయింపు లెందుగ్గాని......

"చూడు. నీ బుకాయింపుల వల్ల ప్రయోజనం లేదు. నీ మిత్రులందరూ పట్టుబడ్డారు. నీవు నిజం చెబితే మంచిది. సంస్కృతం చదువుకుంటున్న వాడివి. ఎందుకు నీకు ఇదంతా..." అంటున్నాడు.

నేనేమీ మాట్లాడలేదు. అతని గొంతులో తీవ్రత ఎక్కువవుతున్నది. నేను ఆలోచనలో మునిగి పోతున్నాను. పాతకథ జ్ఞాపకం వచ్చింది. ఒక రైతు కామలులేని గొడ్డళ్లను దండగుచ్చి బుజంమీద వేసుకొని పోతున్నాడట. చెట్లన్నీ వణికి పోయాయట—ముక్కలు ముక్కలు చేసాడు వీడు మనల్ని అని. అప్పుడు ఒక ముసలిమాను అన్నదట—వెర్రి పీనుగుల్లారా మనవాడు ఎదిరితో కలవందే, ఎదిరి కొమ్మయినా కదిలించలేడు—అని. దానితో చెట్లన్నీ కుదుట పడ్డాయట. అట్లాగే మా మిత్రుడెవడో మేము కుర్రతనంలో అనుకొన్నవీ, చేసినవీ గొప్పకోసం వాగివుంటాడు. పోలీసులు వాటినే పెద్దవిచేసి జనానికి చూపదలచుకొని ఉంటారు. నాబోటి వాడి మీద ప్రయోగించ దలచుకొని ఉంటారు..........

నీ మిత్రుడు ఎస్. పట్టాభి రామిరెడ్డి లేడూ, అతడు చెప్పాడు, నీవు మంచివాడివనీ, తనకు సన్నిహితుడవనీ ......"

ఛీ! వాడేమి మిత్రుడు!! పోలీసులకు లేనిపోని సంగతులు చెప్పేవాడూ, చెప్పి పట్టించేవాడూ, పట్టించి ఇరకాటంలో పెట్టించే వాడూ మిత్రుడేనా?.........నిశ్చయం చేసుకున్నాను. నా నుంచి ఒక్కమాటయినా రాగూడదని. ఇంతకూ నాకు తెలిసింది మాత్రం ఎంత? ఏమిటి?.........

'మౌనంవల్ల ప్రయోజనం లేదు. పట్టాభి రామరెడ్డిని. ఎస్. కృష్ణ అనే మరొక యువకుణ్ణి ఇంగ్లాండుకు పంపిస్తున్నాము తెలుసా? వాళ్లు చాలా బుద్ధిమంతులు. నీకు విదేశాలకు వెళ్లదామని లేదూ? నిజం చెప్పు అంతా సరిపోతుంది...''

## ఇంతకూ నిజమంటే ఏమిటి!

ఆలోచిస్తున్నాను. ఏది నిజం? ఇంతకూ, నిజమంటే ఏమిటి?

"...మీరు చదువుకొన్న వాళ్లుగదా, దౌర్జన్యమెందుకయ్యా? సత్యాగ్రహం అన్నారూ, బాగుంది. ఖద్దరు కట్టారూ బాగుంది, కత్తులూ, కటార్లూ పుచ్చుకొని ఈ దౌర్జన్యాలేమిటి? కాల్చుకోడాలు చంపుకోడాలు, లూటీలు, దోపిడీలూ ఏమిటి?...''

ఇప్పుడు మాట్లాడక తప్పింది కాదు.

"లేదండీ. మేము దౌర్జన్యాలేమీ చేయలేదు. దేశం గురించి అనుకోడం, వీరుల పరాక్రమ సాహసాలు తలపోయడం దౌర్జన్యమయితే...'

"చాలు!" అన్నారు ఆయన. ఈ సంగతే పోలీసు కమీషనర్ దొరగారి ముందు చెప్పు. ఈ అబద్ధాలు పనికిరావు. నిజం చెప్పు నీ మిత్రుల సంగతి తెలపడం మంచిది. లేకపోతే ఇ.వై సంవత్సరాల శిక్షకు తక్కువ ఉండదు, జీవితమంతా నాశనం. నడు, కమిషనర్ దొరగారి దగ్గరికి..."

కారు సిద్ధంగా ఉంది. నన్ను పోలీసు కమీషనర్ కార్యాలయానికి పిలుచుకొని వెళ్లారు. ఇక్కడా అదేతంతు కాని, ఆయన—వైద్యనాథ ముదలియార్ అని జ్ఞాపకం—కోపపడలేదు. విషయ సంగ్రహణ చతురుడు. మహా శాంతంగా అన్నాడు.

''సంస్కృతం—దేవభాష—చదువుకొంటున్నవాడు లేండయ్యా సంస్కృత పాఠశాలకు పంపించండి. అవసరమైనప్పుడు పిలిపించుకొందాం"; అన్నాడు ఆయన. నేను వెళ్లిపోయాను

సంస్కృత కళాశాల ఎప్పటిలాగే సంస్కృత ప్రవచనాలతో కల కల లాడుతూనే ఉంది.

సాయంకాలమైంది. కుంటుకుంటూ వచ్చాడు ఒకాయన. మరొక సి.ఐ.డి. అనుకున్నాను. ప్రశ్నలకు సిద్ధమయ్యాను.

"మీరేనా, రామచంద్రుడు?" అడిగాడు ఆయన. ఔనన్నాను.

"మరెవరన్నా వచ్చారా మీ దగ్గరికి ? ఏమైనా చెప్పారా ? నేను మీకు మిత్రుడువంటివాడిని. పేరు పి. రామమూర్తి. వృత్తి వకాల్తా. మీ మిత్రుల తరపున వచ్చాను.మీరు పోలీసులకు ఏదంటే అది అందివ్వలేదు కదా ! చదివేది సంస్కృతం. పాపం ! లౌక్యమేమి తెలుసు ?..." అంటూ ఏమేమో లెక్చరు కొట్టాడు.

నేను ఆలోచించాను. ఈయన ఎవరో అపరిచితుడు. ఏమి మాట్లాడితే ఏమి తప్పో ! వింటూ ఊరుకున్నాను.

"నా వెంట రాండి. మీ కేమీ భయం లేదు. నేను జగన్నాథ దాసుగారింటికి మిమ్మల్ని పిలుచుకొని వెళ్లతాను. కేసులో ఏవిధంగా మెలగాలో తెలుపుతారు ఆయన" అన్నాడు.

ఇదీ చూద్దాం.: వచ్చేనష్టం ఏమిటి ? ప్రాణాపాయంకన్నా పెద్దది జరుగదు కదా ! ఈ కుంటివాడూ జిత్తులమారి అయితే, మరొక అనుభవం సంపాదించినట్టవుతుంది_అనుకొన్నాను. ఆయన వెంట బయలు దేరడానికి సిద్ధమయ్యాను.

ఇద్దరం తిరువల్లి క్కేణి బిగ్ స్ట్రీటు చేరాము. ఒక ఇంట్లో ప్రవేశించాము. "బచ్చు జగన్నాథదాసు, హైకోర్టు అడ్వకేట్" అని వ్రాసిన బోర్డు వేలాడుతూంది. దివాన్ ఖానాలో చాలామంది మూగి మాట్లాడుతున్నారు-చర్చించుకొంటున్నారు, అంతా బాగుంది. రామమూర్తి తర్వాత శాసనసభ్యుడు, పార్లమెంటు సభ్యుడు. నన్ను వారికి పరిచయం చేశాడు_జగన్నాథదాసుగారు. పేరు మోసిన జాతీయవాది, న్యాయవాది అని.

"ఇదిగో, నాయనా, మీరంతా ఒక ఘోరమైన కుట్రకేసులో చిక్కుకున్నారు, అమాయకంగా. మిమ్మల్నందరినీ రక్షించడానికి శ్రీ ప్రకాశంగారి పేరు విన్నావుగదూ ! ఆయన నాయకత్వాన కొందరు న్యాయవాదులం రక్షణ సంఘంగా [డిఫెన్స్ కమిటీ] ఏర్పడ్డాము. దానికి పి. రామమూర్తి ఈయన_కార్యదర్శి. కె. భాష్యం పి. రాజగోపాలాచారి, ఎస్.ఎస్. మణి, సుసర్ల సూర్యప్రకాశం, ప్రకాశరావు, మరికొందరు ప్రముఖ న్యాయవాదులు సభ్యులు. అంటూ అందరినీ చూపారు. నేను నమస్కరించాను.

"నీకు తెలిసిన విషయాలు పూర్తిగా మాకు చెప్పాలి. నీవు చిన్నవాడివి గనుక నిన్ను ఈకుట్ర కేసులో తమ మొదటి సాక్షిగా వేసుకొన్నారు" అన్నారు.

## గుండె జల్లుమంది

నా గుండె జల్లుమంది. ఒళ్లు చమట పట్టింది. ఏమిటీ కుట్ర కేసు ? నేను మొదటి సాక్షినా పోలీసులకు? అందుకేనా వైద్యనాథ మొదలియారు అంతగా ప్రేమ ఒలకబోయడం ! ఏమిటిదంతా ? వీరంతా రక్షకులా ? ఆంధ్రకేసరి వంటి వాడు రక్షణ సంఘ నాయకుడా? అంతా అగమ్యంగా ఉందే?...ఆలోచిస్తున్నాను.

"ఎస్. పట్టాభి రామరెడ్డి, ఎస్. కృష్ణన్ మీ అందరిమీదా ఏవేవో చెప్పారు. ఇద్దరూ ఈ కేసులో అప్రూవర్లు. పట్టాభి నీకు మిత్రుడటగదా. వాడు తిరిగి పోయాడు".

నేను గాభరా పడ్డాను వాడు ఏమేమి చెప్పాడో ! ఎందరు అమాయకులను ఇరికించాడో!'నానుంచి ఎవ్వరికి ద్రోహం జరుగరాదు. నాకు తెలిసినవిచెప్పి నా మిత్రులను రక్షించడం నా ధర్మం. కనుక మీరు ఎలా సెలవిస్తే అలా చేస్తాను" అన్నాను. గద్గద కంఠంతో.

''మీవన్నీ వట్టి ఆలోచనలే. చేసిందేమీలేదు. ఇతరుల సంగతి ఎలావున్నా, నీవరకు నీవు..." అన్నారు ఆయన. సంగతి ఇది.

మమ్మల్నందరినీ ప్రభుత్వం దౌర్జన్యవాదులుగా టెర్రరిస్టులుగా చిత్రించింది. అప్పుడు అహింసోద్యమం ముమ్మరమైన రోజులు. కొందరు యువకులు 1932లో తిరుచునాపల్లి జెయిలులో ఉన్నప్పుడు, అక్కడ డిటెన్యూలుగా ఉన్న సురేంద్రమోహనఘోష్ జీవన్‌లాల్ చటర్జీ, ప్రతూల్ చంద్రగంగూలీ వంటివారితోను, లాహోరు కుట్రకేసులో శిక్షపొందిన బటుకేశ్వర్‌దత్, కుందన్ లాల్‌గుప్తవంటి వారితోను చర్చలు జరిపే అవకాశం వున్నందున ఆ దౌర్జన్యవాదుల సలహాతో దౌర్జన్య పద్ధతులతో ప్రభుత్వాన్ని పడగొడ్డడానికి కుట్రచేశారు. వారిలో ప్రముఖులు వీరు ! ప్రముఖ కార్మికనాయకుడు ప్రస్తుతం ఫార్వర్డ్‌బ్లాక్ కార్యదర్శి ముకుందలాల్ సర్కార్. కె. గోపాలశాస్త్రి, కె. అరుణాచలం, టి. ఆర్. సుబ్రమణ్యం, జి. లోకనాథన్, టి. కణ్ణన్, కణ్ణాయిరం, ఎన్. రంగరాజన్, కె. నారాయణ నంబియార్, జి. బాలకృష్ణారెడ్డి, డి బలరామిరెడ్డి, పి. బాలిరెడ్డి, దశరథరామ రామిరెడ్డి, జి. కాశయ్యశెట్టి, సి. జగన్నాథం, బి. బాపిరాజు, కె. రామానంద చౌధురీ, బి. జోసెఫ్, వేలాయుధన్, తిరుమల రామచంద్రాచార్య [నేను] మొదలయినవారిపై కుట్రకేసు మోపారు. నేను సంస్కృత పాఠశాల విద్యార్థికావడంవల్ల, అందరిలోకి చిన్నవాడినికావడంవల్ల పోలీసులు నన్ను మొదటి సాక్షిగా వేసుకొంటే మంచిదని నన్ను, నాబోటి మరి కొందరిని సాక్షులుగా వేసుకొన్నారు. దీనికంతా మూలం పట్టాభి రామరెడ్డి, కృష్ణన్.

"అయితే నన్ను ఏమిచేయమన్నారు?" అడిగాను.

"నీకు ఈ కుట్రకేసు సంగతి ఏమన్నా తెలుసా? వివరంగా నీకు తెలుసా?."

## జైల్లో గప్పాలు

"వీరంతా తెలుసు, జెయిలులో ఏవేవో గప్పాలు కొట్టిన మాట నిజమే. కానీ కుట్రసంగతి నాకేమీ తెలియదు. కుట్ర అనేమాట ఇప్పుడే వింటున్నాను" అన్నాను.

"ఆసంగతే చెప్పవయ్యా, నాకేమీ తెలీదని న్యాయస్థానంలో" అన్నారు జగన్నాథదాసుగారు.

మైలాపూర్ సంస్కృత కళాశాలలో నా చదువు సాగుతూనే ఉంది. వారంవారం రామమూర్తి ఎప్పుడో ఒకప్పుడు వచ్చి నా యోగక్షేమాలు కనుక్కుంటూను, సలహాలిస్తూనూ ఉన్నాడు. మద్రాసు పెనిటెన్షియరీలో నిర్బంధంలో ఉన్న నా మిత్రుల యోగక్షేమాలూ ఎప్పటికప్పుడు తెలుస్తూనే ఉన్నాయి. అయినా కళాశాల అధికారులు నన్ను ఒకకంట కనిపెడుతూనే ఉన్నట్టు నాకు తెలుస్తూనే ఉంది. నేను తప్పించుకొని పోతానేమోనని జాగ్రత్తపడ్డారు—నిజానికి నాకు ఎక్కడికి తప్పించుకొనిపోయే ఉద్దేశంలేదు. ఇంతకూ ఎక్కడికి పోగలను? రవి అస్తమించని బ్రిటిష సామ్రాజ్యంలో ఎవరైనా తప్పించుకొని పోగలరా?

మద్రాసుకుట్రకేసును గురించి దేశంలోని పత్రికలన్నీ చాలా ప్రచారం చేశాయి. దక్షిణ భారత పత్రికలకది మొట్టమొదటి కుట్రకేసు. కనుక పూర్తి వివరాలు తెలుపుతున్నాయి. నిందితులను రాక్షసులుగా చిత్రిస్తూ, చిలవలు పలవలుగా. అప్పుడు నాకు నా మిత్రులు చేసిన ఉపకారం మరుజన్మలలోనూ —జన్మ అనేదిఉంటే —మరువలేను. కప్పగంతుల లక్ష్మణ శాస్త్రి, దమ్మాలపాటి శేష గిరి రావు, కాశీభట్ట రామనాథదత్త నాకు అంగరక్షకులుగా ఉండేవారు.

## మద్రాసు నగరమంతా మావైపే

చివరకు కుట్రకేసు విచారణ తేదీ ప్రకటించారు—1933 వ సంవత్సరం సెప్టెంబర్ 8 వ తేదీ. ఆనాడు చూడాలి మద్రాసు నగర సంరంభం. ఇరవైమంది యువకుల ప్రాణాల రక్షణకు కంకణం కట్టుకొన్నది ప్రకాశంగారే అయినా, ఆయన వెంట ప్రచ్ఛన్నంగా మద్రాసు నగర మేధావులంతా ఉండేవారు.

పోలీసు అధికారుల సంగతి చెప్పనక్కరలేదు. కేంద్ర ప్రభుత్వ పోలీసు శాఖలోని ఉన్నతాధికారులంతా దిగారు.

కువ్వం నదీతీరంలో చింతాద్రిపేట ప్రాంతంలో ఒక గ్రంథాలయ భవనంలో కుట్రకేసు విచారణకు ప్రత్యేకన్యాయస్థానం ఏర్పాటయింది. భవనం పరిసరాలు పోలీసు బందోబస్తుతో మహా దుర్గమ మయింది. ఆ ప్రాంతంలో పిట్టయినా వాలడానికి వీలులేదు.

మద్రాసు పౌరుల ప్రేమపాత్రుడు ప్రకాశం, ఆంధ్రకేసరి ప్రకాశం పేరు ప్రజల నిత్యజపమయింది. ప్రకాశం వంటివారు చేపట్టిన తర్వాత ఎన్ని గుండెలు బ్రిటిష ప్రభుత్వానికి యువకులను —దేశంకోసం మంచిని ఆలోచించిన యువకులను-శిక్షించాలంటే. అన్న ఈసడింపు రాష్ట్రమంతటా వ్యాపించింది. విచారణ దినం. 1933 సెప్టెంబర్ 8 వ తేదీరానేవచ్చింది. పోలీసు అధికారులు ఒక వైపు, రామమూర్తీ—మిత్రులు మరొకవైపూ నన్ను విచారణకు వెనుకటి దినమే హెచ్చరించారు. కోర్టుకు హాజరుకాకపోతే ప్రమాదమని.

స్పెషల్ మెజిస్ట్రేట్ కోర్టు విచారణ ప్రారంభమైంది. న్యాయస్థానం ప్రత్యేక రాజభక్తులతో కిటకిటలాడింది. రక్షణ సంఘం న్యాయవాదులు ఒకవైపు వరుసలో కూర్చున్నారు. మరొక వైపు వరుసలో ప్రాసిక్యూషన పక్షపు పోలీసు కమీషనర్, పబ్లిక్ ప్రాసిక్యూటర్ మొదలైనవారు కూర్చున్నారు. నా మిత్రులు ఉక్కు-టోపీల రిజర్వు పోలీసుల వ్యానులలో వచ్చారు. నేను పోలీసుల కాపలాతో ఒకచోట నిలబడ్డాను. కొన్నాళ్ళపాటు ప్రాసిక్యూషను వారు కేసు వివరించడం జరిగిన తరువాత సాక్షుల విచారణ ప్రారంభమయింది. ప్రకాశం గారు కోర్టులో సాక్షులను ప్రశ్నించడం మొదలు పెట్టారు. మొట్టమొదటి ప్రాసిక్యూషను సాక్షి నేను. నేను బోనులో నిలుచున్నాను. నిందితులైన నామిత్రులందరూ నన్ను చూచి "జయ్, రామచంద్రాజీ" అన్నారు ప్రకాశం గారు లేచారు. ఆయన కొన్ని దశాబ్దాల క్రితమే బ్రిటిష ప్రభుత్వం చర్యలకు నిరసనగా వకాలత్ వదలినవారు. మమ్మలను రక్షించడానికే మళ్ళీ న్యాయస్థానంలో అడుగు పెట్టారు. ఆయన లేచి నిలబడి రంగు వెలసిన ఖద్దరు శాలువను కుడి చేతితో తీసి సర్దుకున్నారు. ప్రాసిక్యూషన్‌వర్గం భయకంపితమైంది. క్రిమినల్ కేసులలో ప్రకాశం గారంటే పోలీసులకు అంతకు ముందే సింహస్వప్నం. పోలీసు అధికారులనోట తడి ఆరిపోయింది. స్పెషల్ మేజిస్ట్రేటు ముఖం తెల్లబడి పోయింది. ప్రకాశంగారు నన్ను క్రాసు పరీక్ష చేశారు. దాని సారాంశమే ఇక్కడ ఇవ్వగలిగాను. క్రమం జ్ఞాపకం లేనందున

"ఏమయ్యా, ఎక్కడ చదువుతున్నావు?"

"మైలాపూర్ సంస్కృత కళాశాలలోనండీ"

"ఏమి చదువుతున్నావ్"

"సాహిత్య శిరోమణండి"

"నీ దగ్గర రివాల్వర్లు అదీ ఉందన్నారే, పోలీసువారు. నీవు రివాల్వరు ఎప్పుడైనా చూచావా?'

"................."

"ధనుర్బాణాలు చదివి వుంటావు సంస్కృత కావ్యాలలో"

"ఔనండీ"

"వాటి నైనా చూచి ఉండవు"

"......... ........"

"పోలీసులు ఆరోపిస్తున్న కుట్ర సంగతి నీకు తెలుసా ?"

ఇలా సాగింది క్రాసు పరీక్ష.

"యువర్ ఆనర్! ఏదో గురుకులంలో చదువుకుంటున్న సంస్కృత విద్యార్థిని, ఋషికుమారుని వంటివాడిని తోలుకొని వచ్చి గాంధీ ఉద్యమంలో అరెస్టయి ఈ నిందితులున్న కారాగారంలో వున్నాడన్న సాకుతో పోలీసులు లేనిపోని సాక్ష్యాలు ఇప్పించడంఏమి న్యాయమండీ ? అని మేఘగంభీర నిర్ఘోషంతో అన్నారు ప్రకాశం గారు. నిందితులు, రాజభక్తులైన ప్రేక్షకవర్గం కూడా గొల్లున నవ్వారు.

పోలీసులు చాల కృద్ధులయ్యారు. నన్ను బోను నుంచి దిగిపొమ్మన్నాడు మేజిస్ట్రేటు. నేను వినయంగా—

" అయ్యా, మేజిస్ట్రేటు దొరగారూ, [illegible] పోలీసుల మాట వినకుండా నిజం చెప్పాను. నేను వెలుపలికి వెళ్ళిన తర్వాత నన్ను వారు బాధ పెట్టి కసి తీర్చుకుంటారనే భయంతో సతమతమవుతున్నాను. తమరు రక్షించాలి" అని కోరాను.

" అలాంటి భయమేమీ లేదు. నీవు స్వేచ్ఛగా వెళ్ళి పోవచ్చు'' అన్నారు ఆయన.

" అలాటిది ఏమైనా జరిగితే నాకు చెప్పు '' అన్నారు ప్రకాశంగారు. నేను న్యాయస్థానం నుంచి వీధిలోకి అడుగు పెట్టాను. సరాసరి సంస్కృత కళాశాలకు వెళ్ళాను. నాకన్నా ముందే వెళ్ళింది వార్త.

'' నాయనా, నీవు పెద్ద నాయకుడవి. మేము సర్కారు గ్రాంటుతో సంస్కృత కళాశాల నడుపుతున్నాము. నీబోటివాడు మా వద్ద ఉంటే, గ్రాంట్లు నిలిచిపోతాయి. నీవు వేరే చూచుకో నాయనా '' అన్నారు మా ప్రిన్సిపాల్ మహామహోపాధ్యాయ కరుంగుళం కృష్ణశాస్త్రి గారు. నేను నావల్ల అపరాధ మేమీలేదని ప్రమాదంలేదని ఎంత వివరించినా ఆయన ఒప్పుకోలేదు. నేను కళాశాల నుంచి వెళ్ళిపోవలసివచ్చింది.

నడివీధిలో పడ్డాను. ప్రతిచోటా నీళ్ళేగాని తాగడానికి ఒక చుక్కయినా నీళ్ళు లేదని ఒకానొక ఆంగ్ల మహాకవి అన్నట్లు విశాల ప్రపంచం నా ముందు ఉన్నా నాకు ధైర్యంతో సహాయం చేసేవారు ఎవ్వరూ కనిపించలేదు. పోలీసులు పగబట్టారు. పోలీసులలోనూ నాబోటి వారికి అభిమానులుంటారన్న విషయానికి తార్కాణం ఒకటి జరిగింది. నా ఆయుర్వేద గురు వర్యులు శ్రీ చింతపల్లి వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రిగారి బంధువులొకరు నన్ను మద్రాసు నుంచి వెళ్లిపొమ్మని రహస్యంగా వర్తమానం పంపారు. అప్పుడు నాకు ఆశ్రయమిచ్చిన వారు భారతి పత్రిక సంపాదకులు తిరుమల వేంకట రంగాచార్యులు గారు. ఆయన ఇప్పుడు లేరు...ఎక్కడ అడుగు పెట్టినా అనుమానంతో, భయంతో చూచే వారు నన్ను. చివరకు నా రక్త బంధువులు కూడా తమ అరుగు తాకనీలేదు నన్ను. [illegible] కారుడని ప్రభుత్వం ముద్రవేసిన వాడికి ఆశ్రయమివ్వడమనేది మహాసాహసమైన కాలంలో మూడు నెలలు మూడు యుగాలుగా కాపాడిన రంగాచార్యులు గారి ధైర్యసాహసౌదార్యాలను నేను ఏమని చెప్పగలను. ఎంత కృతజ్ఞత తెలిపినా ఇంతే అనుతుంది.

మాకుట్ర కేసు స్పెషల్ మేజస్ట్రేటు కోర్టులో విచారణ తర్వాత హైకోర్టు విచారణకు వెళ్లింది. న్యాయమూర్తి పాకెన్ హామ్ వార్ష్ 1934 జనవరి 8 వ తేదీన విచారణ ప్రారంభించారు. విచారణ తంతు ఏప్రిల్ 24 వ తేదీవరకు జరిగింది. ఆయన నామిత్రులకు నాలుగు సంవత్సరాలు మొదలు రెండు సంవత్సరాల వరకు శిక్షవిధించారు. హెచ్చు శిక్ష నాలుగు సంవత్సరాలు ముకుందలాల్ సర్కారుకు పడింది. చివరి సారిగా పెనిటెన్షియరీలో వారందరినీ 1934 జనవరి చివర కలుసుకొన్నాను.

ఒక ధ్యేయంతో, ఒక ఆదర్శంతో కొన్నేళ్లు కలిసిఉండి ఘోర శిక్షలు పొందిన ఆ నామిత్రులను తలచుకొన్నప్పుడల్లా దేశ స్వాతంత్ర్యం కోసం సర్వస్వం అర్పించిన యువత-సుందర భవిష్యత్తును సంభావించుకొంటూ, న్యాయ ధర్మాల కోసం ఎంతటి సాహసానికైనా ఉద్యమించే యువత-నా ఎదుట సాక్షాత్కరించి దేహం తన్మయత్వంతో పులకిస్తుంది మనస్సు దివ్యలోకాలకు రెక్కలల్లార్చుకొని పయనిస్తుంది.

అనాటి నా మిత్రులు నేడు వివిధరంగాలలో నాయకులు. వారికి, మహానాయకులు కాదగిన నవయువకుల జీవితాలను రక్షించడానికి—రక్షించడానికే—దశాబ్దాల క్రితమే వదలిపెట్టిన వకాల్తాను మరల చేపట్టిన ప్రకాశంగారి గంభీర కరుణోదార దివ్యమూర్తికి, ఆయన కనుసన్నలనే ఆనతులుగా భావించి, ఎంతటి త్యాగానికైనా సన్నద్ధులయ్యే న్యాయమూర్తులు బచ్చు జగన్నాథ దాసుగారు మొదలయిన న్యాయవాదుల కీర్తిమూర్తికీ అంజలి ఘటిస్తున్నాను.

## ఈ సంచికలో రచయితలు

శ్రీ ఐ. వి. రమణయ్య, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాదు

శ్రీ తిరుమల రామచంద్ర, జర్నలిస్టు, హైదరాబాదు

శ్రీ పి. రాజగోపాలనాయుడు, ఎం. ఎల్. సి. చిత్తూరు

శ్రీ కామఋషి సత్యనారాయణ వర్మ, కాకినాడ

శ్రీమతి అచ్యుతుని లక్ష్మీకనకవల్లి, తెనాలి

శ్రీ గుంటి పుండరీకాక్షయ్య, శ్రీకాకుళం

శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, హైదరాబాదు

శ్రీ పుల్లాభొట్ల వెంకటేశ్వర్లు, లెక్చరర్, ఖమ్మం

శ్రీ పి సత్యనారాయణ రావు, ఉస్మానియా యూనివర్సిటీ హైదరాబాదు

శ్రీ బొబ్బా కృష్ణమూర్తినాయుడు, ప్రావిడెంట్ ఫండ్ ఇన్‌స్పెక్టర్, విజయవాడ

# జగిత్యాల సమితి పురోభివృద్ధి

జగిత్యాల సామూహిక అభివృద్ధి బ్లాకులో పంచాయతీరాజ్ వ్యవస్థను ప్రవేశపెట్టి 12 సంవత్సరాలు గడిచింది. అప్పటి నుండి ఆర్థిక కార్యక్రమాలకు చెందిన అనేకరంగాలలో గణనీయమైన ప్రగతినే సాధించారు. తత్ఫలితంగా ప్రజల జీవన ప్రమాణం మెరుగుపడింది.

జగిత్యాల పంచాయతీ సమితిలో 86 గ్రామాలతో కూడిన 57 గ్రామ పంచాయతీలు ఉన్నాయి. జనాభా 1.17 లక్షలు. సమితి విస్తీర్ణం 3.38 లక్షల ఎకరాలు. దానిలో 90 000 ఎకరాలు మగాణి. కరీంనగర్‌కు 50 కిలో మీటర్ల దూరంలో యిది ఉంది.

## వ్యవసాయం

పంచాయతీ సమితి ఏర్పడిన తర్వాత వ్యవసాయ ఉత్పత్తులపై సస్యవిప్లవం కొత్త రికార్డులను సృష్టించింది. స్థానిక రకాలైన వంగడాలకు అలవాటు పడిన రైతులు అధిక దిగుబడినిచ్చే మేలిరకం వంగడాలు ఉపయోగించనారంభించారు.

పంచాయతీసమితి ఏర్పాటుకాకముందు సమితిలో మొత్తం 8 ఆయిల్ యింజనులు మాత్రమేఉండేవి. ఇప్పుడు 75 ఆయిల్ ఇంజనులు 62 విద్యుచ్ఛక్తి మోటారు పంపుసెట్లు ఉన్నాయి. సబ్సిడీ పథకం క్రింద, స్వయం సహాయక పథకం క్రింద దాదాపు 3,833 సేద్యపు నీటిబావులను త్రవ్వారు. తద్వారా అదనంగా 7,666 ఎకరాల భూమిని సాగులోకి తెచ్చారు. దీనికితోడు రు 1.11 లక్షల ఖర్చుతో 66 చిన్నతరహా నీటివనరులు సమితి మరమ్మతుచేసింది. దీనివల్ల అదనంగా 7,508 ఎకరాల భూమి సాగులోకితేబడింది.

## రహదారులు

సమితి ఏర్పడకపూర్వం 3 మైళ్ళమేరకు మాత్రమే రోడ్డు ఉండేది. పంచాయతీ, రోడ్ల నిర్మాణానికి అధిక ప్రాధాన్యం యిచ్చి రు 12.18 లక్షల ఖర్చుతో దాదాపు 82 కిలోమీటర్ల దూరం రోడ్డు నిర్మించింది. జగిత్యాల నుండి బోర్నపల్లి, జగిత్యాల నుండి దొంతెపూర్, జగిత్యాల నుండి పెద్దపల్లి రోడ్లు నిర్మించబడినాయి. 65,000 జనాభాగల 33 గ్రామాలకు రహదార్ల సౌకర్యం కల్పించబడింది వాటికితోడు పంచాయతీ సమితి నిధులలో రు 2.12 లక్షల ఖర్చుతో 14 అప్రోచ్‌రోడ్లు నిర్మించారు. రోడ్లు నిర్మాణం నిమిత్తం ప్రజలు రు. 2 53 లక్షల మేరకు విరాళాలు యిచ్చారు. ఈ అప్రోచ్‌రోడ్ల నిర్మాణం ఫలితంగా 42 గ్రామాలకు రహదారి సౌకర్యం ఏర్పడింది.

## మంచినీటి సరఫరా

సమితి గ్రామాలలో మంచినీరు సరఫరా చేసే నిమిత్తం రు. 2.75 లక్షల ఖర్చుతో 165 మంచినీటిబావులను త్రవ్వారు. దీనికి తమవంతు వాటాగా ప్రజలు రు.34.000లమొత్తాన్ని విరాళంగా యిచ్చారు. ఇప్పుడు సమితిలోని 70 గ్రామాలలో మంచినీటి బావులు ఉన్నాయి.

## విద్య

పంచాయతీ సమితి ఏర్పడకముందు యీ ప్రాంతంలో 4 ప్రాథమిక పాఠశాలలు ఉండేవి ఇప్పుడు 104 ప్రాథమిక పాఠశాలలు పనిచేస్తున్నాయి రు. 3.36 లక్షల ఖర్చుతో కొత్తగా 40 పాఠశాల భవనాలు నిర్మించబడినాయి.

సమితి ప్రాంతంలో 86 గ్రామాలలో 100 వయోజన విద్యా కేంద్రాలు ఏర్పాటు చేయబడినాయి. 1,389 మంది అక్షరాస్యులను చేశారు. 160 మంది హరిజన, గిరిజన విద్యార్థుల నిమిత్తం 3 హరిజన హాస్టళ్లు, ఒక గిరిజన హాస్టల్ నిర్మించబడినాయి.

## పరపతి సంఘాలు

సమితిలో 70 సహకార వ్యవసాయ పరపతి సంఘాలు ఏర్పాటు చేయబడినాయి. తద్వారా నూటికి నూరుశాతం గ్రామాలు సహకార రంగం పరిధిలోకి తేబడినాయి. ఈ సంఘాల నుండిఉత్పత్తి ఋణాల క్రింద రైతులకు రు 6 లక్షల మేరకు ఋణాలు మంజూరు చేశారు.

## ఆరోగ్యం

సమితి ప్రాంతంలో రెండు ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు ప్రారంభించ బడినాయి. ధర్మపురిలో ఒకటి, రాయకల్లులో ఒకటి ఉన్నాయి. వాటిక్రింద 8 ఉపకేంద్రాలు నిర్వహించబడుతున్నాయి. గ్రామీణ విద్యుదీకరణ క్రింద 8 గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేయబడింది.

## పన్నులు

ఈ పంచాయతీ సమితికి యిండ్ల పన్నులను నూటికి నూరుపాళ్లు వసూలు చేసినందుకు గాను జిల్లా స్థాయిలో ప్రథమ బహుమతి లభించింది.

## గ్రామీణ పరిశ్రమలు

ఈ పంచాయతీ సమితిలో ధర్మపురిలో ఒకటి, రాయకల్లులో ఒకటి మొత్తం రెండు పారిశ్రామిక సహకార సంఘాలు ఏర్పాటు చేయబడినాయి. ధర్మపురిలో పారిశ్రామిక సహకార సంఘంలో వెదురు పరిశ్రమనూ, రాయకల్లు సంస్థలో నూనె గానుగ పరిశ్రమను ఏర్పాటుచేశారు సమితిప్రాంతంలో రెండు శిక్షణ—ఉత్పత్తి కేంద్రాలను ప్రారంభించి 49 మంది గ్రామీణ వృత్తి పనివారలకు శిక్షణ యిచ్చారు. 60 మంది వృత్తి పనివారలకు రు. 0.55 లక్షల మేరకు ఆర్థికసహాయం అందజేశారు. దీనికితోడు 50 శాతం సబ్సిడీపై ఆధునిక పరికరాలను కూడా సరఫరా చేశారు.




## 5

## సమాలోచన

సోమదేవరాజు, అన్నమ దేవరాజు శృంగేరికి వచ్చేసరికి విద్యారణ్య యతీంద్రుడు ధ్యాన సమాధిలో వున్నాడు. అందువల్ల వారిద్దరూ ఆశ్రమ వాసులతో చెప్పి ప్రకృతి దృశ్యాలను చూడడానికి వెళ్లారు.

ఆనెగొంది సోదరులు వెళ్లిన కొంత సేపటికే సాయణ భోగనాథులు గూడ అచ్చటికి వచ్చారు. అప్పుడుగూడ యతీంద్రుడు ధ్యానంలోనే వున్నాడు. అందువల్ల వారొకవైపు కూర్చొని మాట్లాడుకొన సాగారు.

అన్నమ దేవరాజుకు ఆ తుంగభద్రానదీ లోయలు, ఆ నదీతీరాన వున్న రకరకాల వృక్షాలు, వాటి నల్లుకొనివున్న తీగలు, ఆ తీగలనుండి వ్రేలాడుతున్న పూల గుత్తులు ఎంతో ఆహ్లాదాన్ని కలిగించాయి.

"ఇచ్చటెంత ప్రశాంతంగా వున్నది?" అన్నాడు అన్నమ దేవరాజు.

"అందుకనే ఆదిశంకరుడిచ్చట ఈ పీఠాన్ని నెలకొల్పాడు." అన్నాడు సోమదేవరాజు.

''ఆ మహాత్ము డెంతో గొప్పవాడని విన్నాను. చిన్నతనంలోనే అంత జ్ఞానం సంపాదించాలంటే సామాన్యమైన విషయం గాదు.''

''అద డిచ్చటేగాదు. దేశం నలుమూలలలోను ఈలాటి పీఠాలను నెలకొల్పాడు.''

ఆ మాటల్ని విని ఎచ్చట? అన్నట్లుగా చూచాడు అన్నమ దేవరాజు.

''ఇచ్చ టొకటి. ద్వారకలో ఒకటి. పూరీలో ఒకటి. బదరీ నాథంలో ఒకటి. ఈలాగా నాలుగు మూలలలో నాలుగు పీఠాలు నెలకొల్పడమేగాక, కాంచీపురంలో గూడ కామకోటి పీఠాన్ని నెలకొల్పి అచ్చటే వుంటూ వచ్చాడు'' అన్నాడు సోమదేవరాజు.

అంతలో ఒక ఆశ్రమవాసి వచ్చి సోమదేవరాజును పలకరించాడు.

''యతీంద్రులు రమ్మంటున్నారు'' అని పిలిచాడతను. ఇదో వస్తున్నాము. అంటూ సోదరు లిద్దరూ ఆ యాశ్రమవాసి వెంట వెళ్లారు.

మాధవ విద్యారణ్య యతీంద్రుడు కృష్ణాజినం మీద కూర్చొని వున్నాడు. అతని ముఖం కళకళ లాడుతున్నది. అతని కొక ప్రక్కన అతని సోదరులైన సాయణుడు, భోగనాథుడు కూర్చొని ఉన్నారు. మరొక ప్రక్క ఒక చాప పరచబడి వున్నది. ఆనెగొంది సోదరు లచ్చటికి వస్తూనే యతీంద్రునికి సాగిలబడి నమస్కరించారు. యతీంద్రుడు వారి నాశీర్వదించాడు. ఆ తరువాత వారు లేచి ప్రక్క నున్న చాపమీద కూర్చున్నారు.

''వీరేనా ఆనెగొంది సోదరులు?'' ప్రశ్నించాడు భోగనాథుడు.

''అవును'' అన్నాడు సాయణుడు.

''వీరెవరు?'' ప్రశ్నించాడు సోమదేవరాజు.

''ఇతడు నా సోదరుడైన భోగనాథుడు'' సమాధాన మిచ్చాడు సాయణుడు.

ఆ సోదరుల్ని చూస్తూనే యతీంద్రుని మనస్సు పల్లవించింది. తప్పనిసరిగా వారు తన కోరికను నెరవేర్చగలరనుకొన్నాడతడు.

"ఆనాడే వస్తారనుకొన్నాను.'' అంటూ చిరునవ్వు నవ్వాడు యతీంద్రుడు.

''మన్నించాలి. తొందర పనులుండడంవల్ల రాలేకపోయాము. నా సోదరుడు గూడ రావాలన్నందువల్ల ఇంత ఆలస్యమయింది." అన్నాడు సోమదేవరాజు.

పరవాలేదు ఇప్పుడు వచ్చారుగదా. అదేచాలు.'' అన్నాడు విద్యారణ్యుడు.

ఆమీద ఎవ్వరూ మాట్లాడలేదు.

"ఢిల్లీ సుల్తాను మరణించినట్లు, అతని కుమారుడైన ఉలుఘ్‌ఖాను సుల్తాను కానున్నట్లు వార్తలు వస్తున్నాయి నిజమేనా?'' యతీంద్రుడు ప్రశ్నించాడు.

''నిజమనే తెలుస్తున్నది. కంపిలలో వున్న సుబేదారు మలిక్‌నబీ గూడ ఢిల్లీకి ప్రయాణమవుతున్నట్లున్నది.'' అన్నమదేవుడన్నాడు.

'' ఆ సుల్తాను విధానమెలా వుంటుందో? '' సంశయం వెలిబుచ్చాడు భోగనాథుడు.

''ఏమాత్రం మార్పు ఉండదు. తండ్రి కెంత హిందూ మత ద్వేషమున్నదో అంతే ద్వేషం కుమారునికి గూడా వుంటుంది. ఉలుఘ్‌ఖాను దక్షిణా పథం మీదికి దండెత్తి వచ్చినప్పుడు మాలిక్ కాఫర్ కంటె దారుణాలు గావించినాడు. గ్రామాలు గ్రామాలను దహించి వేశాడు. కనబడినవారి నెల్లరినీ ఆ మంటలలో వేయించాడు. పరుగెత్తినవారిని వేటాడి చిత్రవధ గావించాడు. అతడు సుల్తానయితే హైందవం అడుగంటినట్లే''అన్నాడు సోమదేవరాజు.

''అతడు కొంత పిచ్చివాడని అంటారే?'' నవ్వుతూ ప్రశ్నించాడు భోగనాథుడు.

''అని అంటారు. అదెంతవరకు నిజమో తెలియదు. కాని పట్టిన పట్టు మాత్రం వదలడంటారు. తానేది కావాలంటే అది నిమిషాలమీద జరిగి తీరవలసిందే నంటారు'' అని చెప్పాడు రాజు

"ఎవరేలాటివారైనా వారినెదిరించక తప్పదుగదా?''అన్నాడు యతీంద్రుడు అప్పుడతని మోము గంభీరంగా వుంది.

''అది యెటూ తప్పదు'' అన్నాడు అన్నమదేవుడు.

''ఆ విషయాన్నిగూర్చి మీరేమైనా ఆలోచించారా?'' ప్రశ్నించాడు యతీంద్రుడు

''యోచిస్తూనే వున్నాము కాని......''

''మీరేమీ అధైర్యపడ నక్కరలేదు మీరా సుల్తాను నెదిరించడానికి ప్రయత్నించండి. దేవుడు మీకు తోడువస్తాడు'' ఆ మాటలంటున్నప్పుడతని మోము కళ కళ లాడింది.

"ఆలాగే చేస్తాము. దానికి మీ ఆశీర్వచనముండాలి'' అన్నాడు సోమదేవరాజు.

''మీరేకాకులుగా వుండడం సంభవించదు. ప్రజలందరూ మీకు బాసటగా నిలబడతారు అంతేగాదు. తీరాంధ్ర ప్రాంతంలో గూడ ఒక విధమైన తిరుగుబాటు వస్తున్నట్లుంది'' యతీంద్రుని మాటలు వింటూనే అందరూ ఆశ్చర్యంతో ఆయనవైపు చూచారు.

''మీరేమీ ఆశ్చర్యపడ నక్కరలేదు. పరిస్థితులలా త్రోసుకొని వస్తున్నవి. కిరాతకమైన యీ ముస్లిం పరిపాలనను ఏ హిందువూ అంగీకరించడు''

''తీరాంధ్ర ప్రాంతంలో తిరుగుబాటు వస్తున్నదని మీకెలా తెలిసింది?'' ప్రశ్నించాడు సోమదేవరాజు.

అందరూ యతీంద్రుని సమాధానం కోసం ఆదుర్దాతో ఎదురు చూచారు.

"మొన్న మొన్ననే కొలని ప్రాంతంనుండి యెవ్వరో కొందరు ఇచ్చటికి వచ్చారు. వారు మన ఆశ్రమవాసులతో ఆవిషయాలు చెప్పారట''

"ఏమని?'' ప్రశ్నించాడు అన్నమదేవుడు.

"కాపయ్యనాయకుడని, వేమారెడ్డని యిద్దరు యువకులు తీరాంధ్రమంతా తిరిగి అందరినీ కూడగడుతున్నారట. కొలని రుద్రదేవుడుగూడ వారికి సాయంగా ఉన్నాడట. అదీ వారు చెప్పింది'' అన్నాడు యతీంద్రుడు.

"ఇది ప్రోత్సాహకరంగానేవుంది' అన్నాడు సోమదేవరాజు.

"సోమదేవా, పరిస్థితులు మన కనుకూలంగా పరిణతిచెందుతూ వున్నవి. మనమేమీ భయపడ నవసరం లేదు ప్రయత్నిస్తే మనకు జయం చేకూరుతుంది. చూడు బలమైన దేవగిరి, కాకతీయ రాజ్యాలు పతనమయినప్పుడే హైందవం పడిపోతున్నదని నేను బాధపడ్డాను. దీనినేవిధంగానైనా ఉద్ధరించాలని నేననుకొన్నాను. కాని యతినైన నేనేమి చేయగలను. నేను సలహాలివ్వగలను. ప్రోత్సహించగలను. కాని ఆ కర్తవ్యాన్ని నిర్వర్తించ వలసింది నీలాటి యువకులు గదా?''విద్యారణ్యుడు సోమదేవుని కళ్ళలోకి చూచాడు.

"నిజమే యతీంద్రా. మేమే అందుకు పూనుకోవాలి. మేము గూడ ఆ ప్రయత్నంలోనే వున్నాము'' అన్నాడు సోమదేవుడు.

" అది మంచిదే. మీ ప్రయత్నం ఫలించాలని నేను కోరుతున్నాను. కాని మీరొకటి గమనించాలి" అంటూ ఆ సోదరుల వైపు చూచాడు యతీంద్రుడు.

వారు గూడ విద్యారణ్యుని మాటల కోసం ఎదురు చూస్తూ అతని వైపే చూడ సాగారు.

''సుల్తాను చాల బలవంతుడు. తిరుగుబాటు తీయడం సులభం గాని, ఎదిరించి నిలబడడం కష్టం. అందువల్ల ముందుగా తగినన్ని యేర్పాట్లు గావించు కోవాలి.

దేవగిరి కంపలి ఈ పట్టణాలలో నున్న మహమ్మదీయ అధికారులు అంత తెలివి గలవారు కాదని నేను విన్నాను. అదేనిజమైతే మీ ప్రయత్నం మరింత సులభతర మవుతుంది. పైగా ఆ

యధికార్లకు యీ ప్రాంత మంతగా తెలియదు. పోరాటం వచ్చి నప్పుడు వారిని ముప్పు తిప్పలు పెట్టవచ్చు."

"యతీంద్రుని మాటలు అక్షరాలా నిజం, అందువల్లనే మేమిలా అనుకొంటున్నాము. ముందుగా సైన్యాన్ని సంసిద్ధం చేసు కొని ఆ తరువాత కృష్ణ, తుంగభద్రానదుల మధ్యనున్న భూభాగాన్ని పట్టుకోవడానికి ప్రయత్నిద్దామని ఆలోచిస్తున్నాము."

"అదే సరైన పద్ధతి. ఆ ప్రాంతము కంపలి రాజ్యానికి గాని, దేవగిరి రాజ్యానికి గాని సంబంధించదు. అది కాకతీయ రాజ్యంలో ఒక భాగమవుతుంది. ఇప్పుడది దేవగిరిలో నున్న మహమ్మదీయ అధికారి క్రింద వున్నదేమో'' అన్నారు యతీంద్రుడు.

"అతని క్రిందికే వస్తుంది" అన్నాడు సాయణుడు.

"అతడేమంత గట్టివాడు గాదు. ఇచ్చటేమి జరుగుతున్నదో తెలుసుకోవాలనే ఆసక్తి గూడ అతనికి లేదు." భోగనాథు డన్నాడు.

"అయితే అది మనకు మరింత ఉపయోగిస్తుంది. ఏమైనా మరలా దక్షిణాపథాన్ని తురుష్కుల నుండి విముక్తి నందించాలి. అందుకోసం మీరెంత త్యాగానికైనా సిద్ధం కావాలి. నా యాశీర్వాదం మీకెన్నడూ వుంటుంది. సాయణ భోజనాథుల సాయంగూడ మీకు లభిస్తుంది. నేను విన్నట్లు తీరాంధ్రప్రాంతంలో తిరుగుబాటు వస్తే అప్పుడు మీ పని మరీ సులభతరమవుతుంది. ముస్లిం సేనలు వారినణచడానికచ్చటికి తరలించబడతాయి. ఆ సమయంలో మీరు విజృంభించి విజయాలను సాధించవచ్చు." అన్నాడు యతీంద్రుడు.

యతీంద్రుని మాటలు ఆ యానెగొంది సోదరులకు బాగుగా నచ్చాయి.

"ఆ కాపయ్య ఎవరో, ఆ వేమారెడ్డెవరో తెలుసుకోవడానికి ప్రయత్నించండి. అవసరమైతే వారితో సంబంధాలు నెలకొల్పుకొని మీ ప్రతిఘటనను మరింత ఫలప్రదం గావించవచ్చు.'' అని సలహా యిచ్చాడు విద్యారణ్యుడు.

"ఆలాగే చేస్తాము." అన్నారు ఆనెగొంది సోదరులు. ''మీయాశీర్వాదముంటే మేమేమైనా చేయగలం. కాకతీయ సామ్రాజ్యాని కొకనాడు మూలస్తంభంగా వుండిన గంగయ సాహిణి లాగా మేము విజృంభించ గలం." అన్నాడు సోమదేవరాజు.

అతని మాటలు విని చిరునవ్వు నవ్వాడు యతీంద్రుడు.

"గంగసాహిణి అంటే గమనం వస్తుంది. అతని వీరత్వాన్ని గూర్చి యిప్పటికి గూడ కథలుగా చెప్పుకొంటారు." భోగనాథు డన్నాడు.

"ఆ కాలం వేరు, ఈ కాలం వేరు." అన్నాడు సాయణుడు.

"ఇంతేగదా మనం మాట్లాడ వలసింది" అన్నాడు యతీంద్రుడు.

"ఇంతే. ఎన్నడైన మీ సలహా కావలసివస్తే మేము మీ దగ్గరకు వస్తాము. లేకుంటే మీ వద్ద కెవరినైనా పంపుతాము." అన్నారు ఆనెగొంది సోదరులు.

"ఆలాగే" అంటూ లేచాడు యతీంద్రుడు. సోమదేవుడు అన్నమదేవుడు విద్యారణ్యునికి నమస్కరించారు. అతడు వారి నాశీర్వదించి లోనికి వెళాడు. (సశేషం)

---

# అధో జగద్వాసి

—గంధం వేదవేదేశ్వర రావు

దీనంగా నడుస్తున్నాడు
అధోజ గద్వాసి
ఆశల పొదరిళ్ళ పొగల్లో
అంతర్ధానమైన వాడు !
సంస్కృతి క్లేశచ్ఛాయల్లో
జీవితం త్రా (దు) సు
చేతబట్టుకొని
అనుభవాల తూనిక రాళ్ళు
స్వప్నాల సంచిలో వేసికొని
వసంతం వచ్చినా
చెట్లు చిగిరించని
వింత వింత ఋతువుల్ని చూసి
ఎంతో కుమిలి పోతున్నాడు.

గమ్యం లేని వాడులా
గాను గెద్దులా తిరుగుతున్నాడు.
ఆకులు రాలిన
జీవితాలను చూసి ఏమనలేక ఏడవలేక
నవ్వుతూ నడుస్తున్నాడు
అసంతృప్తి జ్వాలల అద్దాలలో
తన స్వరూపాన్ని చూసుకొని
ఏడుస్తూ నడక సాగిస్తున్నాడు
హృదయ శ్మశానంలో
పెరిగిన విరక్తి గడ్డిని
ద్వేషం గడ్డిపూలను కోసికొని
ఎండిన గుండె గంపలో నింపుకొని
సంక్షోభం జలపాతం

ఒడున దించి
కుప్పైన మనసులో
కన్నీటి కెరటాలో
కడుపు నింపు కొంటున్నాడు
కదులు తున్నాడు
మెల్లగా మెదులు తున్నాడు
విష వాయువులు పీలుస్తూ
ప్రాణ వాయువు వదులుతూ
బాధా భారతం నెమరేసు కొంటూ
భయం భాగవతం పఠించు కొంటూ
సహనంతో అడుగేస్తున్నాడు
దీనంగా నడుస్తున్నాడు
అధో జగద్వాసి.

# అరవింద సాహిత్యము

కాముఋషి సత్యనారాయణవర్మ

అరవిందుని సాహితీ స్రవంతి ఒకచోట సహజ నిర్మలజలాలతో మందగతిలోను, ఒక చోట ఉత్తుంగపర్వత శ్రేణులపై నుండి ప్రవహించు జలపాత సదృశముగాను, ఒక కొండలోయలో నిశ్శబ్దగంభీరముగాను, ఒక సువిశాల సైకత స్థలిపై సుదీర్ఘముగాను ప్రవహించు నదీగమనము వలె సాగి భారతావనినేగాక అఖిల ప్రపంచ ఆధ్యాత్మిక వాతావరణమును పునీత మొనర్చినది. దేశభక్తి, ఆధ్యాత్మికశక్తి, మార్మికయోగ అనుభూతులు, మానవతా పరిణామ స్వరూపము, వైదిక విజ్ఞాన దీపికలు, ఉపనిషన్మధువులు, ఐతిహాసిక కథా వ్యాఖ్యానములు మొదలగు ఇతివృత్తములతో ఆయన సాహితి విస్తరించినది. ఒక ద్రష్టయొక్క భవిష్యద్దర్శనమునకు, ఒక మహాకవి యొక్క భావనా పటిమకు కళాకారుని యొక్క సృజనాత్మక కౌశలమునకు సంగమస్థానంగా ఆయన రచనలు భాసించాయి. ఆయన రచనా రీతులు తెలుసుకొనుటకు ముందు, వారి బహు భాషా పాండిత్యము, అపార గ్రంథ పఠనాసక్తిని గ్రహించ వలసియున్నది.

ఇరువది రెండు సంవత్సరాల ప్రాయంలో పదునాల్గు సంవత్సరాలు సంపూర్ణ ఆంగ్లవాతావరణంలో పెరిగి అచ్చటనే పాశ్చాత్య విద్యలలో పట్టభద్రుడై ఆంగ్ల సాహిత్యమును తనివితీర గ్రోలి, విద్యార్థి దశలోనే వయస్సుకు మించిన మేధాసంపన్నత, అసాధారణ గ్రహణశక్తి సంపాదించుకొన్న ఘనుడు. ఆంగ్లభాషతో పాటుగా లాటిను, గ్రీకు భాషలలో కవిత వ్రాయగల సమర్థత అలవర్చుకొన్నాడు. జర్మను, ఇటాలియను, ఫ్రెంచి భాషలలో చెప్పుకోదగ్గ అభినివేశం కలిగించు కొన్నవాడు. అసమాన ఆంగ్ల విద్యాపారంగతుడై 1893లో ఆంగ్లదేశం విడిచి భారతదేశం తిరిగి వచ్చి బరోడా కాలేజీలో ఇంగ్లీషు ప్రొఫెసరుగా జీవితం ప్రారంభించారు. అప్పటికింకా మాతృభాషయైన బెంగాలీతోగాని, సంస్కృత భాషతోగాని వారికి పరిచయం కలుగలేదు. అందువల్ల తన ఉద్యోగ ధర్మం నిర్వర్తిస్తూనే సంస్కృతం, బెంగాలి భాషల అధ్యయనం ప్రారంభించారు. భారత సంస్కృతికి పెన్నిధుల వంటి రామాయణ భారత గ్రంథాలు, వేదములు, ఉపనిషత్తులు, మనుస్మృతి, భగవద్గీత ధ్యయనం చేశారు. కాళిదాసు, భవభూతి మొదలగు కవులతో ంచి పరిచయం కలిగించుకొన్నారు. బరోడా సంస్థానంలో గుర్తింపబడిన గుజరాతీ, మరాఠీ భాషలలో గూడ మంచి పరిజ్ఞానం కలిగించుకున్నారు. సంస్కృతం చదివిన దీక్షతోనే హోమరు, డాంటే హోరెస్ (Horace) రచనలను కూడ పఠించారు. ఈవిధంగా అపారమైన తృష్ణతో విద్యల నార్జించుకొని విద్యాసాగరుడై భాసించారు. ఇంగ్లండులో విద్యార్థి దశలో వ్రాసిన ఆంగ్ల పద్యాలు, సంపుటీకరించి (Mysilla) అను పేరుతో తొలిసారిగా ప్రకటించారు. 1893-94 లో బొంబాయి నుండి ప్రకటింపబడుచున్న "ఇందు ప్రకాష్" పత్రికలో New lamps for old అను శీర్షికలో కొన్ని వ్యాసాలు వరుసగా ప్రకటించారు. భారత రాజకీయోన్నతికి, స్వయంకృషి, నిజాయితీ, ఆత్మవిశ్వాసం, నైతికనిష్ఠ పెంపొందించుకో వలసిన ఆవశ్యకత గురించి ఉద్బోధించారు. తన సహచరుడైన బిపిన్ చంద్రపాల్ ప్రోత్సాహం మీద ఆయన నడుపుతూన్న, వందేమాతరం పత్రికకు ఉత్తేజకరము దేశభక్తి ప్రబోధకములగు వ్యాసాలు వ్రాసి ఇచ్చేవారు. వారి ఉద్యోగ ధర్మాన్ని బట్టి అవి వారిపేరున ప్రకటింపబడలేదు, ఆవ్యాసాలు రాజద్రోహపూరితమైనవని, నాటి ఆంగ్ల ప్రభుత్వం వారి ప్రోసిక్యూషను పర్యాలోచనకు గురియైనవి. కాని అవిఅరవిందునిరచనలేననిఋజువుకాలేదు, జరిగిన ఆ రచనలలో రాజద్రోహకరమైన భావాలు లేవని కేసు కొట్టివేసారు. ఈ అలజడిలో సునిశితమైన ఆయన లేఖిని పరోక్షంగా [illegible] పోయింది. ప్రజలలో చైతన్యం, జాతీయత, దేశభక్తి [illegible] రచనలు ఇంతటి నుండి ఆయన పేరుతోనే ప్రకటిస్తుండేవారు [illegible] పేరుపైన ఆసక్తిలేదు. ప్రచారం అంటే గిట్టదు కాని [illegible] వలసివచ్చి నందున, నేను రచయితగా బయట పడ[illegible] అని ఒకప్పుడు ఆయనే వివరించారు. వంగ సాహిత్య[illegible] ప్రసిద్ధిబడసిన మైకేల్ మధుసూదన దత్తు, బంకించంద్ర [illegible] అభిమాన కవులు. ఈ కవుల గురించి తిలక్ గురించి ఆయన వ్యాసాలు వ్రాసేరు. దేశభక్త సి. ఆర్. దాసుగారు రచించిన [illegible] సంగీతం అనువాదం చేసి ప్రకటించారు.

## వంగరాష్ట్ర విభజన

1905లో జరిగిన వంగ రాష్ట్ర విభజన దేశం నలుమూలలా అపూర్వమైన చైతన్యం కలిగించింది. దేశభక్తి, ఆంగ్ల [illegible] లనపై విరక్తి పొంగులు వారింది. ఈ ఉద్యమంలో [illegible] ప్రత్యక్షంగా రాజకీయాలలో పాల్గొని బరోడా విడిచి కలకత్తాలో స్థిరపడినారు. అల్లీపూర్ బాంబు కేసులో వీరు అనుమానించి నిర్బంధితులైనారు. ఈ తరుణంలో నవశక్తి అనే రాజకీయ పత్రిక నారంభించారు. 1908లో ఈయన నిర్బంధితుడై నప్పుడు చేతులకు అరిదండాలు వేసి జైలుకు తీసుకొని పోయారు. ఆనాటి ఆంగ్ల పరిపాలకుల దౌష్ట్యపద్ధతులు తన నిర్బంధంలో అనుసరించిన కఠిన పద్ధతులు వివరిస్తూ 'కారా కహాని' అనే పుస్తకం బెంగాలీలో వ్రాసి ప్రకటించారు. దేశభక్త చిత్తరంజన దాసుగారి వాదనా పటిమతో అరవిందులు నిర్దోషిగా ప్రకటింపబడి ఆయన కారాగార విముక్తి నొందారు. సుమారు సంవత్సరముపాటు గడిపిన కారాగార వాసం అరవిందునిలో ఒక అపూర్వ పరివర్తనానికి నాందియైనది. కారాగారం శ్రీకృష్ణ పరమాత్మకు జన్మస్థలం గదా! భారతదేశం వచ్చిన నాటి నుండి ఆయనలో ప్రవర్ధమానమౌతూన్న ఆధ్యాత్మిక చింతనకు ఫలితంగా జైలులో శ్రీ కృష్ణపరమాత్మ [illegible]

కలిగింది. జైలు పరిసరాలు కోర్టు అంతా సర్వం వాసుదేవ స్వరూపంగా భాసించింది. భగవద్గీతలోని శ్రీకృష్ణ సందేశం ఆయనకు అవగతమైనది. పూర్ణ యోగసాధనలో తనకున్న సంశయాలు తీరేవరకు కొలది దినాలు శ్రీ వివేకానందస్వామి వారికి దర్శనమిచ్చి తన్నొక పూర్ణ పురుషునిగా, యోగిపుంగవునిగా భవిష్యత్తులో తీర్చి దిద్దిన మహాసంఘటనకు కారాగార వాసం కారణభూతమైంది. దీనితో ఆయన రాజకీయ జీవితానికి వీడ్కోలు–పూర్ణయోగ సాధనకు స్వాగతము పలికి నట్లయినది. 1909 జూలైలో, open letter to my country men అని వ్రాసిన లేఖ ఆయన రాజకీయ వాదిగా వ్రాసిన తుది వీలునామా అని ప్రఖ్యాతి పొందినది. అందులో స్వయం సహాయం, శాంతి యుత సాత్విక నిరోధం భారత రాజ్య పరిపాలన మనచేత చిక్కేవరకు ప్రభుత్వంతో సహాయ నిరాకరణం, స్వదేశీదీక్ష, విదేశ వస్తు బహిష్కారము అను సూత్రాలు స్వరాజ్య సంపాదనకు ముఖ్య సూత్రాలుగా ఆయన సూచించేరు. భవిష్యత్తులో గాంధీజీ నిర్మాణ కార్యక్రమంలో ఇవే ప్రాధాన్యత వహించేయి. గాంధీజీ, సుభాష్ చంద్రబోసు ప్రభృతులు వీరిని మరల రాజకీయ రంగమున నాయకత్వము వహింప రమ్మని ఎంత కోరినను ఆయన అంగీకరింపక నిరాకరించారు.

## అంతరాత్మ ప్రబోధం

అంతరాత్మ ప్రబోధంతో యోగసాధనకైన తీవ్ర సంకల్పం కలిగి అనేక నిర్బంధాలకు నిలయమైన బ్రిటీషు ఇండియా వదలి ఫ్రెంచి పరిపాలనలోని పాండిచ్చేరి తన ఆధ్యాత్మిక సాధనకు కార్యరంగంగా స్వీకరించి 1910 లో ఆయన రహస్యంగా అక్కడకు చేరుకొని స్థిరపడి పోయారు. భారత దాస్య విముక్తి ఆయన యోగసాధనలో ఒక ముఖ్యాశయమని ఆయన భావించారు. అందుకు నిదర్శనముగా ఆయన 75 వ జన్మదినం 1947 (ఆగస్టు) 15 భారత స్వాతంత్ర్యదినంగా భాసించింది. 1914 లో పాండిచ్చేరిలోనే మీరారిచ్చర్డు అనే ఆంగ్ల వనిత ఈయనను దర్శించి వీరిని దివ్యావేశముగల పూర్ణయోగిగా గుర్తించి ఆసియా ఖండ పునరుద్ధరణకు ఈయన దివ్యతేజస్సు ఉపకరింపగలదని ఆమె విశ్వసించెను. అనంతరము ఆమె అరవిందునకూ ఆశ్రమానికి మాతృమూర్తియై భాసించింది. ఆశ్రమ నిర్వహణ భారం ఆమె పూర్తిగా స్వీకరించింది. ఆయన యోగసాధనకు గ్రంథరచనకు పత్రికా నిర్వహణకు అనేక విధాలుగా సావకాశం కలిగించింది. మాతృశ్రీ నేటికి చిరంజీవియైయుండి అరవిందుని అధ్యాత్మిక సందేశాన్ని ప్రపంచంలో చాటు తున్నారు. 'ఆరోవిల్' అనే సకల ప్రపంచ దేశనాగరికతా సంస్కృతులకు నిలయమైన సంగమ స్థానంగా భాసించగల మహానగర నిర్మాణానికి సంకల్పించి కృషి సాగిస్తున్నారు. వసుధైక కుటుంబమను అభిప్రాయమునకు అరవిందులు చేసిన సూచనతో ఈ నగర నిర్మాణమున ప్రత్యక్షమై రూపొందు చున్నవి.

ఆయన ఆధ్యాత్మిక జీవితానుభవంతోనే ప్రఖ్యాత గ్రంథ రచనకు కూడ సంకల్పించి రచనలు సాగించారు. 1914–20 మధ్యకాలంలో ధారావాహికంగా గ్రంథాలు వ్యాసాలు పరంపరగా వ్రాయబడి ప్రకటితమైనాయి వానిలో Essays on Gita The Life Devine, The Synthesis Yoga, The Secret of Veda, The Ideal of Human Unity, A Defence of Indian Culture, The Psychology of social developmet మొదలగు రచనలెన్నో వెలువడాయి. వీరితొలిరచనలలో ప్రస్ఫుటంగా గోచరించే గ్రీకు లాటిను సాహిత్య ప్రభావం క్రమంగా తగ్గి ఈ రచనలలో సంస్కృత సాహిత్య సంబంధమైన హైందవ సంప్రదాయ బద్ధములైన భావాలతో భాసించేయి. అరవిందుని సాహిత్యం గురించి పరిమితమైన ఒక వ్యాసంలో వ్రాయ బూనుట సూర్యుని దివిటీతో చూప బూనుట వంటిది. బహు భాషావేత్త మర్మయోగి విశిష్టమగు మహామనీషి లేఖినినుండి వెలువడిన రచనలు అధికారికంగా ప్రామాణికంగానుండ గలవనుట అతిశయోక్తి కాదు. ఈ గ్రంథాలలో అపార గ్రంథావలోకనముతో పాటుగా దానికి మించిన యోగసాధనలో గల ప్రత్యక్షానుభూతులతో నిండియున్నవి. జాతీయ భావములతో ఆవేశపూరితమైన సందేశములకు యుగాంతర్, వందే మాతరంలో రచనలు నిదర్శనములు. కర్మయోగిన్ ధర్మ పత్రికలోని రచనలు దేశభక్తి పూరితమైన తత్వవేత్త యొక్క ఆధ్యాత్మిక భావాలు అనుభూతులు గోచరిస్తాయి. అతి సహజముగ ధారావాహికంగా అంతరంగంనుండి వెలువడినవేగాని ఆలోచించి కష్టించి వ్రాసినవి కావు. 6½ సంవత్సరాలు నడిచిన ఆర్య పత్రికలోని రచనలలో మానవతయొక్క భవిష్యద్దర్శనము సంపూర్ణయోగ సాధనలో ఉన్నత దశల నధిరోహించిన యోగిపుంగవుని అనుభవాలు వివరింపబడినవి. ఆర్య శబ్దమును జాతిపరంగాగాని, కులదృష్టితోగాని ఆయనభావింపలేదు. హలము చేత పట్టి భూమిని దున్ను కర్షకుడు ఓటమి ఎరుగని వీరుడు మానవ పరిణామ దశలలో వచ్చిన ఆటంకములను జయించ గలవాడు, ఆర్యుడు అని నిర్వచించారు. ప్రతివిషయము నందును సత్యమును మంచిని ఉన్నతిని ఋజుభావమును గ్రహించు వాడుఅన్న మహోదాత్త అర్థంతో ఆయన ఆర్య పత్రిక స్థాపించినిర్వహించారు.

## సావిత్రి

అరవిందుని కవితా రచనలలో భావనావేశ పటిమ పరాకాష్ఠ నొందిన కృతి 'సావిత్రి'. బరోడాలో నుండగా ప్రారంభించిన ఈ కావ్యం తన దేహ పరిత్యాగమునకు ముందు కొలది కాలము వరకు రచన సాగిస్తూ దానికే ఏదో అందాలు దిద్దుతూనే ఉన్నారు. 24,750 పాదాలు గల సుదీర్ఘ ఆంగ్లపద్య కావ్యం. ఇది మిల్టను పారడైజు లాస్టుతో పోల్చదగిన ఊహా చిత్ర సంపూర్ణమైన హైందవగాథ. ఆయన దీనికి A Legend and a Symbol అనికూడ పేరు పెట్టిరి. ఊహా చిత్రాలను గుర్తిస్తూ మార్మిక కవితా సౌందర్యాన్ని అనుభవించగల కవితా ప్రియులకు 'సావిత్రి' ఒక ఆనంద రసధుని. ఒకానొక మార్మిక (mystic) తపస్వి, దివ్యాత్మ. అనుభవ పూర్వకంగా, శబ్ద ప్రయోగంలో శక్తివంత మైన ఇంద్రజాలిక స్పర్శతో కావ్యంగా రూపొందించిన మహత్తర కవితా కల్పన ఈ కృతిలో స్పష్టమౌతుంది. కాళిదాసుని కవితా రీతిని, సంస్కృత భాషానుగుణ్యమైన భారతీయ భావనా సౌందర్యమును, ఉపనిషత్సందేశమును, ఆంగ్లభాషా పరిధిలో వ్యక్త

పరచ ప్రయత్నించానని అరవిందులు వివరించారు. సంస్కృత భాషలో మాత్రమే వివరింప సాధ్యమగు అధ్యాత్మిక భావములను, స్వీయ యోగసాధనలోని మార్మికానుభూతులను ఆంగ్లపద్య రచనలో నిరూపించుట అందరకు సాధ్యమగు పనికాదు. కేవల ఇతిహాసికమైన సావిత్రి కథను సూత్రప్రాయంగా గ్రహించి అందు అనుసంధాన పరచిన ప్రదర్శించిన మార్మిక కవితా వైభవము ఆ రచన చదివి అనుభవింప దగినదే గాని దానిని వ్యాఖ్యానించుట సామాన్యులకు సాధ్యమైన విషయంగాదు. మార్మిక కవితా భావనలో కొంత పరిచయం గల యోగులకు మాత్రమే 'సావిత్రి' రచన ఉద్దేశించి వ్రాయ బడిన దనికూడ ఆయన వ్యాఖ్యానించేరు.

మృత్యువుతో పోరాడి యముని మెప్పించి సావిత్రి తన పతి ప్రాణములను మరల తెచ్చికొన్న విషయములో అరవిందులు సావిత్రిని మహాశక్తి యొక్క అపరావతారముగా తీర్చిదిద్దిరి. మృత్యువు యెదట తన నిజ స్వరూపమును వ్యక్తపరచి, తన కంటే అతీతమైన శక్తిలేదని వాదించిన మృత్యువును పరాజితుని గావించి పరాశక్తి ముందు తనశక్తి (మృత్యుశక్తి) అత్యల్పమైనదిగా గుర్తింప చేసి,

అసతోమా సద్గమయ।
తమసోమా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతంగమయ।

అను ఉపనిషద్వాక్యము ననుసరించి అసత్తు-సత్త్వదార్థము నందును తమస్సులు-జ్యోతియందును మృత్యువు అమృతత్వము నందును లయమొందినతెంచి నట్లుగా సావిత్రిలో నిరూపించిన అసదృశకథా కల్పనము ఋషియైన అరవిందునికే చెల్లును.

వీరి రచనలలో లేఖలు గూడ చాల ప్రాముఖ్యత చెందినవి. వారిధర్మపత్ని మృణాళినీదేవికి, సోదరుడు వీరేంద్రకు దిలీప్‌కుమార్ రాయ్ మొదలగు వారికి ఇతర మిత్రులకు వ్రాసిన లేఖలు వారి అనేక అనుభవాలకు ఆదర్శాలకు ప్రతీకలుగా ఉన్నవి. వారిసాహిత్యముయొక్క వైశాల్యమును వివరించుటకే గాని అందలి విశిష్టతను వివరించుటకు పరిమిత పుటలు చాలవు. ప్రతి రచనకు విపులవ్యాఖ్యానము లున్నచో యువతరమునకు వారి భావములను బోధపరచుటకు వీలు కలుగును. ప్రపంచ ప్రఖ్యాతి చెందిన విశిష్ట గ్రంథరచనలు వారి వారసత్వ సంపదలుగా మిగిల్చిన మహనీయులలో గాంధీజీకి సమకాలికునిగా వివేకానందునికి అనంతరము భారత జాతీయతకు అధ్యాత్మిక చింతనకు ధ్రువతారగా నిలచిన యోగి పుంగవుని దేశభక్తి ఈ శత జయంతి పురస్సరముగా స్మరించుట మనవిధి. అరవింద సాహిత్యమును యువకులలో సుపరిచయము చేయవలసిన బాధ్యతను విజ్ఞులు స్వీకరింతురుగాక,

---

# బంగ్లాదేశాష్టకము

—శొంఠి శ్రీపతి శాస్త్రి

గజిబిజి, బంగ్లాదేశ
ప్రజలను, హింసించి విప్లవ మొనర్చితివే!
ముజిబురుఁ జెఱజిఱిమితివే!
అజితుడవే నీ వసహ్యా యాహ్యా ఖాన్జీ!

చీనా చక్కెరపాకం
బానిన యమెరిక మదించి యాడిపడఁగ, రెం
డైనది పాకిస్థానిల;
నే నాఁడు సధర్మము జయమీయంగలదే?

కాపాడి కాందిశీకుల
రాపాడు విరోధి బలము రయమున లొంగన్
ద్రోపాడ ముక్తి వాహిని
వైపాడిరి పోరు ధీర భారత వీరుల్

ఇడుమలఁ గుడుచుచుఁ, జిడుముడి
పడక, జగడ మాడిరౌర! బంగ్లాదేశ్యుల్
వడి భారత సైన్యముతో
డ్పడ,వైరి యడఁగఁ, బడసిరి స్వాతంత్ర్యంబున్

ఒడఁబడక బంగ బంధుం
డెడ మాటలకును, నయంబు నెడపక భుట్టో
విడువఁగ, గోరీలోనం
బడ కదిర! ప్రధాన మంత్రి పదవిం బడసెన్

చిఱు పాకిస్థాన్ పేరునుఁ
జెరుచుచేయగు భూపరమున, జిత్తులభుట్టో
దురమునకై కాలుద్వ్విన;
గురిగొని కాశ్మీరును గొన గుఱుకొను బెట్టో

ఇతర ప్రభులకుఁ దనమొర
వితమై, పాక్సైన్య ముఱుక వెస నిండియపైఁ,
బ్రతికృతి గెలిపించిన భా
రత ప్రథమ మంత్రి యిందిరా గాంధికి జై!

ఇందిర పేరు వసుంధర
యందిర వొందె, వసుసుందరాక్షరములలో;
నెందఱొ జేజే లందురు;
వందురుదురు కొందరదిర పరహిత పరులై.

# పొగాకు ఐఎల్‌టిడి

సిగరెట్టు పొగాకు పరిశ్రమ అభివృద్ధీ, నిరంతర వికాసమూ, వీటి బాధ్యతను ఆ వ్యాపారానికి సంబంధించిన వారు పంచుకోవాలి. పండించే రైతుకు ప్రపంచపు మార్కెట్లలో వస్తూన్న మార్పులు గాని, వాళ్ళు ఎటు మొగ్గుతున్నదీ తెలుసుకునే అవకాశంగాని, ఆ సమాచారాన్ని సేకరించటానికి కావలసిన సాధనసంపత్తిగాని అందుబాటులో లేదు. అదేగాకుండా, సమగ్రమైన ప్రణాళిక లేకుండా, క్రొత్తగా కావలసిన రకాల్ని పండించటానికి గాని, క్రొత్తగా పొగాకు పండించే ప్రాంతాలను అభివృద్ధి చెయ్యటానికి గాని ఏమాత్రం అవకాశం లేదు.

ఇండియన్ లీఫ్ టొబాకో డెవలప్‌మెంట్ కంపెనీ వారూ, వారి అనుబంధ సంస్థ, ఇండియా టొబాకో కంపెనీ లిమిటెడ్ వారూ, వారి బాధ్యతలను గుర్తెరిగినవారు—భారతదేశంలో పొగాకు పరిశ్రమను అభివృద్ధి చెయ్యటానికి దీక్షతో పూనుకొన్నవారు. ఉదాహరణకు, అభివృద్ధి సాధించనున్న ప్రాంతాలలో ఐ.ఎల్.టి.డి. వారు రైతుకు ఎరువులూ, విత్తనాలూ, ఇంధనం మొదలైన వస్తువుల కోసం వడ్డీలేకుండా అప్పు యిస్తారు. ఈ సంవత్సరంలో 70 లక్షల రూపాయల్ని రైతుల సదుపాయం కోసం వినియోగించదలచారు. ఈ సహాయం అందజెయ్యటం కేవలం కంపెనీవారి వ్యాపార దృష్ట్యా మాత్రమే కాదు. రైతులను ఆపదలో తరుచు ఆదుకోవటం జరుగుతోంది. ఈ సంస్థయొక్క ప్రగతిశీల లక్ష్యమూ, భారతీయ పొగాకు పరిశ్రమ భవిష్యత్తు వికాసానికి వీరు పూనుకోవటమూ, యీ ఆశయాలను దృష్టిలో వుంచుకుంటూ, ఐ.ఎల్.టి.డి. వారి వ్యాపార దక్షతనూ, దృక్పథాన్ని ప్రతిబింబించే ఒక చిహ్నం అవసరం అయింది.

## ...మా క్రొత్త చిహ్నం





ILTD

ఇండియన్ లీఫ్ టొబాకో డెవలప్‌మెంట్ కంపెనీ లిమిటెడ్

# వరకట్న దురాచార నిర్మూలన మార్గములు

అచ్యుతుని లక్ష్మీకనకవల్లి

ఒకనాటి ఆచారములు దురాచారములుగా మారటానికి కారణాలు తెలుసుకుంటేగాని, నిర్మూలన మార్గములు గోచరించవు. నేటి వలె కాగితాలలో కాక, నాడు పశు, భూ, సువర్ణ, వస్తురూపాలలో సంపద వుండేదని చరిత్రవలన తెలుస్తుంది. తమ దగ్గర వున్న ఏ పశువునో వస్తువునో యిచ్చి తమక్కావలసిన వస్తువును ఇంకొకరి దగ్గరనుంచి తీసుకొనేవారట. వస్తువుల మార్పిడివలన జీవన యాత్ర సాగించేవారట. నేటికి కూడా పల్లెలలో పశు సంపద అనగా గొర్రెలు, మేకలు, సంపద గలవాళ్ళు కుమ్మరులకు ప్రతి సంవత్సరం ఒక గొర్రెనో, మేకనో యిచ్చి తమకు సంవత్సరానికి సరిపడు కుండలు, బానలు, మొదలైనవి తెచ్చుకుంటున్నారు. బిచ్చగాళ్ళ దగ్గర కుక్కలు వుంటాయి. ఎవరి దగ్గర ఎక్కువ కుక్కలు వుంటే వాళ్ళు గొప్పవాళ్ళుగా భావింపుతారు. పెండ్లిళ్ళ సమయంలో నా దగ్గర యిన్ని కుక్కలు వున్నాయి. నాకు పిల్లనిప్వమని అడుగుతారట నేటికీ.

నేటి మన సోషలిజమేగాని, మరి యే యిజమేగాని శాసనాలు తయారు చేయటంతో, ఉపన్యాసాలు ఇవ్వటంతోనే ఆగిపోతున్నది. పూర్వం ఏ యిజం పేరులేకుండా కేవలం భగవద్భక్తి, రాజ దండన భయంవలన సోషలిజం అమలులో వుండేదని నా వుద్దేశము. జన్మించినా, మరణించినా, వివాహమైనా, వ్రతమైనా నవధాన్యములు మొదలు గో, భూ, సువర్ణ అన్నదానాల పేరున సంవద ఒక్కరి దగ్గరే నిలిచిపోకుండా భగవంతుని పేర, పుణ్య ప్రాప్తి పేర కదలిపోతూ వుండేది. ప్రతి నెలలో ఏదో ఒక వ్రతమనో, పుణ్య దినమనో దాన ధర్మాలు శక్తికొలది జరుగుతూ వుండేవి రాజ దండనకి భయపడి పన్నులు ఎగవేశేవారు కాదు, వేడు భగవంతునికి, రాజదండనికి భయపడనివారు ఎందరున్నారో నాడు ఇందులో పదో వంతు కూడా వుండేవారు కాదు.

ప్రతి మతం "మనో వాక్కాయ కర్మలద్వారా నైనా ఏ జీవిని హింసించరాదు అనియు, శక్తికొలది దానం, ధర్మముచేయాలనే" ఘోషించుచున్నది. భగవద్గీతలో

ఇష్టాన్ భోగాన్ హివో దేవా దాస్యన్తే యజ్ఞ భావితాః
తైర్దత్తాన ప్రదాయైభ్యో యోభుఙ్క్తే స్తేన ఏవ సః

మనుజుడు చేయు యజ్ఞములచే సంతోషించి దేవతలు వారికి ఇష్టములైన భోగముల నిత్తురు. అట్లు వారిచే నీయబడిన ఆ భోగ్య వస్తువులను తిరిగి వారికి సమర్పింపకనే ఎవడనుభవించునో అతడు దొంగయే అగును అని పై శ్లోకముయొక్క తాత్పర్యము. భగవద్దత్తములైన వానిని తిరిగి భగవంతునికి-అనగా భగవత్స్వరూపులే యగు ప్రాణికోట్లకు ఒసంగక తాను భుజించినచో, లేక అనుభవించినచో అతడు దొంగయే అని పై శ్లోకముద్వారా చెప్పబడింది.

యజ్ఞ శిష్టాశిన స్సన్తో ముచ్యన్తే సర్వ కిల్బిషైః
భుఞ్జతే తేత్వఘం పాపాయే పచన్త్యాత్మ కారణాత్.

యజ్ఞమునందు (భగవదర్పణము చేసి) మిగిలిన పదార్థమును తిను సజ్జనులు సమస్త పాపముల నుండియు విడువబడుచున్నారు. అట్లు కాక ఎవరు తమ నిమిత్తమే (వండుకొని) భుజించుచున్నారో అట్టివారు పాపమునే తినువారు అగుదురు. ఈశావాస్యోప నిషత్తుయొక్క ఆరంభమున "తేనత్యక్తేన భుఞ్జనీథాః" 'అనగా నీకున్న దానిలో నొకింత త్యాగ మొనర్చి భుజింపుము. నీకున్నది భగవంతునకు అర్పించి భుజింపుము'' అని చెప్పబడింది. అందువలన నాడు తమకున్నంతలో ఏదో రూపేణ, పేరున కొంత యితరులకు యిస్తూ వుండేవారు. కొంత కాలానికి సంపద నాణెముల రూపంలోకి మారింది. అందువలన ఏ దానముచేసినా నాణెములలో కొంత యివ్వటం ఆచారమైనది. గో, భూదానాలలో సమానంగా కన్యాదానంకూడా ఒక పవిత్ర పుణ్యకార్యముగా తలచేవారు. కన్యాదానంతో పాటు తమకున్న ఏ పశు, భూ, సువర్ణం తరువాత నాణెములు (అదే ధనము) కొంత యివ్వటం ఆచారమైనది. వివాహ సందర్భములో "బొమ్మ నప్పగింత" అనే వేడుక సమయంలో ఆడపడుచు వధువుని "పట్టినిస్తావా, పాడి ఆవును యిస్తావా'' అడిగితే; ''పట్టినిస్తాను పాడి ఆవును యిస్తాను" అంటుంది. నేటికి కొందరు ఆడపిల్లలకు అత్తవారింటికి వెళ్ళేటప్పుడు తప్పక పాడి ఆవును యిస్తున్నారు.

ఒకనాడు పుణ్యకార్యముగా ఎంచబడి కన్యాదానంతోపాటు యిచ్చే వరదక్షిణ ఒక సదుద్దేశముతో ఆచరణలోకి వస్తే నేడు వరదక్షిణ వ్యాపార సరళిలోకి దిగింది. డాక్టరుకి యిన్నివేలు, ఇంజనీరుకి యిన్నివేలు, ప్లీడరుకి యిన్నివేలు అని నియమిత వెలలై (ఫిక్సెడు రేట్సు) వరకు వచ్చింది. ఈ విధంగా వరకట్నం ఒక దురాచారముగా మారటానికి ప్రతి ఒక్కరూ బాధ్యులే. ఎందుకంటే నూటికి ఏ ఒక్కరికో, ఇద్దరికో మినహా అందరికీ ఆడ, మగ సంతానము వుంటుందిగా. అందువలన శాసనాలు చేసినందునగాని. ఉపన్యాసాలు యిచ్చినందువలన గాని, ఒకరిని నిందిస్తూ రచనలు చేసినందువలన గాని ఈ వరకట్న దురాచారము సమసిపోదు. ఇంతవరకు వరదక్షిణ ఎలా ఆచారమై దురాచారముగా మారిందో తెలుసుకున్నాము. కనుక ఈ దురాచార నిర్మూలన మార్గాలు ఏమిటో చూద్దాము.

(తరువాయి 40వ పుటలో)


చిత్రకారుని
హైదరాబాదులో
కాలాపహాడ్
శ్రీ వేంకటేశ్వర

రోహో పథంలో......

వాలయం ఎదురుగా

మీద నిర్మిస్తున్న

స్వామి దేవాలయం



# తెలుగు నాట కవితా విప్లవం

గుంటి పుండరీకాక్షయ్య

" పంపా విరూపాక్ష బహు జటా జూటికా
రగ్వథ ప్రసవ సౌరభ్యములకు
తుంగ భద్రా సముత్తుంగ వీచీ ఘటా
గంభీర ఘుమ ఘుమా రంభములకు
నిర్నిబంధమై నెగడు కవిత. "
అదీ మన తెలుగు కవిత.

కవిత్వం సజీవ స్రవంతి. అది అనంతగా సాగిపోతూనేవుంటుంది. కవిత్వాన్ని లలిత కళలో ఉత్తమోత్తమమైన దానిగా సహృదయులు ఆమోదించారు. మన తెలుగు కవిత్వం తేనెలొలికే తీయని భాషగా Italian of the East గా పాశ్చాత్యుల మన్నన బడసింది. అటువంటి తెలుగు కవిత్వం నేడున్న రూపంలో పూర్వం లేదు. ఎన్నెన్నో పరిణామాలు చెంది నేటికి మన తెలుగు కవిత్వానికి యీ రూపం సిద్ధించింది. తెలుగు కవిత్వావిర్భావం నుంచి నేటి వరకు తెలుగు కవితలో వర్ధిల్లిన మార్పులను, పోకడలను స్థాలీపులాక న్యాయముగ పరిశీలించుటే యీ వ్యాసోద్దేశ్యము.

నన్నయకు పూర్వం తెలుగు భాష ' గాసట బీసట ' గా వున్నప్పటికీ నన్నయకు పూర్వమే తెలుగు కవిత్వం ఉన్నట్లు పరిశోధకులు వెల్లడించారు. పాల్కురికి సోమనాథుడు నుడివినట్లు నాడు తుమ్మెద, ప్రభాత, పర్వత, గొబ్బి, వెన్నెల మొదలైన పదాలున్నట్లు తెలుస్తోంది. ఇవి గానానికి అనుకూలమైన ఛందస్సులు. నన్నయ ఛందోబద్ధమయిన కవిత్వాన్ని నిలిపిన మహనీయుడుగా, ఆదికవిగా నేటికీ సంస్తవనీయుడవటానికి కారణము ఆయన తనకు ముందున్న భాషను సంస్కరించి, కవితాకన్యకు స్థిర రూపమివ్వటమే. అందుకే ఆయనకు " వాగనుశాసనుడు " "శబ్దశాసనుడు " అనే బిరుదాలు అన్వర్థమయ్యాయి. ఆ మహనీయుని అనంతరం వర్ధిల్లిన తిక్కన, ఎఱ్ఱాప్రెగ్గడ మొదలైన కవిపుంగవులంతా అనువాద రీతిగానే కవిత్వాన్ని రచించినప్పటికీ, తమదైన ప్రత్యేకతను పోకడను చూపించారు. ఆనాడే ఎఱ్ఱాప్రెగ్గడ ప్రబంధానికి బీజం వేశాడు. తిక్కనామాత్యుడు కవిత్వము దివ్య ప్రయోజనము కలదని ప్రకటించాడు. పోతనామాత్యుడు కూడా ఇటువంటి మహోన్నత భావములు కలవాడే. హరినామస్తుతి సేయు కావ్యము బంగారు కమలములతో విరాజిల్లు మానస సరోవరము వంటిదని, హరినామస్తుతి లేని కావ్యము విచిత్రార్థములు కలిగిన దైనప్పటికీ పాపిష్టిగొయ్యి వంటిదని ' ఆ మహాకవి ఉద్బోధించాడు. ' ఈ శుభ కావ్యరత్నమున కీశునధీశుని జేసినన్ ' అను ధూర్జటి పలుకులలోను, " మానక కర్మభూమి పయి మానుష దేహముతో హితాహిత జ్ఞాన మెఱుంగు బ్రాహ్మణుడు చారు కవిత్వము నేర్చి జానకీ జాని కథల్ రచింపక యసత్కథలెన్ని రచించె నేనియున్ వాని వివేక మేమిటికి వాని కవిత మహత్వ మేటికిన్ "

అని కంకంటి పాపారాజు భావనలోను నాటి ఆదికవి 'విశ్వశ్రేయః కావ్య ' మని పేర్కొన్నప్పటికి, వారాశించిన విశ్వశ్రేయస్సు లౌకిక పరంగా కాదని, పారలౌకిక పరమని మనకు విదిత మవుతోంది.

నన్నయ చూపిన అనువాద మార్గాన్ని అనుసరించి, శ్రీనాథాది మహాకవులంతా ఆ మార్గాన్నే పయనించారు. రాయల కాలంనాటికి ప్రబంధ రచన విస్తరించింది. ఆముక్తమాల్యద, మనుచరిత్ర, వసుచరిత్ర వంటి కావ్యాలు అవతరించాయి. క్రమ క్రమంగా కవిత్వంలో చిత్రమైన పోకడలు బయలుదేరాయి. పద్య నవలారాజమనదగిన ' కళాపూర్ణోదయము ' ఆనాటికి నూతన రచన. అప్పటివరకు కవులనుసరిస్తున్న విధానానికి భిన్నంగా స్వకపోలకల్పితంగా పింగళి సూరన ' రాఘవ పాండవీయ ' మనే ద్వ్యర్థి కావ్యాన్ని రచిస్తే రాజరాజ భూషణుడు 'హరిశ్చంద్ర నలోపాఖ్యానం ' మనే ద్వ్యర్థి కావ్యాన్ని రచించాడు. " రెండర్థంబుల

పద్య మొక్కటియు నిర్మింపగ శక్యంబు గాకుండుం దదతి కావ్య మెల్లననగా నోహోయనం జేయదే" అని పండిత లోకంచే సంస్తుతి పాత్ర మయ్యాయి ద్వ్యర్థి కావ్యాలు. రామరాజ భూషణుడు వసు చరిత్రలో నాలుగర్థాలు కూడ యిమిడ్చి కవితా రచన చేశాడు. ఆనాడు చతుర్విధ కవితా రీతులు కవిత్వంలో విస్తరిల్లాయి అవి గర్భ, బంధ, చిత్ర, ఆశుకవితలు. ఆశు కవితలో రామరాజ భూషణుడు మేటి. కవిత్వాన్ని గురించి నాటి కవుల అభిప్రాయాలు తెలిసికొనడం అవసరమేననుకుంటాను.

"రసములు చిప్పిలునట్లు కవిత్వము చెప్పవలెను. లేకున్నచో సుకవియైన వాడు కవిత్వము చెప్పకుండుటయే మేలు" అని మాదయ గారి మల్లన్న, "వ్యంగ్యార్థ ప్రతిపాదకమైన శబ్దములు, సామెతలు కూర్చి చెప్పిన కవిత్వము చెవులకు విందై యుండు" నని మొల్ల కవయిత్రి అభిప్రాయము. చదువగనే హృదయంగమమైన అర్థమును ప్రసాదించేదే అచ్చమైన కవిత్వమని యామె అభిప్రాయము.

తేనె సోక నోరు తీయన యగు రీతి
తోడ నర్థ మెల్ల దోచకుండ
గూఢ శబ్దములను గూర్చిన కావ్యమ్ము
మూగ చెవిటి వారి ముచ్చటగును.

ప్రాచీన కవిత్వాన్ని సంగ్రహంగా సమీక్షించితే నాటి సాహిత్య ప్రయోజనం సద్యః పరనిర్వృతి అని, నాటి ప్రమాణాలు తత్పూర్వ కావ్యాలు, అలంకార శాస్త్రాలని, నాటి సాహిత్యం గీర్వాణ సాహిత్య ప్రేరితమని, నాటి కవులు రాజుల ఇష్టానిష్టాలపై వ్యవహరించి, రచనలు చేసేవారిని, వారికి దీర్ఘ సమాసముల పైన మక్కువ వున్నట్లు అర్థమవుతుంది. అయినప్పటికి వారి రచనల లోని ధారాశుద్ధి, వర్ణనా చాతుర్యము, పాత్రపోషణ నైపుణ్యము, కథా కథన చమత్కృతి నేటికి మనలను ఆకట్టుకుంటున్నాయి.

## నవయుగ సూర్యచంద్రులు

నవయుగ సూర్య చంద్రులుగా కందుకూరి వీరేశలింగం పంతులు గారిని, గురజాడ అప్పారావు గారిని పేర్కొన వచ్చును. గురజాడ అప్పారావు భాషలో నూతన ఛందస్సు ముత్యాల సరాలను తెలుగు కవితామతల్లి గళ సీమలో ముత్యాలు సరాలుగ కూర్చాయి. నాటి పురాణ కవులు, ప్రబంధ కవులు పురాణ పురుషులను, చక్రవర్తులను కథా నాయకులుగా స్వీకరిస్తే గురజాడ సామాన్య మానవునే తన కవితా వస్తువుగా స్వీకరించారు. పుత్తడి బొమ్మ పూర్ణమ్మ, కన్యక లవణరాజు కలలోని నాయికా సామాన్య కుటుంబాలలో నుంచి వచ్చిన వారే. ముత్యాల సరాలలో వీరు నిసర్గ రమణీయతను ప్రదర్శించారు.

నవ్య కవిత్వ ప్రాదుర్భావానికి ముఖ్యంగా కారణాలు ఎనిమిది. 1. ఆంగ్ల విద్యా వ్యాప్తి 2. సంఘ సంస్కరణ దృష్టి 3. వ్యావహారిక భాషోద్యమం 4. జాతీయోద్యమం 5. విజ్ఞాన శాస్త్ర వికాసం 6. పత్రికా ప్రాముఖ్యం 7. ప్రపంచ రాజకీయ ప్రభావం 8. సామ్యవాద దృక్పథం. తెలుగు కవిత్వంలో కాల్పనికోద్యమం నూతనోద్యమంగా వెలిసింది. ఇంగ్లీషు కాల్పనిక కవుల ప్రభావం, గురుదేవ్ ఠాగూర్ రచనల ప్రభావం, బౌద్ధ పురాణ గాథల ప్రభావం, మన కవులపై పడింది. ఈ కాల్పనికోద్యమ ఆత్మాశ్రయ కవితా పద్ధతిలో హృదయాంతరాళాలలోనికి చొచ్చుకు పోయేటట్లుగా ఈ కవులు సృష్టిని రసమయ జగత్తుగా తిలకించారు. భావాంబర వీధిలో విశృంఖల విహారులైన యీ కవులు హృదయావేశానికి, అనుభూతికి ప్రాధాన్య మిచ్చారు. ఈ కాలంలో ఎన్నో కొత్త గొంతులు వినిపించాయి. తెలుగు కవితలో కొత్త ఫణితులు తొంగి చూచాయి.

## భావ కవిత్వం

కాల్పనిక కవిత్వమన్నా భావ కవిత్వమన్నా తుల్యార్థాలుగానే స్వీకరింపబడుతున్నాయి. భావ కవిత్వమనే పేరు వినేటప్పటికి మనకు కృష్ణశాస్త్రి వెంటనే స్ఫురిస్తాడు. రాయప్రోలు సుబ్బారావు కూడా రమ్యాలోకంతో నవ్యత నారాధించాడు. భావ కవిత్వానికి ప్రధాన లక్షణం ఆత్మాశ్రయ కవిత్వం. దీనిని ఆరు శాఖలుగా విభజించవచ్చును. 1. దేశభక్తి కవిత్వం 2. ప్రణయ కవిత్వం 3. ప్రకృతి కవిత్వం 4. సంఘ సంస్కరణ కవిత్వం 5. భక్తి కవిత్వం 6. స్మృతి కవిత్వం. తెలుగు సాహిత్యోద్యానవనంలో, ఆత్మాశ్రయ కవితా పుష్పాల సౌగంధ్యాన్ని దశదిశల వెదజల్లిన కవులు నాయని సుబ్బారావు, నండూరి సుబ్బారావు, వేదుల సత్యనారాయణ శాస్త్రి, కృష్ణశాస్త్రి. భావ కవిత్వమంటే ఏమిటో నేను వివరించటం కంటె కృష్ణశాస్త్రి గారి మాటల్లో చెప్పటమే సముచితమనుకుంటాను. "అది వరకు అతి సామాన్యంగా కనబడిన ప్రతి వస్తువూ, ప్రతి సంఘటనా, కొత్త కొత్తగా గొప్ప గొప్పగా గోచరిస్తాయి." "దాక్కొని ఉండి, దారి పక్క నిరుక్కొని ఉండే గడ్డిపూవుకి నక్షత్రానికిచ్చే దివ్యగౌరవ మిస్తాడు. (కవి)జలతారు అంచు నీలి చీరని మెరపుతోటి మేఘమంటాడు," "ఈనాశరీర మందివతశించిన గాలి''లో హోమ ధూమ సౌరభాల కోసం నాసా పుటాలు బిగబడతాడు......ఆవేశానికి అడ్డు కట్ట ఉండదు. కంఠానికి గడియ పడదు......అప్పుడతనికి ధ్రువతార దూరంగా ఉన్నదని పించదు; అందే మావిని పండు లాగ అనిపిస్తుంది. తన మనస్సు దానికి తగిలించి నమ్మకంగా ప్రయాణం సాగిస్తానంటాడు. అతనిలో సహనమూ విజిగీషా కూడా ఉంటాయి. కొత్త అనుభవాలకి స్వాగతం ఇవ్వడానికీ కొత్త మార్గాలలో పడి పోవడానికీ, కొత్త ప్రయోగాలు చేయడానికీ, భయపడడు."

కృష్ణశాస్త్రి ఆత్మాశ్రయ కవితా మార్గంలో తనలోని దుఃఖాన్ని లోకానికి పంచిపెట్టాడు. అంతులేని దుఃఖము, కన్నీళ్ళ బాధ కృష్ణశాస్త్రి గారి కవితా వస్తువులుగా మనకు గోచరిస్తాయి. ప్రేయసి కోసం విరహ తప్తుడవుతాడు.

"ఈ వియోగ నిరాశా
క్షణ క్షణ ప్రతీక్ష చెదరి
ఎగసి ఎగసి పగిలిపోదునో," అనియు
''కాలాంతమునకు కాచియుందునా
ఆపలేని ఆశకు ప్రాణాంతమేని, వేచియుందునా,
చివురింపదె చైత్ర శుభోత్సవ వసంత
మీ దరిద్ర హేమంతమున''

అని ఆక్రోశిస్తాడు 'కృష్ణపక్షము'ని తన ఖండకావ్యానికి పేరు పెట్టడంలోనే యీ అర్థం యిమిడివుంది. ఆ రోజుల్లో యీ భావ కవిత్వం అనేకుల విమర్శకు గురికాక పోలేదు 'నేటికాలపు కవిత్వము' అనే గ్రంథంలో శ్రీ అక్కిరాజు ఉమాకాంతంగారు చాల తీవ్రంగా విమర్శించారు. అనంత పంతుల రామలింగస్వామిగారు కృష్ణపక్షానికి వ్యతిరేకంగా 'శుక్లపక్షమనే' గ్రంథాన్ని వ్రాశారు.

భావకవులు స్త్రీకి మహోన్నతస్థానమిచ్చారు వీరి దృష్టిలో స్త్రీ పవిత్ర ప్రేమమయ దేవత. శ్రీ శివశంకరశాస్త్రి, వేదుల సత్యనారాయణశాస్త్రి స్త్రీని అత్యున్నతంగా సంభావించారు. ఆ నాటి భావకవులలో బసవరాజు అప్పారావుగారిది ప్రత్యేకస్థానం. ప్రేమకు వీరిచ్చిన నిర్వచనము అపూర్వము. ఆ రోజులలోనే 'ఎంకిపాటలు' వ్రాసి నండూరి వారు తెలుగు కవితా క్షేత్రంలో ఒక విప్లవాన్ని తీసుకువచ్చారు

## తిరుగుబాటు

అభ్యుదయ కవిత్వం భావ కవిత్వానికి తిరుగుబాటుగా వెలువడిన ఉద్యమం. భావకవులు భావాంబర వీధిలోనుండి దిగి రాలేమని, అక్కడే వూహాల రమ్యహర్మ్యాలు నిర్మించుటకు విహరించే సమయంలో ప్రపంచమానవ జగత్తులో "స్వాతంత్ర్యం. సమభావం, సౌభ్రాతృం, సౌహార్దం పునాదులై ఇళ్లులేచి జనావళికి శుభం..." పలుగాలనే వాంఛతో అభ్యుదయ కవిత్వం అవతరించింది. శ్రీశ్రీ యీ ఉద్యమానికి బలమానికై అభ్యుదయ కవితా పథానికి దిశానిర్దేశకుడయ్యాడు. మార్క్సు భౌతిక వాదంతో ప్రభావితుడైన శ్రీశ్రీ "బ్రతుకు కాలి, పనికిమాలి పనిదేవత, రథచక్రపు టిరుసులలోబడి నలిగే "పేద ప్రజోద్ధరణకై కలాన్ని పట్టాడు." సింధూరం, రక్తచందనం, బంధూకం, సంధ్యారాగం, పులి చంపిన లేడినెత్తురూ, రాబందుల రెక్కల చప్పుడు...కుక్కపిల్ల, అగ్గిపుల్ల సబ్బుబిళ్ల యివన్నీ కవితా వస్తువులుగా స్వీకరించి నవ్యతను ప్రదర్శించాడు.

"కదిలేదీ, కదిలించేదీ
మారేదీ మార్పించేదీ
పాడేదీ పాడించేదీ
పెనునిద్దుర వదిలించేదీ.
మునుముందుకు సాగించేదీ.

పరిపూర్ణపు బ్రతుకిచ్చేదే నవ కవిత్వమని శ్రీశ్రీ కవితా రంగంలో విప్లవాన్ని తీసుకొచ్చాడు.

ఆరుద్ర, అనిసెట్టి, కుందుర్తి, రమణారెడ్డి వంటివారు ఆ రోజుల్లో ఆయన ఆలోచనారీతికీ, భావవ్యక్తీకరణకూ ముగ్ధులై ఆయనను అనుసరించారు. శ్రీశ్రీ చేతిలో గేయం నూతనత్వాన్ని సంతరించుకుంది. శ్మశానాల నిఘంటువులను దాటి, ఛందస్సుల సర్ప పరిష్వంగాన్నుంచి బయటపడమని శ్రీశ్రీ ప్రబోధించాడు ఈయన సాహిత్య క్షేత్రంలో ఎప్పటికప్పుడు కొత్త మొక్కల్ని నాటుతూనే వున్నారు.

కుందుర్తి సాంప్రదాయ పద్ధతుల్ని వదిలేసి స్వయంగా వచనగేయ పద్ధతిని రూపొందించాడు. "పాతకాలం పద్యమైతే వర్తమానం వచనగేయం" అని సగర్వంగా ముందుకు నడిచాడు. తాను వ్రాయడమే గాకుండా ఎందరో యువకుల చేత వచన కవిత వ్రాయించే ప్రయత్నం చేశాడు, నేడు యీ వచన కవితామార్గమే యువరచయితలను బాగా ప్రభావితం చేస్తోంది. వచన కవితలలో తిలక్ 'అమృతం కురిసిన రాత్రి' ఉత్తమంగా వుంది. ఆయన కవిత్వం ఎలా వుండాలో చక్కగా నిర్దేశించారు.

గులక రాళ్ల డబ్బా మోగించి గొప్ప సంగీతం
అని దబాయించకు
......మాటలు పేర్చడం కవిత కాదు ;
మంత్ర తంత్రం అసలే కాదు
......నిగ్రహా పగ్రహాలు లేని భావాశ్వాలని
బరి మీద వదలకు
......అగ్ని జల్లినా, అమృతం కురిసినా
దాని పరమావధి, అందం ఆనందం

ఈ మాటలు నేటి యువతరం గుర్తించి చక్కని కవితా వ్యవసాయం చేసి భావక్షేత్రాలలో ఉత్తమమైన పంటల్ని పండించి ప్రజా బాహుళ్యానికి అందించాలి.

ఇటీవలనే దిగంబరా కవితా వాదం, విప్లవ కవితా వాదం వెలువడ్డాయి. ఏ విషయం అయినా ఉన్నది ఉన్నట్లు దిగంబరంగా చెప్పటమే దిగంబర కవితా మార్గమని, ప్రజలలో అనేక రంగాలలో విప్లవాన్ని తీసుక రావటమే విప్లవ కవిత్వ లక్షణమని తెలుస్తోంది. ఏ కవిత్వమైనా ఏ లక్షణమైనా ఆనందం ప్రతిపాదన ప్రధాన లక్ష్యంగాను, ఉపదేశం అనుషంగిక లక్షణంగాను ఉండి ఔచిత్యం కోల్పోకుండా అభ్యుదయ పథంలో పురోగమిస్తే అది పది కాలాల పాటు నిలుస్తుందని కొందరంటున్నారు. రాజకీయ పరంకాని కవిత ఉమ్మిలా ఆరిపోతుందని, దానికి నిలకడ లేదని కొందరంటున్నారు. ఏది ఏమైనా ప్రజాభ్యుదయానికి రాచబాట వేసేదే నిజమైన కవిత. ప్రజాహృదయ క్షేత్రాలలో పదికాలాల పాటు నిలిచేదే ఉత్తమకవిత.

కరుణశ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రిగారి పద్యంతో యీ వ్యాసం ముగిస్తున్నాను.

"గురజాడ" ముత్యాల సరములు కైసేయ
"రాయప్రోలి" పసుపు పారాణి దిద్ద
"పింగళి" "కాటూరి" ముంగురుల్ సవరింప
"దేవుల పల్లి" శ్రీ తిలక ముంప
"విశ్వనాథ విమాత్న విధుల కిన్నెర మీట
"తుమ్మల" రాష్ట్రగాన మొనర్ప
"వేదుల" "నాయని" వింజామరలు వీయ
"బసవరాజు" "కొడాలి" పదము లొత్త
"జాషువా" "ఏటుకూరి" హెచ్చరిక లిడగ
హస్త మెత్తి "శ్రీశ్రీ" విజయోస్తు పలుక
నవ్య సాహిత్య సింహాసనమున నీకు
ఆంధ్ర కవితా కుమారి ! దీర్ఘాయురస్తు !



# మహాభారతము

తెప్పగంటుల లక్ష్మణశాస్త్రి

## 57

"రాజా! ఓంకారమునకు సంబంధించిన ఆత్మ తత్త్వము తెలిసికొన గోరుదువేని శుష్కతర్క వాదములను విడిచి శ్రుతి స్మృత్యాదులను ఆశ్రయింపుము. ఎందుకనగా, అట్టి సాధనములను ఆశ్రయించనిదే నీ బుద్ధి తత్వ నిశ్చయము చేయుటకు సమర్థము కాజాలదు. వేద జ్ఞానము ద్వారా మాత్రమే తత్త్వ జ్ఞానము సిద్ధించును. ఎందుకనగా, పరమాత్ముడు వేద స్వరూపుడు. వేదము లతని శరీరము. కనుక తత్వజ్ఞాన సిద్ధికి వేదములే సహజ సాధనములు. జీవాత్ముడు స్వయముగా సమర్థుడు కాడు. దానికి కారణము పరతత్త్వమనునది, తెలిసికొనదగిన దానికిగూడ తెలిసి కొనదగినదిగా నుండును. దానిని తెలుసుకొనుట అతికష్ట సాధ్యము సుమా! దేవతల ఆయువు, కర్మయొక్క శుభాశుభ ఫలములు వేదములలో చెప్పబడినవి. వేద ప్రభావము చేతనే ప్రతి యుగము నందలి ప్రాణుల ప్రభావము గూడ ఫలించును. చక్షురాదులగు నింద్రియములను వశపరచుకొని విషయోప భోగములను విడువ వలెను. తపస్సుచేత స్వర్గము, దానముచేత సుఖము, పుణ్య నదీజల స్నానముచేత పాప నివృత్తి, జ్ఞానముచేత మోక్షము లభించును." అదివిని ధర్మరాజు 'మహాత్మా' ప్రధానమగు ధర్మవిధియేది?'అని ప్రశ్నింపగా మార్కండేయు డిట్లు చెప్ప దొడగెను :—

### దాన ధర్మము

యుధిష్ఠిర మహారాజా! ప్రధానమగునది దానము. దాన రహస్యములను చెప్పెదను వినుము. అమావాస్యా గురు వారముల సంయోగము నాటి రావి చెట్టు నీడ 'గజచ్ఛాయ' యనబడును. ఆ చెట్టు నీడలో చెట్టు ఆకుల గాలి సోకు చుండగా నట్టి చోట జల సమీపమునందు పితృ శ్రాద్ధము చేయుట వలన గలుగు ఫలము ఒక లక్ష కల్పముల వరకు గూడ నష్టము కాదు. (కల్ప మనగా నాలుగు వేల యుగముల కాలము; అది బ్రహ్మకు ఒక దినమగును) తన కొరకు వండుకొనిన అన్నమును అతిథులకు దానము చేయువాడు స్వర్గలోకవాసము చేయును. ఆశ్రయము కొరకై తిరుగుచు అలసిన బాటసారికి చోటు నిచ్చినవాడు సంపూర్ణ యజ్ఞానుష్ఠాన ఫలము పొందగలవాడు. తూర్పుగా ప్రవహించుచు పడమరకు మరలి ప్రవహించు నట్టి నదికి 'ప్రతి గోత్రము' అని పేరు. అట్టి చోట చేయు అశ్వదానము అక్షయ ఫలము నిచ్చును. ఇట్టి ఫలమే ఆకలిగొన్న అతిథికి అన్నదానము చేసిన వానికి గూడ కలుగును.

దేశ క్షామమేర్పడినప్పుడు పెరుగుపైని మీగడను దానము చేసిన వానికిగూడ ఆ ఫలమే కలుగును. సర్వ కాలములయందు ఇవ్వబడిన దానము ద్విగుణఫలమును, ఋతువుల ఆరంభమునందు చేసిన దానము పదిరెట్ల ఫలమును—ఉత్తరాయణ దక్షిణాయన పుణ్య కాలములందును, తులా మేష సంక్రమణ కాలములందును, సూర్య-చంద్ర గ్రహణకాలము లందును చేసిన దానము అక్షయ ఫలమును ఇచ్చును. రాజా! పూర్వకాలమందు భూదానము చేయని వానికి ఈ జన్మమునందు భూమియు, వాహన దానము చేయని వానికి వాహనము లభించదు. మరి యే యే దానములు పూర్వజన్మములో చేయరో ఆయా వస్తువులీ జన్మములో లభించవు. బంగారము అగ్ని యొక్క ప్రథమ సంతానము. భూమి విష్ణుభగవానునిభార్య. గోవులు సూర్యుని కన్యకలు, కనుక ఆ మూడింటిని దానము చేసిన

వానికి ఆ మూడు లోకములు దానము చేసినంత ఫలము కలుగును. కనుక రాజా! దానము కన్న పుణ్య కర్మము మరియొకటిలేదు కనుక పెద్దలు దానమునే ప్రధాన ధర్మముగా చెప్పిరి.'' ఆమాట విని ధర్మరాజు! ''మహాత్మా! నీవు సర్వము తెలిసిన తపశ్శాలివి చిరంజీవివి కనుక పూర్వము 'కువలాశ్వుడు'అను ఇక్ష్వాకు వంశపు రాజు 'ధుంధు మారుడు' అను పేరుతో నెందుకు పిలువ బడెను? ఇట్టి పేరు మార్పు గూర్చిన కథను చెప్పుము' అని యడుగగా మార్కండేయుడిట్లు చెప్పదొడగెను:—

## కువలాశ్వ చరిత్రము

"రాజా! 'మరుధన్వ' దేశములలో 'ఉత్తంక మహాముని యాశ్రమ మేర్పరచుకొని యుండెను. అతడు విష్ణువును గూర్చి అనేక సంవత్సరముల తపస్సు చేసెను. విష్ణువు ప్రసన్నుడై దర్శనమిచ్చెను. ఉత్తంకుడు ప్రపంచ స్వరూపుడగు విష్ణుభగవానుని అనేక విధములుగా స్తుతించెను. ఉత్తంకుని యెడల ప్రీతుడై మహా విష్ణువు వరము వేడుమనెను. 'భగవన్ ! జగత్సృష్టి స్థితి లయ కర్తవగు నిన్ను చూచితిని. నా సమస్త కాంక్షలు తీరినట్లైనది. ఇంకను వేరువరము లక్కరలేదు' అని ఉత్తంకుడనెను. విష్ణు భగవానుడు నిర్బంధించగా నుత్తంకుడు "భగవన్! నాయందు అనుగ్రహమున్న యెడల నా బుద్ధి సర్వదా, సత్యములందును నింద్రియ నిగ్రహములందును నుండునట్లును నీ యెడల నిరంతరము నాకు భక్తి నిలిచి యుండునట్లును వరము ప్రసాదించు" మని వేడెను. మహామునీ! నా యనుగ్రహము చేత నీవు కోరినవన్నియు నీకు చేకూరుటయేకాక సర్వ దేవతల యొక్కయు మూడు లోకముల యొక్కయు మహాకార్యములను నెరవేర్చగల యోగ విద్యగూడ నీకు ప్రకాశించును. సర్వలోక నాశము చేయుటకొరకు ''ధుంధు'' అను రాక్షసుడు తపస్సు చేయును. వానిని సంహరించుటకు ఇక్ష్వాకువంశమునందు మహా పరాక్రమశాలియగు 'బృహదశ్వుడు' అను రాజు జన్మించును. అతని పుత్రుడు 'కువలాశ్వ'డనువాడు ప్రసిద్ధుడై యుండును ఆ కువలాశ్వుడు నా యోగబలముచేత సంపన్నుడై నీ యాజ్ఞచేత 'ధుంధు' రాక్షసుని చంపి 'ధుంధుమారు' డను పేరుతో ప్రసిద్ధుడగును" అని చెప్పి విష్ణుభగవానుడు అంతర్ధానము చెందెను. మార్కండేయు డిట్లుచెప్పెను:—

"ఇక్ష్వాకు వంశమునందు అతని పుత్రుడు 'శశాయుడు' అతని కొడుకు 'కకుత్స్థుడు అతనికి 'అనేనసుడు' వాని కొడుకు 'స్వంధు' అనువాడు, అతనికి 'విష్వగశ్వుడు' వానికి 'అద్రి' యనువాడు అతనికి 'యువనాశ్వుడు వానికి 'శ్రావ' యనువాడు అతనికి 'శ్రావస్తుడు' వరుసగా పుట్టిరి. శ్రావస్తుడు 'శ్రావస్తి' యను పట్టణమును నిర్మించెను. అతనికి 'బృహదశ్వ' మహారాజు జన్మించెను అతని కొడుకే 'కువలాశ్వుడు' సుమా! ఆ కువలాశ్వునకు ఇరువదియొక్క వేయి మంది పుత్రులు పుట్టిరి. వారందరు సర్వ విద్యలయందు నిపుణులై మహాబలశాలులై యుండిరి. కువలాశ్వుడు తన తండ్రి కంటెను గుణాధికుడుగా నుండెను. బృహదశ్వుడు కువలాశ్వుని రాజ్యమునందు నిలిపి తాను తపోవనమునకు పోయెను.

"వనమునకు పోవుచున్న బృహదశ్వుని ఉత్తంక ముని దారిలో కలసి నివారించి యిట్లనెను :— "ప్రజారక్షణముచేసి దుష్ట సంహారము చేయవలసినవాడవైటి తపోవనమునకు నీవు పోవుట తగదు. ప్రజలను ధర్మముతో పాలించుటకన్న మరియొక ధర్మములేదు. కనుక నీవు తపస్సును విరమించుకొని నగరమునకు తిరిగిపొమ్ము. నా యాశ్రమ సమీపమునందు పూర్తిగా ఇసుక మాత్రమే నిండిన సముద్రమున్నది దానిపేరు 'ఉజ్జానక' అని యందురు అది అనేక యోజనములు పొడవు-వెడల్పు గలది. ఆ మరు ప్రదేశమునందు మధుకైటభ రాక్షసుల పుత్రుడగు 'ధుంధు' అనువాడున్నాడు. వాడు అతి క్రూరుడై రౌద్రాకారముతో భూమిలోపలి భాగమునందు నివసించియుండును. అతనిని సంహరించిన తరువాతనే నీవు వనమునకు పోవలెను. ఆ రాక్షసుడచట సర్వ లోకములను, సర్వ దేవతలను నశింపజేయు సంకల్పముతో ఘోర తపస్సు చేయుచున్నాడు అతడెవరికిని వధ్యుడుకాడు. అట్టి వరమును వాడు బ్రహ్మదేవుని నుండి పొందియున్నాడు అతనిని చంపినచో నీకు శ్రేయస్సు, సర్వలోకములకు క్షేమము కలుగును. ఇసుకలోపల నిద్రించుచున్న ఆ ధుంధు రాక్షసునకు సంవత్సరమున కొకసారి నిశ్వాసము వచ్చును ఆ వాయువుచేత భూమి కంపించును. జ్వాలలతోను, ధూమముతోను, దుమ్ము పైకిలేచి సూర్యమండలమునే యొక వారము దినములు కప్పి వేయును. ఆ కారణముచేత నేను నా యాశ్రమములో నుండజాలను. లోకహితమును గోరి రాజా! ఆ క్రూర రాక్షసుని చంపుము. ఆ పనికి నీవు సమర్థుడవు. ఆ రాక్షస సంహారమును చేయువాని తేజస్సుతో విష్ణువుయొక్క తేజస్సుగూడ సంక్రమించును అని విష్ణువే నాకు చెప్పెను. కనుక నెవరికిని సాధ్యుడుకాని ధుంధు రాక్షసుని నీవు విష్ణుతేజోబలసంపన్నుడవై సంహరించుటకు సమర్థుడవగుదువు". ఆ మాటలు విని బృహదశ్వు డిట్లనెను:—

"మహాత్మా! ఆపని నా కొడుకు కువలాశ్వుడు చేయగలడు అతడు నాతో సమానుడు. వేలాది పుత్రుల సహాయముతో నతడీ కార్యమును సాధించును. నన్ను వనమునకు విడువుము. నేను శస్త్రాస్త్రములన్నియు విసర్జించితిని. తిరిగి పట్టుకొనను" ఆ మాటకు ఉత్తంకుడంగీకరించెను బృహదశ్వుడు కువలాశ్వునకు ఆజ్ఞయిచ్చి వనమునకు పోయెను" ఆ సంగతి విని ధర్మరాజు "ఇంతటి మహా వీర్యబల సంపన్నుడగు నా ధుంధు రాక్షసు డెవని పుత్రుడు?" అని ప్రశ్నింపగా మార్కండేయుడిట్లు చెప్పెను:—

## మధుకైటభ వధ

"పూర్వమొకప్పుడు మహాప్రళయము సంభవించి త్రిలోకములు జలమయము కాగా మహావిష్ణు వొక్కడు మాత్రము జలమునందు ఆదిశేషునిపై శయనించియుండెను. ఆయన నాభియందు కమలము వికసించి యుండెను. అందు బ్రహ్మదేవుడు ఉత్పన్ను

డయ్యెను. కొంతకాలమునకు 'మధు-కైటభ' రాక్షసులు విష్ణుభగవానుని చూచుటకు వచ్చిరి. సహస్ర సూర్యుల తేజస్సుతో విరాజిల్లుచున్న భగవంతుని చూచి యా రాక్షసులు మిక్కిలి విస్మయము చెందిరి. కమలములో శయనించియున్న చతుర్ముఖ బ్రహ్మను వారు భయపెట్టి యా నాభి కమలమును కంపింపజేయగా బ్రహ్మ మేల్కొనెను. ఆ పద్మ కంపనముచేత భగవంతుడగు విష్ణువుగూడ మేల్కొనెను ఆ రాక్షసులనుచూచి వారికి స్వాగతము చెప్పి వారిని వరము కోరుమనెను. మహా గర్విష్ఠులైన మధు కైటభులు దర్పముతోను నీవే మమ్ము 'వరముకోరుము' అని విష్ణువుతోననిరి. 'మీ రిరువురు నాచేత చావవలెను' అని విష్ణువు వారిని వరముకోరెను. 'మేమసత్యమాడము, ధర్మపరులము. కనుక నీవు కోరిన వరము నిచ్చితిమి.' కాని, కప్పులేని ఆకాశ ప్రదేశములో నీవు మమ్ముచంపవలెను మేము నీకు పుత్రులముగా పుట్టవలెను అని వారు విష్ణువుకు వరమిచ్చి వారుకూడ వరము కోరిరి. విష్ణువు 'అట్లేయగుగాక యని చెప్పి ప్రపంచములో ఎక్కడగూడ కప్పులేని ఆకాశమును కానక చివరకు తనతొడల మధ్యాకాశములో వారి రెండుతలలు ఇరికించి చక్రముతో రెండుతలలు నరికెను. అంతటితో త్రిలోకవాసులు సంతసించిరి.

## 'ధుంధు' వధ

మధుకైటభ రాక్షసులకు పుత్రుడై మహా బలపరాక్రమ సంపన్నుడగు 'ధుంధు' రాక్షసుడు ఉండెను. అతడు ఒంటికాలి మీదనిలిచి ఘోర తపస్సు చేసెను. బ్రహ్మదేవుడు ప్రత్యక్షమై వరము కోరుమనెను. దేవ, దానవ, యక్ష, సర్ప, గంధర్వ రాక్షసులలో నెవరికి కూడ నేను వధ్యుడను కాకుండ నుండవలెను అను వరము నతడు కోరెను. బ్రహ్మదేవుడా వరమునిచ్చెను వరముగొని ధుంధువు, తనతండ్రులను చంపిన విష్ణువుమీదికి దాడి సలిపెను. దేవతలను గంధర్వులను జయించి యతడు విష్ణువును గూడ మిక్కిలి బాధించెను. ఇసుకమయమగు 'ఉజ్జాలక' సముద్రములోపల దాగియుండెను.

అప్పుడు కువలాశ్వుడు తన యిరువదియొక్క వేవురు పుత్రులతోపాటు ఉత్తంకమునిని ముందిడుకొని ఉజ్జాలక సముద్రముకడకు బోయెను. ధుంధు సంహారార్థమై బోవుచున్న కువలాశ్వునిలో విష్ణుతేజస్సుగూడ సంక్రమించి యాతడు అజేయుడయ్యెను. అతనిని అంతరిక్షమునందు దేవతలు సంతసించి చూచుచుండిరి. ప్రపంచమునందు శుభశకునములు వచ్చెను. కువలాశ్వుని పుత్రులు ఆ ఇసుక సముద్రమును-ఏడుదినములు త్రవ్వగా ధుంధువు కనపడెను అతడు సూర్యతేజస్సుతో విరాజమానుడై పశ్చిమదిక్కునంతయు నావరించి నిద్రించి యుండెను. కువలాశ్వ పుత్రులు వివిధాయుధములతో వానిని కొట్టగా వాడు క్రోధముతో లేచి వారి ఆయుధములన్నియు మ్రింగివైచెను. నోటినుండి యగ్నిని గ్రక్కెను. ఆయగ్నిలో పూర్వము సగర పుత్రులు దహింపబడినట్లు, కువలాశ్వ పుత్రులందరు దగ్ధులైరి. నిద్ర మేల్కొని కుంభకర్ణునివలె ఘోరముగానున్న ధుంధువును కువలాశ్వుడు సమీపించగా ధుంధు శరీరమునందు అనేకముగా జలము ప్రవహించెను. కువలాశ్వుడు యోగ మహిమ గలవాడుగనుక ఆ జలమును పానము జేసి మరల వెలికితీసి ఆ నీటిలో ధుంధువు నోటినుండి వెడలునగ్నిని ఆర్పివేసెను. బ్రహ్మాస్త్రమును ప్రయోగించి యా రాక్షసుని సంహరించెను అందుచేత నాటినుండి కువలాశ్వునకు 'ధుంధుమార' నామము వచ్చెను ధుంధు వధచేత సర్వదేవ గంధర్వాదులు మిక్కిలి సంతసించిరి. కువలాశ్వుని వరము కోరుమనగా నాకు ధర్మకార్యములందు ఆసక్తి గలిగి నిరంతరము స్వర్గవాసము గలుగవలెను. అని వరము కోరెను. ఆ వరమునిచ్చివారు అంతర్ధానము చెందిరి. ఆ కువలాశ్వునకు 'దృఢాశ్వ-కపిలాశ్వ-చంద్రాశ్వ' నామకులగు ముగ్గురు పుత్రులుమాత్రము బ్రతికియుండిరి, వారితో నిక్ష్వాకువంశ పరంపర సాగెను.' అని ధర్మరాజుకు ధుంధుమార చరిత్రమునుచెప్పి మార్కండేయముని, ఈ కథ విన్నవారికి సర్వపాపములు నశించి సమస్త వైభవములు చేకూరునని చెప్పెను.

## పతివ్రతల మహిమ-మాతా పితృసేవా మహిమ

తరువాత ధర్మరాజు మార్కండేయునిట్లు అడిగెను :— "మహాత్మా! స్త్రీల మహిమను గూర్చియు, గురుజన మహిమను గూర్చియు సెలవీయుడు లోకములో 'సూర్య-చంద్ర-వాయు-భూమి అగ్ని-తల్లి-తండ్రి-గురువులు-వేదమంత్ర ప్రతిష్ఠా పితములగు దేవతా మూర్తులు ప్రత్యక్ష దేవతలనిగదా అనుభవపూర్వకముగా పెద్దలు చెప్పిరి. ఈ లాగే పతివ్రతాస్త్రీలుగూడ దేవతాతుల్యురాండ్రు. వీరందరు మాన్యులే పతివ్రతలు పతులకు చేయు సేవ అనన్యసాధ్యము-అతిదుష్కరము, కనుక పతివ్రతల మహాత్మ్యమును గూర్చి వివరింపుడు. వారు ఇంద్రియ నిగ్రహము చేసి, మనస్సును నిరోధించి పతిని దేవతుల్యునిగా తలచుచుందురు. అట్టి స్త్రీలు ధన్యులు. వారి త్యాగము సేవాభావము అతి కఠినమనుట స్పష్టము. మహామునీ ! పుత్రులు తలిదండ్రులకు చేయు సేవలును కఠినములేయగును సత్ప్రవర్తకురాండ్రయిన స్త్రీలు చేయు మహా కార్యములు అత్యంత దుష్కరములు. మాతా పితృసేవకూడ అట్టిదే. సత్యవాదినులు పతివ్రతలునగుస్త్రీలు లోకములో అతి దుర్లభులు.

స్త్రీలు గర్భమునందు శిశువును పదిమాసములు ధరించి కనుటకన్న అద్భుతకార్యము మరియేమున్నది ? వారు ప్రాణము లొడ్డి, అత్యంత గర్భవేదనను భరించి అనేక కష్టములను సహించి సంతానోత్పత్తి చేయుచున్నారు. ఆ సంతతిని మిక్కిలి ప్రేమతో పాలించుచున్నారు. క్రూరులగు పతులను సేవించుచు పతులచేత తిరస్కృతలగుచుగూడ తమ పాతివ్రత్య ధర్మమును పాలించుకొనుచుండు పతివ్రతలు అత్యంత కఠినచర్య నాచరించుచున్నారని తలచెదను. మహాత్మా ! నీవు క్షత్రియ ధర్మములను, వారి వృత్తులను గూర్చియు వివరింపుము " ఆ మాటలకు మార్కండేయుడిట్లనెను.—

" రాజా ! తల్లిదండ్రులు తపస్సును, దేవతాపూజలను, శాంతిని, ఇతరోపాయముల నాచరించి పుత్రులను కనెదరు. ఇన్ని క్లేశములతో కనిన సంతానము పెరిగి యెట్టివారగుదురో యనికూడ

సర్వదా చింతించుచుందురు. తమ పుత్రులు కీర్తి, ఐశ్వర్యము, ధర్మము, సత్సంతానము కలిగి సుఖులు కావలెనని పితరులు కోరుచుందురు. వారి యాశలను పూరించి, ధర్మాత్ములై సర్వదా సంచరించునట్టి పుత్రులవలన తలిదండ్రులు సంతసింతురు. అట్టి సత్పుత్రులకు ఈ లోకములో, పరలోకమునను కీర్తి, ధర్మములు ప్రతిష్ఠితములగును. పతిసేవచేయు స్త్రీలు, యజ్ఞములు, ఉపవాసములు, శ్రాద్ధాది కర్మలు చేయనక్కర లేకుండగనే స్వర్గముపైన విజయమును సాధించగలరు. రాజా ! పతివ్రతల నియతధర్మములనుగూర్చి వివరించెదను వినుము:—

## కౌశికుని కథ

"వేదాధ్యయనముచేసి తపశ్శాలియై, ధర్మాత్ముడగు కౌశికుడు అను నొక బ్రాహ్మణుడుండెను. అతడొకనాడొక చెట్టు క్రింద కూర్చొని వేదము పఠించుచుండెను. ఆ చెట్టుమీదనున్న యొక ఆడపక్షి అతనిపైన మలవిసర్జనము చేసెను. అతడు పైనచూచి కూర్చొని మనస్సులో నిందించుచు క్రోధదృష్టితో దానిని చూడగనే యా పక్షి క్రిందకు రాలిపడి మరణించెను. దయాళువగు నా బ్రాహ్మణుడు తాను చేసిన చెడ్డపనికిగాను మిక్కిలి పశ్చాత్తాప పడెను"

"తరువాత నతడు ఆ సమీప గ్రామములోని పవిత్ర గృహములకు భిక్షార్థమై పోయెను. ఒక యింటిలో నొక స్త్రీ 'కొంచెమాగుము' అని యతనికి చెప్పి పాత్రలు శుద్ధి చేయుసరికి ఆమె భర్త ఆకలిగొని వచ్చియుండుటనుజూచి వెంటనే యతనికి పాద్యాదులిచ్చి అన్నము వడ్డించెను. భిక్షకు వచ్చిన బ్రాహ్మణుని విడిచి పతి శుశ్రూష చేయుచుండెను. ఆమె మహాపతివ్రతయై పతి తినగా మిగిలిన యెంగిలిని అమృతముగా భావించి తినుచుండెను. పతియే దైవమని తలచి మనోవాక్కాయ కర్మలచేత ఇతరములను మరచి పతి చిత్తానుసరణము చేయుచు పతిహితమునే కాంక్షించుచు జితేంద్రియురాలై అత్తమామలకు ఇతర కుటుంబ వ్యక్తులకు ప్రేమతో సేవ చేయుచుండెను.

ఇట్లు పతి శుశ్రూషా నిమగ్నురాలై భిక్షమునకు వచ్చిన కౌశికుని మాటయే మరచి, తన పనులు ముగించిన పిదప నతనిని చూచి సిగ్గుచెంది వెంటనే భిక్షము చేతదీసికొని బయటకు పోయెను. అప్పుడా కౌశికుడు, 'అమ్మా నన్ను నిలువుమని చెప్పి యింత తడవేల చేసితివి?' అని గద్దించి మిక్కిలి కోపము చెందెను. అగ్నివలె మండుచున్న ఆ బ్రాహ్మణునితో నా సాధ్వి శాంతముగా నిట్లనెను:—'మహాత్మా! నన్ను క్షమించుము. నాకు భర్తయే దైవము. అందులోను ఇప్పుడు నా పతి మిక్కిలి ఆకలిగొని వచ్చియుండెను. కనుక అన్నిటికన్న పతి శుశ్రూషయే ముఖ్యమని తలచి నీకు భిక్ష యిడుటలో జాగు చేసితిని' ఆమాట విని బ్రాహ్మణుడు "నీకు బ్రాహ్మణులకన్న పతియే గొప్పయా ? గృహస్థ ధర్మము నాశ్రయించి యుండియు నీవు బ్రాహ్మణులను అవమానపరచుచుంటివా ? ఇంద్రుడునంతవాడు గూడ బ్రాహ్మణులకు నమస్కరించుచుండగా మానవులెంత ? గర్విష్ఠురాలా ! బ్రాహ్మణుల మహిమ నెరుగవా ? పెద్దలు చెప్పగానైనా వినలేదా ? ఓసీ ! బ్రాహ్మణులు అగ్ని సమానులు, వారు తలచినచో నీభూమినంతయు దహించివేయుదురు" అని యనెను. ఆమాటకు సాధ్వి యిట్లనెను:—

"బ్రాహ్మణా ! కోపపడకుము. నీ క్రోధదృష్టితో దహించి పోవుటకు నేను కొంగననుకొన్నావా ? నీవు కుపితుడవై నన్నేమి చేయగలవు ? నేను బ్రాహ్మణులను అవమానపరచుదాననుకాను. బ్రాహ్మణులు దేవతుల్యులని నేనెరుగుదును. నేను నీకు చేసిన యపరాధమునకు నన్ను క్షమించుము. జ్ఞానులగు బ్రాహ్మణుల తేజస్సును, మహత్త్వమును నెరుగుదును. బ్రాహ్మణుల కోప ప్రభావముచేతనే యీ సముద్ర జలము ఉప్పుగానై పానయోగ్యము కాకున్నది. మహోజ్జ్వలమగు తపస్సుచేసిన మునీశ్వరులు విడిచిన క్రోధాగ్ని నేటికిని ఈ దండకారణ్యమునందు ఆరిపోకుండనున్నది. బ్రాహ్మణులను అవమానపరచిన వాతాపి దానవుడు అగస్త్య మహాముని కడుపులో జీర్ణించిపోయెను. వారి కోపప్రసాదములు రెండు గూడ మిక్కిలి గొప్పవి. కనుక నిన్ను వేడుకొనెదను. నా యీ యపరాధమును మన్నించి నన్నుక్షమించుము."

"పతి సేవ వలన గలుగు ధర్మమే నాకు అన్నిటికన్న గొప్పది. అందరు దేవతలకన్న నాకు భర్తయే గొప్పదేవుడు. నేను సర్వదా పతిశుశ్రూష చేయుచుందును. నా పతి సేవాఫలమును ఇప్పుడే చూపించెదను చూడుము. నీ కోపాగ్నిచేత కొంగ దగ్ధమయ్యెను. క్రోధమే మనుష్యుల శరీరములో దాగియుండు శత్రువు సుమా ? క్రోధ-మోహములను విడిచినవాడే బ్రాహ్మణుడని దేవతలందురు. ఎవడు సత్యము పలుకునో, గురువును సంతోషపరచునో, ఇతరులచేత హింసించబడియు వారికి హింస తలపెట్టడో జితేంద్రియుడో, ధర్మపరుడో, వేదాధ్యయనమునందు సర్వదాఆసక్తి గలవాడో, పరిశుద్ధమగు మనసుగలవాడో, కామ క్రోధములను అణచినవాడో, సర్వులను తనతో సమానముగా చూచుకొనువాడో సర్వధర్మ తత్పరుడో, వేదాధ్యయనము, యజ్ఞము, చేయుచు చేయించుచుండునో, యథాశక్తి దానముచేయునో, బ్రహ్మచారియో ఉదారుడో, అతడే బ్రాహ్మణుడని దేవతలందురు."

"బ్రాహ్మణునకు ఏది హితమో దానినే యతని యెదుట చెప్పవలెను. సత్యవాదులెప్పుడు గూడ 'ప్రియము' అనుభావముతో అసత్యమును చెప్పరు. వేద ప్రమాణము గల ధర్మము సత్యమునందే ప్రతిష్ఠితమై యున్నది. బ్రాహ్మణా ! నీవుగూడ ధర్మజ్ఞుడవే, వేదాధ్యయన సంపన్నుడవేయైనను నీకు యథార్థమగు ధర్మస్వరూపము తెలియదని నా విశ్వాసము. నీకు ధర్మము తెలియకున్నచో మిథిలా నగరమునకుపోయి 'ధర్మవ్యాధుడు' అను వానిని అడుగుము. అతడు, మాతా పితృ సేవాపరుడు, సత్యవాది, జితేంద్రియుడు. అతడు నీకు ధర్మ రహస్యమును చెప్పగలడు. నేను అధికముగా మాట్లాడినప్పటికిని కోపపడక నన్ను క్షమించుము. స్త్రీలు వధకు అర్హులు కారు. ధర్మజ్ఞుడవగు నీకిది తెలియని ధర్మముకాదు" ఆ మాటలు విని బ్రాహ్మణుడిట్లనెను :—

(సశేషము)

# కొండాపురం

— పుల్లాభొట్ల వెంకటేశ్వర్లు

మహోజ్వలమైన ప్రాచీనాంధ్ర చారిత్రిక సంపదకు ఉదాత్త కళావైభవానికి సజీవశిల్ప నిర్మాణ నైపుణ్య కుశలత్వానికి మన తెలంగాణం కాణాచి. ఆర్షశాస్త్ర వేత్తల నిరంతర కృషి ఫలితంగా ఈ చారిత్రిక ఖనినుండి ఎన్నో విధాలైన అనర్ఘరత్నాలు కోకొల్లలుగా బయల్పడ్డాయి. అవి ప్రాచీన చరిత్రకు వెలుగు నిచ్చాయి. అట్టివానిలో మొట్టమొదటగా పేర్కొనదగింది, కొండాపురం బౌద్ధారామానికి సంబంధించిన విషయం హీనయాన బౌద్ధ నాగరికతకు, సంస్కృతికి. శాతవాహన రాజుల నాటి సామాన్య ప్రజల సాంఘిక, ఆర్థిక, రాజకీయ జీవితవిధానానికి, ఆ ప్రభువుల ప్రజారంజక పరిపాలనకు, వారి నిరంతర ధార్మిక, ఔదార్య కార్య కలాపాలకు సంబంధించిన విషయాలను మనం తెలుసుకోవటానికి ఈ గ్రామానికి సమీపాన బయల్పడ్డ శిథిలనగరావశేషాలు, తదితర వస్తువులు మిక్కిలి ఉపకరిస్తున్నాయి. శతాబ్దాలనుంచి తెరమరుగున పడిపోయిన ఆంధ్రచారిత్రిక పుటలలోని నూతనాంశాలెన్నో వీని వలన మనం తెలిసికోగలుగుతున్నాం.

ఈ కొండాపురం హైదరాబాదు నగరానికి 43 మైళ్ల దూరంలో ఉంది. ఇది మెదకుజిల్లాలోని కలబగూరు తాలూకాలో హైదరాబాదు-బీదరు రాచబాటమీద రోడ్డుకు సమీపంలో కొద్ది దూరానవుంది. ఈ నాడు అది ఒక చిన్న గ్రామం. ఈ గ్రామానికి దక్షిణపు దిక్కున అరమైలు దూరంలో 84 ఎకరాల భూమిలో ఈ మట్టి దిబ్బలున్నాయి. ఇవి అచ్చటవున్న భూమికంటే 30 అడుగుల ఎత్తున ఉన్నాయి. ఈ ప్రదేశం సముద్రమట్టం కన్నా 1,800 అడుగుల ఎతునఉంది. ఈ మట్టిదిబ్బలకు తూర్పుదిక్కున, పశ్చిమోత్తరములలోను రెండు చిన్నవాగులు ప్రవహిస్తున్నాయి. తూర్పుదిక్కున వున్నది జీవనది. రెండవది వర్షాకాలంలో మాత్రం నీటితో నిండివుంటుంది. వర్షాకాలంలో యీ ప్రాంతమంతా ఒక ద్వీపంగా భాసిస్తూ కన్నులపండువుగా వుండి ఆనందాన్ని కలిగిస్తూ వుంటుంది. ఈ ప్రాంతంలో ఎటుచూచినా ప్రచండమైన నల్లని బండరాళ్లు కనిపిస్తూవుంటాయి. దీనికి ఈశాన్యదిశన ఆగ్నేయ భాగాన పెద్దపెద్ద గుట్టల వరుసలున్నాయి. జల సమృద్ధం, ప్రకృతి రామణీయకం అయిన ఈ ప్రదేశంలో పూర్వం ఈ మహాపట్టణ నిర్మాణం జరిగింది.

కాకతీయ సామ్రాట్టులు వారి పరిపాలనా కాలంలో ఈ కొండాపురం గ్రామానికి మట్టిదిబ్బలకు మధ్యగల ఏటికి ఒక పెద్ద కట్టను నిర్మించి తటాకాన్ని ఏర్పరచారు. దిబ్బకు దక్షిణపుగ గట్టున ఈ తటాకం పాఖాల. రామప్ప లక్నవరం తటాకాల వంటిపెద్ద తటాకమై ఖారీఎత్తున పల్లపు వ్యవసాయం జరిగేట్లు ఏర్పాటు చేశారు. వారి కృషిఫలించి ఈ ప్రాంతం అంతా సస్యశ్యామలమై పరిఢిల్లింది.

ఈ గ్రామానికి జెందిన సయ్యద్‌హుస్సేను అనేవ్యక్తి ఆర్ష శాఖలో భృత్యుడుగా వుండేవాడు అతడు తమ గ్రామంలోవున్న ఈ దిబ్బలను గురించి, వర్షం పడేప్పుడు ఆ దిబ్బలనుండి వెలువడే పెద్దపెద్ద ఇటుకలను గురించి, పూర్వపు హైదరాబాదు రాష్ట్రంలో ఆర్షశాఖలో అసిస్టెంట్ డైరెక్టరుగా పనిచేస్తున్న ఖాజామహమ్మద్ అహమ్మద్ గారితో మాటల సందర్భంలో చెప్పాడు. శ్రీ ఖాజా మహమ్మద్‌గారు 1941వ సంవత్సరంలో అచ్చటికివెళ్ళి త్రవ్వకపు పనులు మొదలు పెట్టారు. ఆయన అపూర్వకృషి ఫలించి మన ఆంధ్రచరిత్రకు సంబంధించిన విషయాలు ఎన్నో బయల్పడ్డాయి.

ఆయన అచ్చట కొనసాగించిన ఖనన పరిశోధనలలో గృహాల శిథిలాలు కనుపించాయి. ఆ ఇండ్లగోడలు, ఇటుకలతోను, మట్టితోను బలిష్ఠంగా వుండేట్లు నిర్మించినట్లు తేలింది. ఇండ్ల ముందరభాగంలో రాతితో నిర్మించిన కాలువలు కనుపించాయి. దాన్నిబట్టి అధికారులు ఆనాడు గృహాలలోని మురికినీటిని ఈ కాలువ లలోనికి వచ్చేట్లు ఏర్పాట్లుచేసి, ప్రజల ఆరోగ్యానికి వీధుల పారి శుద్ధ్యానికి అధిక ప్రాధాన్యత నిచ్చినట్లు విశదమైంది.

ఇచ్చట కమ్మరి కొలుములు, కుమ్మరివాడు చేసిన పెద్దపెద్ద మట్టిగాబులు, భాండాలు పెక్కురకాలైన మట్టి, లోహము, వెండి, బంగారు ఆభరణాలు, విగ్రహాలు లభించాయి. అంతేగాక వివిధ లోహపు నాణేలు, మట్టినాణేలు పూసలపేర్లు దొరికేయి. ఇవిగాక బౌద్ధ స్తూపాలు చైత్యాలు విహారాలు ఒక దగోబా బయల్పడ్డాయి.

అచ్చట దొరికిన వస్తుసముదాయాన్ని పురాతత్వ శాస్త్రజ్ఞులు మిక్కిలి శ్రద్ధతో శోధించి ఆ స్థలంలో ఒకప్పుడు గొప్పపట్టణ ముండేదని, అచ్చట భిన్నవృత్తులవారు కలసిమెలసి జీవించి తమ తమ వృత్తులలోని ప్రావీణ్యాన్ని ప్రజ్ఞను ఘనతను ప్రదర్శించి మేలురకపు వస్తువులను సిద్ధంచేస్తూ సుఖంగా జీవిస్తూవుండేవారని తెలియజేశారు. అది ఒక గొప్ప పారిశ్రామిక కేంద్రమని, సైన్యం ఉండే స్థలమని, అచ్చటిప్రజలు హీనయాన బౌద్ధమత సంస్కృతు లను పాటించేవారని తెలియజేశారు.

## కుంభకారత్వము

కొండాపురంలో నివసించు కుమ్మరులు కుంభకార విద్యలో కడునేర్పరులు. వారు చిత్ర శిల్పకళలను, రెంటిని జోడించి అపురూపమైన చాకచక్యంతో వస్తువులను సిద్ధంచేశారు. వారు ఆ వృత్తిలో తమకున్న ప్రత్యేకతను ప్రదర్శించిన సిద్ధహస్తులు. వస్తువుల నిర్మాణంలో వారికున్న సునిశిత మేధాసంపత్తి, కళా

నై పుణ్యం ప్రజ్ఞా ప్రాభవాలు ప్రత్యేకంగా పేర్కొనదగివున్నాయి. ఈ కుంభకారులు మృణ్మయ పాత్రలనేగాక వివిధ రకాలైనమట్టి ఆభరణాలను, బొమ్మలను సిద్ధంచేస్తుండే వారు ఆ వస్తువుల ఉత్పత్తిలో వారు ఎట్టిమట్టిని వాడివున్నారు. పలువిధాలైన చిన్న పెద్ద భాండాలను వారు సిద్ధంచేశారు. ఇచ్చట జరిగిన ఖననాలలో ఒక అపురూపమైనపెద్దజాడి, ఒకపెద్ద భాండం లభించాయి ఆ రెండు మిక్కిలి సుందరంగాను సుకుమారంగాను వుండి, శిల్పాలంకార శోభితాలై తళతళ మెరుస్తున్నాయి. ఇచ్చట దొరికిన కుండలన్ని ఎర్రరంగుతో ఉన్నాయి. వాటిపైన ఆకుపచ్చ, ఎరుపు, పసుపు, రంగులతో చిత్రించిన, విచిత్రాలైన లతాగుల్మాలను శిల్పకళ ఉట్టిపడేట్లు శోభావంతంగా చిత్రించారు.

ఇచ్చట దొరికిన మట్టిపాత్రలను రెండు విధాలుగా విభజించవచ్చును. గృహాలలో నిత్యకృత్యం ఉపయోగించు పాత్రలు, ఇవి నిరాడంబరంగాను, శిల్పాలంకార విరహితంగాను వుండాయి. రెండవ రకానికిచెందిన పాత్రలు శిల్పాలంకార సమన్వితాలు. వీనిని దేవపూజా సమయాలల్లో తదితర శుభకార్యాలల్లో వినియోగించేవారు. వీటిపైన వివిధ రకాలైన చిత్రాలు, లతాగుల్మాలు వివిధ రంగులలో చిత్రిస్తూవుండేవారు. అంతేగాక బౌద్ధమత సంబంధమైన సాంకేతిక చిహ్నాలు గల భాండాలు పెక్కులు కనుపించాయి. ఒకభాండంపైన త్రిరత్నాలు లిఖింపబడి వున్నాయి. త్రిరత్నాలనగా బుద్ధం శరణం గచ్ఛామి—ధర్మంశరణం గచ్ఛామి, సంఘం శరణం గచ్ఛామి అనునవి. ఈ పవిత్ర మంత్రాలతోవున్న భాండాలను ఆనాటి ప్రజలు బౌద్ధమత సంబంధాలైన పూజా పురస్కారాలలోను, అతిధి అభ్యాగతులు వచ్చినప్పుడు వారికి స్వాగత సత్కారాలు సలపడానికి ఉపయోగించేవారు.

ఈ భాండకారులు మృణ్మయ పాత్రలనే గాక తెల్లగనున్న మెత్తని మట్టితో బోలు విగ్రహాలను సిద్ధంచేసి, త్రివర్ణాలతో వానిని చిత్రించి, ఆవంలో కాల్చి, ఆ బొమ్మలు కళలు వెదజల్లేట్లు సిద్ధం చేసేవారు. ఇచ్చట లభించిన విగ్రహాలలో కొన్ని బోధిసత్వుడు, కుబేరుడు, యక్షిణి మొదలైనవారికి సంబంధించిన దేవతా విగ్రహాలని శాస్త్రజ్ఞులు నిరూపించారు. ఈ బొమ్మలు అమరావతీ శిల్ప సాంప్రదాయాన్ని అన్నివిధాల పోలివుండి, మిక్కిలి పనితనము తోను, ఉజ్వలంగాను వున్నాయి.

ఆవు, ఎద్దు, గుఱ్ఱం. సింహం, లేడి మొదలైన జంతువుల విగ్రహాలు గూడా దొరికాయి. ఇవన్నీ సహజ సుందరంగా చిత్రితాలై సజీవకళతో దర్శనమిస్తున్నాయి.

ఇచ్చట లభించిన విగ్రహాలు ప్రాచీన దాక్షిణాత్య ప్రజా జీవన విధానానికి, ప్రతిబింబాలై ఉన్నాయని, వాని రూపురేఖలను బట్టి, వారు ఉపయోగించిన వస్తువులనుబట్టి, జుట్టు, కట్టు, బొట్టు, మొదలైన వేషాలనుబట్టి, శాస్త్రజ్ఞులు తలచిరి ఆ విగ్రహాల తలలకు వివిధ రకాలైన తలపాగలు, వివిధ భంగిమలలో చుట్టబడి ఉన్నాయి. వానిచెవులకు పోగులు, మెడలో హారాలు, చేతులకు మురుగులు మొదలైన వివిధ అలంకరణాలతో అవి శోభావంతంగా ఉన్నాయి.

ఆ విగ్రహాలకున్న పట్టి ముక్కులు, వికారపు రూపాలు, లంబకేశాలు, జారుముడులు ఎత్తుపెదవులు, మనకు నవ్వును కలిగింపజేస్తాయి. వీటిని చూస్తూవుంటే అవిఎంతో చమత్కారంగా వుండి హాస్యాన్ని చిలికిస్తూంటాయి. అంతేగాక ఇచ్చట లభించిన విగ్రహాలలో కొన్ని ఆత్మానందాన్ని మరికొన్ని ఆత్మశాంతిని, వేరొకకొన్ని జుగుప్సను కలిగిస్తూ వివిధ భంగిమలలో చిత్రింపబడి వున్నాయి. ఇవన్నీ ఆనాటి ప్రజల భిన్నభిన్న జీవితాలకు ప్రతీకలై ఒప్పారు తున్నాయి. వీటినిబట్టి మనకు కొంతవరకు దక్షిణా పథాన జీవించిన ద్రవిడజాతుల నాగరికత అవగతం అవుతుంది.

ఇచ్చట నివసించిన కుంభకారుడు బీద ప్రజల ఆత్మానందానికి పెక్కు రకాలైన మట్టి ఆభరణాలను బంగారు నగలతో పోటీపడేట్లు తయారుచేసెను మట్టిజపమాలలు, మట్టిపూసలు, మట్టిమురుగులు, మట్టిగాజులు, మట్టి చంద్రహారాలు, మట్టితాయెత్తులు, మట్టికాసుల పేర్లను వివిధాకారాలలో చూడముచ్చటగా వుండేట్లు సిద్ధం చేశాడు. ఇవి అన్ని విధాల బంగారు ఆభరణాలకు సమఉజ్జీగా ఉన్నాయి. ఇచ్చట లభించిన మట్టికాసుల పేర్లు క్రీస్తుశకం ప్రథమ శతాబ్దంలో రోమను సామ్రాజ్యంలో చలామణి అయిన రోమను నాణేలను పోలివున్నాయి. రోమన్ మతాచార్యుడైన అగస్టస్ కాలంలో చలామణి అయిన బంగారపు రోమను నాణెం ఒకటి ఇచ్చట లభించింది. దీనినిబట్టి ఆ కాలంలో మనవారు రోమను సామ్రాజ్యంతో వర్తక వ్యాపారాలు గూడా చేసినటు విశదమౌతూన్నది.

## కమ్మరము

కమ్మరి వృత్తి ఇక్కడ దండిగా కొనసాగింది. ఇచ్చట నివసించిన కమ్మరులు కొడవళ్లు, గొడ్డళ్లు, బాకులు, ఉలులు, మేకులు, పటకారు, చిర్రలు, నాగళ్లు, మొదలైన ఇనప పనిముట్లను విరివిగా తయారుచేసి వుండిరి. ఈ విధమైన లోహసామాగ్రి ఇచ్చట గణనీయం అయిన సంఖ్యలో లభించింది. ఇవన్నీ వ్యవసాయానికి సంబంధించిన పనిముట్లు గనుక ఇచ్చట వ్యవసాయం ముమ్మరంగా కొనసాగిందని శాస్త్రజ్ఞులు తలచిరి.

సైనికులు యుద్ధ సమయాలలో హస్తాలలో ధరించే వివిధ రకాలైన బల్లేలు, గండ్రగొడ్డళ్లు, ఇక్కడ అధిక సంఖ్యలో లభ్యం కావటం వల్ల ఇది ఒక సైనిక కేంద్రమై గూడా వుంటుందని వారు నిర్ధారణచేసి వున్నారు

పెద్ద పెద్ద కమ్మరి అంగళ్లు, కొలిమిలు, తిత్తులు పరుసలు వరుసలుగా ఇక్కడ వున్నాయి. ఆ అంగళ్ళలో కాల్చిన ఇనుప పని ముట్లను చల్లార్చటానికై ప్రక్కన అమర్చిన పెద్ద పెద్ద నీటి బానలు ఉండటాన్ని బట్టి, అది ఒక పెద్ద కమ్మరిపు పరిశ్రమ కేంద్రమైగూడా వుండవచ్చునని వారు ఊహించారు.

## రత్న, స్వర్ణ, రజతకార వృత్తులు

కొండాపురంలో లభించిన రత్న, స్వర్ణ, రజత ఆభరణాలను బట్టి, ఆ పనితనంలోవున్న నేర్పునుబట్టి అది ఒక సంపన్న

మైన పట్టణమని మనం తలపోయటానికి వీలున్నది. [illegible] గలవాడని ఆ సొమ్ములు ఋజువు చేస్తున్నాయి. ఇచట లభించిన ఆభరణాలలో కొన్ని కోలగాను, కొన్ని త్రికోణాకారం గలవిగాను, మరికొన్ని అర్ధచంద్రాకృతి కలవిగాను ఉన్నాయి. రత్నాలను ఆభరణాలను పొదిగే నేర్పు ఇచ్చట నివసించిన కంసాలులకు గల ప్రత్యేక విద్య అని పెద్దలు తలచిరి.

## నాణాలు

కొండాపురం త్రవ్వకాలలో సుమారు నాలుగు వేల నాణాలు సాతవాహన రాజులకు సంబంధించినవి, వివిధ లోహములతో సిద్ధం చేసినవి లభించాయి. గనుక ఇచ్చట సాతవాహన రాజులు రాజ్యపాలన చేసివున్నారని, పురాతత్వ శాస్త్రజ్ఞులు ధృవపరచారు. ఈ నాణాలలో వెండివి 10, సీసలోహపువి 100 రాగివి 50 మిగిలినవి ఇతర లోహముల సమ్మేళనంతో కూడినవి. ప్రతినాణానికి మధ్యన ఒక చిల్లి వుంది. ఇట్టి చిల్లిగల నాణాలను మన భారతీయులు మూడు, నాలుగు వేల ఏండ్ల క్రిందటనే ఉపయోగించారు. కొన్ని నాణాలపైన సాంకేతిక చిహ్నాలున్నాయి. మరికొన్నిటి పైన బ్రాహ్మీలిపిగల వ్రాతలు గూడా కనపడుతున్నాయి.

ఇచ్చట లభించిన నాణాలలో నాలుగు సాతవాహన సామ్రాట్టులకు సంబంధించినవి వున్నాయి. అవి గౌతమీపుత్ర శాతకర్ణి, వాసిష్ఠపుత్ర పులమావి, శివశ్రీపులమావి, యజ్ఞశ్రీ శాతకర్ణి అను వారికి సంబంధించినవని పురాతత్వ శాస్త్రనిపుణులు నిర్ణయించారు.

సాతవాహన సామ్రాట్టులకు సంబంధించిన కొన్ని వెండి నాణాలు, ఇచ్చట లభించటాన్ని బట్టి ఆ చక్రవర్తుల కాలంలో ఆ నాణాలు చలామణి అయినట్లు తెలిసింది. అంతేగాక చతురాకారంతో వున్న సీసపు నాణాలు గూడ అచ్చట లభ్యమైనాయి. ఇట్టినాణాలు ఆంధ్ర దేశంలో మరెచ్చటా లభ్యం కాపోవటంవల్ల, ఆంధ్ర సాతవాహన చరిత్రలో ఆ సామ్రాట్టులకు సంబంధించిన నూతన అంశాలెన్నో దీనివల్ల తెలియ వచ్చాయని పెద్దలు భావించారు. ఇచ్చట కనుపించిన రాజముద్రికలపైన గల అక్షరాలను బట్టి అవి క్రీస్తు శకారంభపు కాలం నాటివని తెలిసింది.

## టంకశాల

పైన వివరించిన నాణాలన్నింటిని ఇచ్చటవున్న టంకశాలలోనే తయారు చేసినట్లు రూఢిగా తెలుస్తున్నది. దీనికి ప్రబల సాక్ష్యంగా ఇచ్చట నాణాలను ముద్రించు అచ్చుదిమ్మలు, వివిధాకారములలో ఉన్నవి పెక్కు లభించాయి. టంకశాల ఇచ్చట ఉన్నది గనుక ఇది రాజధాని నగరమో, లేక రాష్ట్రంలో ముఖ్యమైన మరియొక ముఖ్యనగరమో అయి వుండవచ్చునని పెద్దలు భావించారు.

## గృహ నిర్మాణ పద్ధతి

ఇక్కడి త్రవ్వకాలలో బయల్పడ్డ నివేశన గృహాలు, దేవమందిరాలు, విలక్షణమైన, సశాస్త్రీయమైన వాస్తుశాస్త్ర పద్ధతిలో [illegible] కట్టడాలూ ఇటుకలు, మట్టితో నిర్మింప బడ్డాయి. గోడల నిర్మాణంలో ఉపయోగించిన ఇటుకలు 23 అంగుళాల పొడవు 12 అంగుళాల వెడల్పు, 24 అంగుళాల మందము కలిగియున్నాయి. వలయాకారపు స్తూపాల నిర్మాణంలో వాడిన ఇటుకల మూలలు వంపుగా ఉండేట్లు తయారు చేసేవారు. దీనివల్ల వారు ఎట్టి శ్రమ లేకుండా ఆ వలయాకారపు కట్టడాలను నిర్మిస్తూండేవారు. ఇండ్లపైన పెంకులను కప్పుతూ వుండేవారు. నేలకు గచ్చుచేసి ఇండ్లను పరిశుభ్రంగా ఉంచేవారు.

## నేలమాళిగలు

ప్రతి గృహంలోను, ప్రతి అంగడిలోను ఒకటి, రెండు నేలమాళిగలు నిర్మించేవారు. వీనిలోనే వివిధరకాలైన నాణాలు, పవిత్రమైన దేవతావిగ్రహాలు, అమూల్యమైన ఆభరణాలు; నాణాలు సిద్ధంచేసే అచ్చుదిమ్మలు, పూసలపేర్లు, వివిధరకాలైన బొమ్మలు లభించాయి. ఈ అమూల్య వస్తుసముదాయాన్ని చోరులనుండి, అగ్నిబాధల నుండి రక్షించుటకుగాను, అచ్చట గుప్తంగా దాచివుంచేవారు కాబోలు!

## బౌద్ధావశేషాలు

ఇచ్చట జరిపిన ఖనన పరిశోధనలలో 3 విహారాలు 2 చైత్యాలు, 3 స్తూపాలు, ఒక దగోబా బయల్పడ్డాయి. ఈ దగోబాలో బుద్ధదేవుని ధాతువో లేక దంతమో గుప్తపరచి వుంటారని శాస్త్రజ్ఞులు నిర్ణయించారు.

ఒక విహారంలో 7 గదులున్నాయి. 4, 5 గదుల మధ్య ఒక విలక్షణమైన త్రోవవుంది. ప్రతి గది 10 చదరపు అడుగుల వెడల్పున వుంది. బౌద్ధభిక్షువులు నివసించటానికి వీలుగా ప్రతి గదికి మూలలలో కొన్ని కొట్టడీలువున్నాయి.

పై విహారానికి దక్షిణ దిక్కున రెండు చైత్య గృహాలున్నాయి. ఒక చైత్య గృహం లోపలి భాగం 25 అడుగుల 4 అంగుళాల పొడవు, 10 అడుగుల 4 అంగుళాల వెడల్పుతో వున్నది. మరి ఒక చైత్యం 21 అడుగుల 4 అంగుళాల పొడవు, 12 అడుగుల వెడల్పు కలిగివుంది. ఒకస్తూపం ప్రాకారాంగణంలోవుంది. వేరొక స్తూపం యొక్క ఆవర్తపు అడ్డుకొలత 19 అడుగులు గలిగివుంది.

ఇచ్చట శిధిలములై పోయిన దేవమందిరాలు కొన్ని కనుపిస్తున్నాయి. ఇచ్చట జరిపిన త్రవ్వకాలలో ఎక్కడ గూడ బుద్ధదేవుని ప్రతిమలు బయల్పడక పోవటమేగాక, ఇచ్చటవున్న కట్టడాలు యేవిగూడ శిల్పాలంకార శోభితాలుగా నుండక పోవుటను బట్టి, ఇవన్నీ హీనయాన బౌద్ధమతానికి చెందినవై వుంటాయని ఆర్కియాలజీ శాస్త్రజ్ఞులు తమ అభిప్రాయాన్ని వెలిబుచ్చారు.

కొండాపురమే కుండినపురమా?

ప్రాచీన కాలంలో విదర్భ అనే దేశం వుండేది. దానికి కుండినపురం రాజధానీ నగరమైవుండేది. అది సర్వసంపదలతో తులతూగుతూ వుండినట్లు పెక్కు పౌరాణిక, చారిత్రికగాథలవల్ల విశదమౌతూంది ఆ విదర్భయే నేటి బీదరుగాను, ఆ కుండినపురమే కొండాపురంగాను మారివుండునని, కొందరు చరిత్రకారులు భావించిరి. ఆ ఊహయే సత్యమైనచో ఆ కుండినపురమే శ్రీకృష్ణ పరమాత్మ పట్టమహిషి అయిన రుక్మిణీదేవికిని, నలమహారాజు అనుంగు భార్య అయిన దమయంతీదేవికిని, జన్మస్థలమై ఉండును. దీనిని బట్టి గూడ ఒకానొకప్పుడు కొండాపురం అత్యంత ప్రాచీన చారిత్రిక విశేషంతో, మహావైభవోపేతంగా విరాజమానమై ఉండేదని, అది ఆంధ్రులకు, ఆంధ్రదేశానికి అఖండ కీర్తి నార్జించిన మహాపట్టణంగా వర్ధిల్లుతూ వుండేదని చెప్పవచ్చును.

అంతేగాక శాతవాహన సామ్రాట్టులు ప్రతిష్ఠాన పురాన్ని (పైఠాన్) రాజధాని నగరంగాజేసికొని రాజ్యపాలన గావించిన కాలంలో వారికి ప్రాకార పరిఖావృతాలైన ముప్పది నగరాలు వుండేవని, ఆ కాలంలో అవి సర్వాలంకారశోభితాలై ధనధాన్యాదులతో, భోగభాగ్యాలతో విలసిల్లుతూ వుండేవని పాశ్చాత్య చరిత్రకారుడైన మెగస్తనీసు వ్రాసిఉన్నాడు. గనుక అది ఆ ముప్పది నగరాలలో ఒకటి అయి ఉండవచ్చును.

ఈ శిథిల ప్రాంతాలను పరిశోధించిన శాస్త్రజ్ఞులు ఈ ప్రాంతం క్రీ పూ 300 నుండి క్రీ. శ. 200 వరకు గల మధ్య కాలంలో సకలసంపదలతో విరాజమానమై విశిష్ట సభ్యత, గొప్ప నాగరికతగల ప్రజలతో కిటకిటలాడుతూ వుండేదని తెలిపిరి రెండు వేల సంవత్సరాలకు పూర్వం ఇంతటి ప్రశస్తి గలిగి మహోజ్వలంగా నాశనమైపోయిందో చెప్పటానికి తగిన ఆధారాలేవి లభ్యం కావటం లేదు.

భారత ప్రభుత్వ పురావస్తు శాఖ డైరెక్టర్ జనరలు రావు బహద్దూర్ శ్రీ కె. యస్. దీక్షితులు గారు ఈ కొండాపురాన్ని గురించి వివరించిన యీ క్రింది ప్రశంసావాక్యాలను ఇచ్చట ఉటంకించటం ఎంతైనా సమంజసమని తలంతును –

"ఇది నిజంగా దక్షిణాపథంలోవున్న ప్రాచీన చారిత్రిక ప్రదేశాలలో శోధించదగిన విశిష్టస్థలం ఆంధ్రరాజ యుగపు వైభవ శిఖరానికి కొంపోవశక్తి గల విస్తృత యోగ్యతలున్న నగర ప్రదేశం మరి ఒకటి దక్షిణాపథంలో నాకు కనుపించుటలేదు. ఇచ్చట బయల్పడ్డ వస్తు సంపద అసాధారణ విశిష్టతతో, సభ్యతతో ఒప్పారుతూవుంది. గనుక ఈ కొండాపురాన్ని నేను దక్షిణ భారతపు 'తక్షశిల' అని తలుస్తూ ఉన్నాను."

భారత భాగవతాది ఐతిహాసిక గ్రంథాలలోను, నైషధ మహాకావ్యంలోను వర్ణింపబడిన కుండినపురాన్ని పోలిఉండి, సర్వసంపదలతో విలసిల్లుతూ మహావైభవంగా వర్ధిల్లినట్లు ఈ కొండాపురపు శిథిలావశేషాలు రూఢిపరుస్తున్నాయి. అంతేగాక ఇది దక్షిణాపథంలో ఒకనాడు నివసించిన ప్రాచీన జాతులకు సంబంధించిన నాగరికతకు, సాతవాహన సామ్రాట్టుల కళా వైభవానికి, హీనయాన బౌద్ధమతావలంబుల నిరాడంబర భక్తి భావతత్పరతకు నిలయం అయినది అది నూతన విషయాలను పెక్కింటిని మనకు విశదపరుస్తూ ఆంధ్ర చరిత్రలో ఒక విశిష్టాధ్యాయాన్ని సృజిస్తూ వుంది. *

## వరకట్నాల ....

( 27 వ పుట నుండి )

ప్రతివారు ఈ వరకట్న దురాచార నిర్మూలనకై పాటు పడటానికి కృతనిశ్చయులై అతి తేలికగా ఆచరించ గలిగిన ఈ క్రింది నియమాలను పాటించాలి. ఎక్కడైనా పెండ్లీడు పిల్లవాడు వున్నాడని తెలియగానే పిల్లపెళ్లి చేయాలనే ఆదుర్దాతో వరదక్షిణని వేలంపాట లాగా పెంచకూడదు, పిల్ల పెళ్ళి చేయాలనే ఆదురాతో రక్తసంబంధాన్ని కూడా విస్మరించి కట్నం యివ్వటంలో పోటీకి దిగుతున్నారు. మగదిక్కులేని ఒకామె పిల్లని చూడటానికి వచ్చినప్పుడు మర్యాద చేయటానికని అన్నగార్ని పిలిపించింది. అతని దగ్గరా పెండ్లీడు పిల్ల వున్నది, మగదిక్కులేని ఆ చెల్లెలికి సహాయం చేయబోగా "నేను ఇంకా ఎక్కువ కట్నం యిస్తాను. మా పిల్లను చూడండి" అని అడిగాడట ఆ మహానుభావుడు. ఒకరు కట్నకానుకలు విషయమై సంప్రదింపులు జరుపుచుండగా మేము ఇంకా ఎక్కువ కట్నం యిస్తామని వారి ఎదుటనే చెప్పే ఘనులు వున్నారు. ఈ విధంగా కట్నం విషయములో ఒకరిపై ఇంకొకరు పోటీకి దిగకూడదు అనే నియమాన్ని అందరూ పాటించాలి.

ఒక పిల్లని చూచి ఆ పిల్ల నచ్చిందీ లేనిదీ ఖచ్చితంగా తేల్చి చెప్పేవరకు ఇంకొకరు ఇంకో పెళ్ళి చూపుల ఏర్పాటు చేయకూడదు. ఒకతను ఒకపిల్లను చూచి నచ్చింది అని చెప్పి ఫలానా వారు పదివేలు కట్నం యిస్తామన్నారని చెప్పాడు. మరల ఇంకోపిల్లని చూచి ఆ పిల్ల నచ్చిందని చెప్పి ముందుచూచిన పిల్ల తల్లిదండ్రులు 12 వేలు కట్నం యిస్తామన్నారు అని చెప్పాడు. యిలా ఎంతమందినో చూస్తూ కట్నం వెల పెంచుకుంటూ పోయాడు, ఒక ఆడ పెత్తనం, ధనదాహంగల ఘనుడు. గనుక ఒకరు ఒక పిల్లను చూచిన తరువాత ఆ సంగతి ఏదోపూర్తిగా తేలేవరకు ఇంకొకరు పెండ్లి చూపులకు రమ్మని పిలవకూడదు.

పిల్లనచ్చి కట్నం ఎక్కువ అని విరమించుకొన్న పిల్లవానికి ఎక్కువ కట్నం యివ్వటానికి ఇంకొకరు అంగీకరించకూడదు.

అన్నింటికన్న ముఖ్యమైనది. ప్రతివారు కట్నం యిచ్చేటప్పుడే పాముకాటు వేసినంతగా బాధ పడుతున్నారే గాని కట్నం తీసుకునేటప్పుడు చీమ కుట్టినంత యైన బాధపడటం లేదు. ప్రతివారు కట్నం యిచ్చేటప్పుడు తాము ఎంతబాధ పడ్డది మరచిపోకూడదు. ఆచరణీయమైన ఈ నాలుగు నియమాలను ప్రతివారు పాటించినట్లైతే, వరకట్న దురాచారము నిర్మూలన మౌతుంది. *

కథానిక

# కాటేసిన కల

పాలకోడేటి సత్యనారాయణరావు

అప్పుడే వచ్చిన న్యూస్ పేపర్ చదువుతున్నాను నేను వీధిగదిలో ఈజీ ఛైర్‌లో కూర్చుని. ఆ సమయంలో నాకు ఎక్కడ లేని ఓపిక వస్తుంది. ఎవరు పిలిచినా, ఎవరు పలుకరించినా నేను వినిపించుకోను.

కానీ

ఆవేళ ఆసమయంలో నాకు ఒక యస్.వో.యస్. వినిపించింది వంట ఇంట్లోంచి. అయినా కదల్లేదు నేను, నీరజకు నే కదలనని తెలుసు గనుక భయం లేదనుకొని.

క్షణం గడువకనే, 'మిమ్మల్నే, రారేం ?–' అంది నా శ్రీమతి నీరజ. ఈ కంఠంలో బాధ తొణికిసలాడుతోంది.

పేపరక్కడే పారేసి వంట ఇంట్లోకి పరుగుతీశాను.

గ్యాస్ పొయ్యిమీద నుండి కిందకుపడిపోయిన ఆ గిన్నె, ఆ గిన్నెలోంచి ప్రవాహం కట్టిన పులుసు, ఆ పులుసు నీరజచెయ్యి మీదవేసిన డిజైన్...నాకు నవ్వొచ్చింది.

"ఏమయ్యింది నీరూ ?–"

"కాలిందండీ..." నీరజకంట కన్నీరు.

నా హృదయం ఒక్కసారిగా బావురుమంది.

"ఎక్కడ ?"

"ఇక్కడే !–" అంది చేయిచూపిస్తూ నీరజ. నీరజ మోచేయిదాకా ఉన్న ఆ పులుసు, చేతిని కాల్చిందన్నది నిజమే !

ఏంచేయాలో తోచలేదు !

దగ్గరకు చేరి పులుసును చేత్తో తుడిచివేయ బోయాను.

"అయ్య బాబోయ్,..." గావుకేక పెట్టిందీసారి నీరజ.

గుండె బేజారయి పోయింది. ఎలామరి?

కాలుగాలిన పిల్లిలాగ వీధిలోకి వచ్చాను.

"ఏమండీ... "

ఎవరో పిలిచినట్లయింది. అటు కేసి చూశాను. ఎవరో అపరిచితుడు !

"ఏమయిందండీ?"

"అదే...చెయ్యి కాలిందండీ–" ఏడుముకుంటూ చెప్పాను.

"అరెరె–" అంటూ ఆవ్యక్తి లోపలికి వచ్చాడు. సూటిగా వంట ఇంట్లోకి వచ్చి, నీరజ చేతిని చూశాడు. "అరరె, ఎంత పనయిపోయిందండీ ! ఇంకు ఉందా మీ దగ్గర ?"

ఎందుకో తెలీక పోయినా, ఇంకుబాటిల్ అందించాను నేను.

ఆ కాలిన ప్రాంతమంతా ఇంకుతో ఒడిపేశాడు. నీరజచెయ్యి నల్లగ, భయంకరంగ...అబ్బ !

"అబ్బా !–" నీరజ బాధను ఎంతగ అణచుకుంటుందో నాకు తెలుసు. నేను మాత్రం బాధను అణచుకోలేకుండా ఉన్నాను.

"మంట తగ్గిందాండీ ?"

"ఊ...కొంచెం..."

"ఇక లేవండి. లేచి హాస్పిటల్‌కు వెళ్ళండి–పెద్దగ ఏమీ కాలేదు."

నాకు ఒళ్లు మండిపోయింది–నీరజ చెయ్యి అంతగ కమిలి పోతే, ఇంకా పెద్దగ ఏమీ కాలేదంటే ఏమనాలి ?

అతని మాటలకు నీరజ అవునన్నట్లుగ తల ఊపింది. లేచింది. దగ్గరకు వెళ్లాను. ఒక చేయి నామీద ఆన్చి, మెల్లిగ నడిచింది.

"హాస్పిటల్‌కు తీసుకెళ్లండి. పర్వాలేదు, తగ్గిపోతుంది".

ఔను, అన్నట్లు హాస్పిటల్‌కు తీసుకెళ్లాలన్న సంగతే గుర్తు లేదు నాకు. సమయానికి గుర్తు చేశాడు. ఇల్లు తాళంవేసి బయలుదేరాము. హాస్పిటల్‌లో నీరజను చూసి ఏదో ఆయింట్‌మెంట్ రాసి, వెళ్లమన్నారు, పర్వాలేదంటూ.

ఆ క్షణంలో మళ్ళీ అతను గుర్తుకు వచ్చాడు నాకు. ఎవరతను ?

నీరజ కూడా అదే అడిగింది–"ఎవరండీ అతను ?"

"తెలీదు నాకు"

"కనుక్కోలేక పోయారా ?" బాధగ అంది నీరజ.

"నాకసలు ఏమైనా తెలిస్తేగా నీరూ ఆక్షణంలో !... కను క్కుందాంలే-"

"చాల మంచాడులా ఉన్నాడు-" అంది నీరజ.

నాకు మళ్ళీ బాధ కలిగింది-నీరజతో నేను దాదాపు నాలుగేళ్ల నుంచీ కాపురం చేస్తున్నా ఒకసారైనా ఈ సర్టిఫికేట్ నా కివ్వ లేదు. ఈ వేళ అయాచితంగా అదే సర్టిఫికేట్‌ను ఆ అపరిచితుని ముఖాన పారేసింది-అదృష్టవంతుడు !

ఇంటికి తిరిగి వచ్చేసరికి అతనూ వచ్చాడు. మమ్మల్ని చూడగనే లేచి నిలబడ్డాడు సగౌరవంగ-"ఏమన్నారు ?"

"పర్వాలేదనే అన్నారు" నీరజే జవాబిచ్చింది.

నేను మౌనంగ లోనికి వచ్చాను-"లోపలికి రండి" అన్న మాటలు విని వెనక్కి తిరిగాను. అతను, నీరజ కలిసి లోపలికి వస్తున్నారు. నా ఒంటి మీద తేళ్లు జెర్రులు పాకాయి.

"మీ రెవరో తెలీకపోయినా, సాయంచేసారు, థ్యాంక్స్" అంది నీరజ అతనితో. ఈ మాటలు అనవలసినది నేనయినా, నీరజే అంది.

"దానికేముందండి, మనిషికి మనిషి సాయం. కేక వినగానే వచ్చాను ఏమిటోనని !" అతని సంజాయిషీతో నీరజ ముఖం చేటంతయింది

"కూర్చోండి, కాఫీ తాగి వెడుదురుగాని-" అంది నీరజ

"పర్వాలేదు, దానికేమిటండీ..."

"నీరూ, నువ్వుకూచో, నేను తెస్తాను" అంటూ లేచాను.

"అరరె, మీరు తేవడం..."

"ఫర్వాలేదు. నేనంటే మావారికి ఎంతో ఇష్టం. ఇలాటి సమయాల్లో మరీనూ...తీసుకురండి-"అంది నీరజ. ఫ్లాస్కులో కాఫీ తీసి, రెండు కప్పుల్లోపోసి తీసుకెళ్లాను నేను. ఓ కప్పు అతని కిచ్చి, వేరొకటి నీరజకు ఇచ్చాను. నీరజ దాన్ని సగంచేసి, మళ్ళీ నాకు అందించింది. అందుకొన్నాను.

"నే వెడతానండీ, సెలవ్-" అని అతడు వెళ్ళిపోయాడు.

"ఎలాఉంది నీకు?" అన్నాను నేను నీరజ చేయి విషయం గుర్తొచ్చి.

"అతను ఇంకు పోయగానే మంట చాలతగ్గిందండీ-అయినా మీకు తెలియదేమిటండీ ఈ చిట్కా"

"తెలీదు. తెలిసినా తట్టేదికాదు. అంతా కంగారేగా!-"

"నేనంటే మరీ అంత ఇష్టం కూడదుసార్" అంటూ నీరజ లేచి, చటుక్కున నా బుగ్గమీద చిటికవేసి వెళ్ళింది వంట ఇంట్లోకి.

"ఈ పూట వంట వద్దులే, వెళ్ళి కారీరుతెస్తా" అన్నాను నేను నీరజతో.

"పర్వా లేదండీ, చేసేయగలను...కానీ..."

"ఊ కానీ ?"

"మీరు కొంచెం అడ్డు రాకుండా ఉంటే..." నవ్వుతూ అంది నీరజ.

-ఈ ఆడవాళ్ళకు ఇంత దారుణమైన తెలివిని ఎందుకు ప్రసాదించాడు దేవుడు ? నీరజకు ఈ క్షణంలో నేను తన పక్కన ఉండేనే తృప్తి అన్నది ఎంత గొప్పగ తెలియ జేసింది-అందుకే నాకు నీరజంటే బోలెడు ఇష్టం-ఎంతంటే, ప్రాణమిచ్చేయగలిగే టంతటి ఇష్టం.

అక్కడే కూర్చున్నాను-అదీ ఇదీ చేస్తూ చెప్పింది నీరజ అతని గురించి-అతని పేరు రామకృష్ణ, మోడరన్ కేఫ్‌లో సర్వరట-

ఉలికి పడ్డాను నేను- మోడరన్ కేఫ్‌లో సర్వర్ !

"ఎవరు చెప్పారు నీకు ?"

"ఇంకెవరూ-అతనే !" అంది నీరజ మీకీమాత్రం తెలివి లేదా అన్నట్లుగా పోజుపెట్టి.

క్షణం ఆగి అంది మళ్లీ-"మనిషి మాత్రం మంచివాడు సుమండీ-ఎవరొస్తారు చెప్పండి ఆపదలో ఆదుకొనేందుకు ?"

చాలు! మిస్టర్ రామకృష్ణా ? యు ఆర్ ఎ లక్కీ ఫెలో !

"ఏం మాట్లాడరేం" అంది కేనాసి చూస్తూ నీరజ.

"ఏం మాట్లాడను?... సరేగానీ వెళ్ళి పేపరు చదువుకోనా?"

"భోజనంచేసి ఏకంగ వెళ్ళండి" అంది నీరజ.

"భోజనం చేసాక చెయ్యి కడుక్కున్నాను. లేవబోతోంటే అంది నీరజ ఉన్నట్లుండి. "మీలోనాకిదొక్కటే నచ్చలేదు సుమండీ"

"ఏమిటది ?"

"అదే, అతను హోటల్ సర్వరనే సరికేగా ఈ నిర్లక్ష్యం"

"నీరూ..."

"ఊరుకోండి. ఇంకేం చెప్పకండి నాకు-అలాటి భావాలు ఉండకూడదండీ మనకు ! మనిషిని మనిషిగ ఎప్పుడు చూడ్డం ప్రారంభిస్తారు ?-ఛ-మనిషికి విలువ ఇవ్వాల్సింది మనసునిబట్టి గానీ అంతస్తునిబట్టి కాదండీ..." లేచి వీధిలోకి వచ్చాను నేను ఇంకేమీ వినక.

మనసులోని భావాలని ఇంత ఖచ్చితంగ ఎలాచదవ గలిగింది? ఈ ఆడవాళ్లు అంత తేలికగ అర్థం అయ్యే జాతిగాదు.

మర్నాడు-

మా ప్రిన్సిపాల్ పిలుస్తున్నారంటే పొద్దున్నే నేను లేచివెళ్ళాల్సివచ్చింది. వెడుతున్నపుడు నీరజను పిల్చి చెప్పాను— 'వంట చేయకు, కారియర్ తెప్పించు, హాస్పిటల్‌కు వెళ్లటం మర్చిపోకు. అని. సరేనంది.

కాలేజీ నుంచి మధ్యాహ్నం ఒంటిగంటకు వచ్చాను. నీరజ తలుపు తీసీ తీయగానే అడిగాను—హాస్పిటల్‌కు వెళ్ళావా?'' అని

"ఆ. వెళ్ళొచ్చాం—''

''ఎవరెవరు?''

''నేనూ, రామకృష్ణా! మీరలా వెళ్ళగానే అతనువచ్చాడండీ ఎలా ఉందండీ అంటూ. తగ్గిందని చెప్పి హాస్పిటల్‌కు వెళ్ళాలన్నాను. తనూ వస్తానంటూ వచ్చాడు నాతో—''

నాకు తెలుసు నా నీరజ నిర్మల అని. కానీ...

నేనేం అనలేదు.

నీరజ వడ్డిస్తూ అంది: "మీరతను సర్వర్ అనేకదూ చిన్న చూపు..."

నన్ను నేను మభ్య పెట్టుకుంటూ అన్నాను—"ఉహు,కాదు..."

"ఊ, నాకు చెబుతారేం మీరు? నేనతనితో వెళ్ళానని బాధగా ఉందామీకు? నిజం చెప్పండి... మీకిష్టం లేకపోతే..."

"అదికాదు నీరూ..."

"పోనీ మీరు నన్ను నమ్ముతారా?"

"నీరూ,ఛ—..."

"అయితే చాలండీ! మంచివాళ్లతో స్నేహం ఉండడం చాలమంచిదండీ— "అంది నీరజ.

ఆ తర్వాత సంభాషణ అక్కడితో ఆగిపోయింది గానీ, నీరజ రామకృష్ణల స్నేహంమాత్రం బాగనే పెరిగింది. రామకృష్ణ తరచు మాఇంటికి వస్తూ వున్నాడు. అతని కబుర్లు నీరజద్వారా తెలుస్తూనే ఉన్నాయి.

నీరజకు ఆచేయి పూర్తిగ తగ్గేవరకు అతనే ఎంతో శ్రద్ధ తీసుకొని మరీచేశాడు. నాభార్య విషయంలో శ్రద్ధ చూపిన అతనంటే నాకు అభిమానం కలిగింది. నిజంచెప్పాలంటే ఈనాడతనంటే నాకు చిన్నచూపు లేదు.

ఈ మధ్య మా మాటలలో తరచు రామకృష్ణ, అతని హోటల్ దొర్లుతున్నాయి—'పేరుకు సర్వరేగానీ, సర్వాధికారాలు అతనివే! అతనంటే యజమానికి ఎంతో గురి. అంటే ఇతనెంత చెబితే అంతే! రామకృష్ణ అంటే యజమాని పడిచస్తాడు. నిజమే, మంచివాడు గనుక, అతనికంత విలువ. ఇవన్నీ నీరజ చెప్పిన సవాలక్ష విషయాలలో నా చెవిలో పడ్డ కొన్ని! రామకృష్ణ మాటలలో కూడ తరచు యిలాటి పదాలే వినేవాడిని.

కొన్నాళ్ళ తర్వాత

ఒకరోజు అంది నీరజ హఠాత్తుగ ''ఈవేళ మోడర్న్ కేఫ్‌కు వెడదామా?''

''ఎందుకు''?

''ఎందుకేమిటి? టిఫిన్ చేసివద్దామని"

''టిఫిన్‌కు అక్కడ దాకా వెళ్ళాలా?''

''వెళ్ళాలని కాదనుకోండి. కానీ రామకృష్ణ ఎప్పటినుంచో రమ్మంటున్నాడు. మీ ఇద్దరూ రండొకసారంటూ ఒకటే గొడవ ''

"వెడదాంలే—"

"ఎపుడు''

"ఎప్పుడో ఒకప్పుడు—ఈవేళ నాక్కొంచెం పనుంది" అన్నాను తప్పించుకొనేధోరణిలో.

క్షణం ఆగి అంది నీరజ: పోనీండి—మీకింకా ఆవూహే ఉంటేసరి! మీరతను సంపాదించేది చూస్తే, నేనతని మనసు చూశాను— మీరు సిగ్గుపడుతున్నారని నాకు తెలుసునండీ ..''

' నీరజ ప్లీజ్...''

ఒక్కొక్కసారి నీరజ అంటే నాకు భయంవేస్తుంది. నా మనసులోది అక్షరం పొల్లుపోకుండా చెప్పేస్తుందిమరి!

''కానీ నేను సిగ్గు పడనండీ ఒక మంచి మనసున్నవ్యక్తి నా స్నేహితుడని చెప్పుకోడానికి నేను గర్వపడాలేగానీ, సిగ్గుపడాల్సిన అవసరం లేదు.''

''నీరజా...''

''ఏమిటండీ చెప్పండి'' అంది నీరజ

''చూడు నీరజా! ఆడ, మగవాళ్ల మధ్య స్నేహాన్ని గొప్పగ సహృదయంతో అర్థంచేసుకునే స్థితికి రాలేదు మనంఇంకా''

నీరజ నాకేసి సూటిగ చూసింది. తలదించుకున్నాను

''మీరు నిజంగానే అంటున్నారా?''

నేనేమీ అనలేదు.

''నాకు తెలుసు మిమల్ని మీరు మభ్య పెట్టుకుంటున్నారని. మీమనసులోనూ అదేఉంటే. మీరేమనేవారో తెలుసా?''

తలెత్తి చూశాను నీరజకేసి

"అతన్ని ఇంటికి రావద్దనేవారు—అంతేగానీ, అతని హోటల్‌కు వెళ్లననేవారుగాదు పోనీండి. మీరుచెప్పండి...నన్ను నమ్మరా మీరు?''

''నిన్నా, నమ్మకేం? నమ్ముతాను, కానీ...''

''అయితే ఇంకేం లేదన్నమాట? మీమనసులోది మీకు తెలీదన్న మాట. మీకు అతనంటే ఇష్టమేగానీ, సర్వరనే పద మంటే భయం. అంతేనా''

నీరజ ప్రశ్నకు నేనేమీ జవాబివ్వలేదు.

దాదాపు వారం గడిచింది

ఆవేళ మళ్ళీ అంది నీరజ: ''పోనీ మీరొక్కరైనా వెళ్ళి రండి''

నీరజకేసి చూశాను ప్రశ్నార్థకంగ

''అతనెంతగ అడుగుతున్నాడో తెలుసా. అతను మనకు చేసిన సాయం అంతతొందరలో మర్చిపోకూడదు ..''

పోనీ నీరజకోసమైనా ఒకసారి వెళ్లొస్తే సరిపోతుందనిపించింది.

''మీరీవాళ వెళ్తున్నారుగదూ?'' సూటిగ అడిగింది నీరజ

తల ఊపాను ఔనన్నట్లు

సాయంత్రం వెళ్లాను నేను మోడర్న్‌కేఫ్‌కు. నన్ను చూడగానే రామకృష్ణ దగ్గరకు చేరాడు. స్వీట్‌హాట్ ఇచ్చాడు. మౌనంగాఅందుకొన్నాను. కాఫీ తెచ్చాడు. అదీ తాగాను

''థ్యాంక్సండీ వచ్చారు'' అన్నాడు రామకృష్ణ

నేనేమీ మాట్లాడలేదు. నాదృష్టంతా దూరానఉన్న రమణరావు మీద ఉంది.

నాకు తెలుసు రమణరావు ఎంతవెధవో! అనుకోకూడదు గానీ అతను నాకొలీగ్. ఫిజిక్స్ లెక్చరర్. వెకిలిమనిషి. ఈ వేళనన్ను రామకృష్ణతో మాట్లాడుతూ ఉండగ చూస్తే రేపుఅనేస్తాడు "మీకేమిటండి బోలెడు డబ్బు మిగలేస్తారు మీరు. హోటల్ సర్వర్స్ కూడా ఫ్రెండ్సే, ఇంకేం ఖర్చుమీకు'' అని.

అతను చూడకుండా వచ్చేస్తేచాలు

''నేను వెడతా రామకృష్ణా!'' అంటూ వెనుదిరగకుండానే మెట్లుదిగి కిళ్లీ షాపుదగ్గర సిగరెట్లు కోసం ఆగాను.

సిగరెట్టు అంటించుకునే సరికి హోటల్‌లోంచి గలభా వినిపించింది. అటుతిరిగాను. అదిరి పడ్డాను. ప్రొప్రయిటర్ అనుకుంటాను. రామకృష్ణను కొడుతున్నాడు. మనసు మసిబారిపోయింది. వెళ్లి ఆపుదామనిపించింది. ముందుకు అడుగు వేశాను.

రమణరావు కనిపించాడు. ముందుకు వేసిన అడుగు వెనుక్కు తీసుకున్నాను. మనసు వికలమయి పోవటంతో వెళ్లి పార్కులో కూచున్నాను. కాని ఏమీ మన శ్శాంతి చిక్కలేదు. ఇంటికి వచ్చాను నేను. నీరజకు జరిగిందంతా చెప్పాను.

నీరజ'ది షాక్ అయివుంటుంది. అందుకే ఏమీ మాట్లాడలేదు.

దాదాపు పది నిమిషాల తర్వాత ఇంట్లోంచి బయటకు వస్తుంటే దూరంగా రామకృష్ణ వస్తూ కనిపించాడునాకు. మళ్లీ వెళ్లి ఇంట్లో దూరాను.

రామకృష్ణ ఇంట్లోకి వచ్చాడు నన్ను చూడకుండా నేను వెళ్లి పక్కగదిలో దూరాను-అతని మనసు కష్టపెట్టటం ఇష్టంలేక.

దాదాపు పదినిముషాల తర్వాత అడిగింది నీరజే ''ఏ మలా ఉన్నావు?''

'' ... '' రామకృష్ణ ఏమీ అనలేదు.

''చెప్పు రామకృష్ణా! అసలేంజరిగిందని''

''చెబుతానండీ,ఇన్నాళ్లూ ఎవరూ దొరకలేదు నాకు-మీకు చెబుతాను'' అని ఆగాడు రామకృష్ణ.

నేను చెవులు రిక్కించుకొని వున్నాను ఏంచెబుతాడోనని.

"నేను చాల పేదవాణ్ణండీ! కానీ మనిషికి జీవితంలో ఒక అత్యున్నత స్థాయి పొందలేకపోయినా, పొందాలనే కోరిక ఉంటుంది కదండీ. అదెలాగూ తీరదని తెలుసు. అందుకే నాకు నిజజీవితంలో సాధ్యం కాని వాటిని, కలలుగ రూపొందించుకొని, పదిమందితో చెప్పుకొని సంతృప్తి పడతాను-నాయజమాని నా మాటకు విలువ నివ్వడు సరి గదా, నేనంటే అనుమానం కూడాను! ఆరికి ..."

''ఏం జరిగింది? " నీరజ నెమ్మదిగ అడిగింది.

''ఈ వేళ కొట్టాడండీ!''

''అదేం?''

''మీవార్ని, మిమ్మల్ని హోటల్‌కు రమ్మన్నాననంటే మీరు రారనే ఊహతోనే. మీరురాలేదుగానీ మీవారువచ్చారు. టిఫిన్ ఇచ్చాక బిల్లు తెచ్చాను. మా యజమానితో చెబుదామని వెళ్లేసరికి, ఆయన పనిలో ఉండటంతో తిరిగివచ్చాను. నేను మీవారిదగ్గర డబ్బు తీసుకున్నాననుకొని కొంచంతొందరపడ్డాడు అంతే! కలలు కనడం నాకు తెలుసుగానీ ఒక్కొక్కసారి ఆ కలలెంతో తీవ్రంగ కాటువేస్తా యన్నది నేను ఊహించుకోలేదు."

నీరజ సంగతి నాకు తెలుసుగానీ, నాకంట్లో కన్నీరు చిలికింది. 

# కార్మికుల కుటుంబ పెన్షను పథకం

బొబ్బా కృష్ణమూర్తి నాయుడు

దేశ పురోగతికి వెన్నెముక వంటివారు కార్మికులు. వారి సంక్షేమం పైననే పారిశ్రామిక శాంతి, పారిశ్రామిక ప్రగతి, జీవన ఆదాయ ప్రమాణం పెరుగుదల, దేశ ఆర్థిక సాంఘిక వ్యవస్థ పునర్నిర్మాణం, సాంఘిక సమానత్వ సముద్ధరణ, మన కేంద్ర ప్రభుత్వం ఆశిస్తున్న శ్రేయోరాజ్య స్థాపన చాల వరకు ఆధారపడి వుంది.

ఈ సత్యాన్ని గుర్తించిన మన ప్రభుత్వం, వారి సంక్షేమాన్ని ఎన్నడూ విస్మరించలేదు. పంచవర్ష ప్రణాళికల ద్వారా నిర్దిష్టమైన విధానాన్ని రూపొందించింది. కాలానికి అనుగుణంగా, పరిస్థితులకు అవసరమయ్యేలాగా ఎప్పటికప్పుడు ఎన్నో శాసనాలను చేస్తూ వచ్చింది.

కార్మిక పని పరిస్థితులకు, వేతన నిర్ణయానికి, వేతనాల చెల్లింపుకు, బోనస్ చెల్లింపునకు సంబంధించిన ఎన్నో శాసనాలను అమలు జరిపింది.

## కార్మికుని జీవన భద్రత

కార్మికుని జీవనానికి కుటుంబానికి భద్రతా సౌకర్యాలను (Social Security) సమకూర్చే శాసనాలను ప్రత్యేకంగా రూపొందించింది. వీటిలో ముఖ్యమైనవి-కార్మిక బీమా పథకం (Employees State Insurance Scheme) కార్మికుల నష్టపరిహార చెల్లింపు చట్టం (Workmen's Compensation Act) కార్మికుల ప్రావిడెంటుఫండు పథకం (Employees Provident Fund Scheme) మొదలగునవి. అనారోగ్యం వలనగాని, నిరుద్యోగం వలనగాని, వృద్ధాప్యం వలనగాని, అకాల మరణం వలనగాని, ప్రమాదవశాత్తు, అంగవికలత్వం కలిగినందు వలనగాని కార్మికుని జీవనభృతి క్లిష్టమైనపుడు పై పథకాలక్రింద కొన్ని సదుపాయములు సమకూరుతాయి.

## ప్రావిడెంటు ఫండు పథకం

ఉద్యోగ విరమణానంతరం, వృద్ధాప్యంలోను, నిరుద్యోగ సమయంలోను కార్మికునికి కొంత భద్రతా సదుపాయాలను కల్పించేందుకు ఉద్దేశించబడినది ప్రావిడెంటుఫండు పథకం. ఈ పథక సభ్యత్వాన్ని పొందిన ప్రతి కార్మికుడు ప్రతి నెలా వేతనంలో $6\frac{1}{4}\%$గాని 8%గాని ప్రావిడెంటుఫండుకు జమ చేయవలసి వుంటుంది. దీనికి సమాన మొత్తాన్ని యజమాని చేర్చుతాడు. ఈ సొమ్ము ప్రావిడెంటు ఫండు నిధిక్రింద కార్మికుని పేరిట వుంటుంది. ఉద్యోగ విరమణ అనంతరం అతనికిగాని, అకాలమరణ సమయంలో అతని వారసులకుగాని యీ సొమ్ము సంక్రమిస్తుంది.

కాని యిది సమగ్రమైన శాసనం కాదు. ఈ పథకంక్రింద ఆదాచేసే మొత్తం స్వల్పం. ఉద్యోగ విరమణ అనంతరం తన జీవన భృతికే సరిపడదు. సరిగదా అతని పై ఆధారపడివున్న వారి మాటేమిటి? అతను సర్వీసు కాలంలో అకాల మృత్యువు పాలైనప్పుడు కుటుంబ సభ్యులగతేమిటి? వారికి దీర్ఘ కాల జీవన భృతిని, రక్షణను కల్పించలేదు. ఈ చట్టం ఈ విషయాన్ని గుర్తించిన మన ప్రభుత్వం ఒక సమగ్రమైన పథకాన్ని రూపొందించాలని సంకల్పించింది.

## కుటుంబ పెన్షను పథకం

పారిశ్రామికంగా అభివృద్ధి పొందివున్న కొన్ని దేశాలలోని శాసనాలను పరిశీలించిన ఫలితంగా రూపొందించబడినదే యీ "కుటుంబ పెన్షను పథకం." ఈ పథకం అటు పదవీవిరమణానంతర సదుపాయాలను, ఇటు కుటుంబానికి పెన్షను సదుపాయాలనూ కల్పిస్తుంది.

ఈ పథకాన్ని 1970-71 లోనే అమలు జరపాలని కేంద్ర ప్రభుత్వం దృఢంగా సంకల్పించింది. దీనికి సంబంధించిన బిల్లు 7-12-70న లోక్ సభలో ప్రవేశపెట్టబడింది. కాని అప్పటి లోక్ సభ రద్దయినందున శాసనంగా రూపొందలేక పోయింది. అందుకే రాష్ట్రపతి 13-2-71న దీనికి సంబంధించి ఆర్డినెన్సును జారీచేయవలసి వచ్చింది. తరువాత 6-4-71న రాజ్యసభ ఆమోదం పొందిన యీ బిల్లు శాసనంగా రూపొంది కార్మికుల పాలిట కల్పతరువుగా అవతరించింది.

## పథకం వర్తింపు

ఈ కుటుంబ పెన్షను పథకం 1-3-71 నుండి అమలులోనికి వచ్చింది. దేశం మొత్తంలో కార్మికుల ప్రావిడెంటు ఫండు పథకం సభ్యుడుగావున్న ప్రతి ఒక్కరికి వర్తిస్తుంది. ప్రావిడెంటు ఫండు చట్టంలో 17వ సెక్షను క్రింద మినహాయింపు పొంది (Exempted Establishments) తామే నిర్వహిస్తున్న ఫ్యాక్టరీలలోని కార్మికులకు కూడా అన్వయిస్తుంది.

ఏ ఫ్యాక్టరీలోగాని, సంస్థలోగాని యిదివరకే పెన్షను పథకం వున్నట్లయితే, ఆ పథకంలోని సదుపాయాలు ప్రస్తుత పథకంలోని సదుపాయాలకు ఏమాత్రం తక్కువ కానట్లయితే ఆ ఫ్యాక్టరీలు యీ పథకంనుండి మినహాయింపు పొందవచ్చు. కాని ఆ ప్రయివేటు పథక నిర్వహణలో కూడా ప్రభుత్వ అజమాయిషీ వుంటుంది.

1971 మార్చి 1వ తేదీ అనంతరం ప్రావిడెంటు ఫండు సభ్యుడు అయిన ప్రతి కార్మికునికి ఈ కుటుంబ పెన్షన్ పథకం

నిర్బంధంగా వర్తిస్తుంది. అంతకు క్రితమే సభ్యులుగావున్న వారి విషయంలో యిది ఐచ్ఛికంగా వుంటుంది. అంటే వారికి యిదివరకువున్న ప్రావిడెంటుఫండు పథక సదుపాయాలు కావాలో లేదా నూతనంగా ప్రవేశపెట్టబడిన కుటుంబపెన్షను పథకసౌకర్యాలు కావాలో కోరుకునే స్వేచ్ఛవున్నది. అయితే యీ విషయాన్ని లిఖితపూర్వకంగా ప్రతికార్మికుడు నియమిత ఫారంలో (Option form No. 1) ప్రాంతీయ ప్రావిడెంటు ఫండు కమీషనరుకు తెలియపరచవలసివుంటుంది.

దీనితోబాటు ఫారం-2లో కార్మికుడు తన కుటుంబ సభ్యులకు సంబంధించిన వివరములను కూడా తెలియపరచవలసి వుంటుంది. ఎవరికి పెన్షను యివ్వాలన్నది నిర్ణయించుటకు యీ వివరములు అవసరం.

ఈ పథకంలో చేరిన సభ్యుడుగాని, యజమానిగాని ప్రావిడెంటుఫండుతో బాటు అదనంగా ఏమీ చెల్లించనక్కరలేదు. ప్రస్తుతం కార్మికుడు ప్రావిడెంటుఫండుకు చెల్లిస్తున్న సొమ్ములో $1\frac{1}{6}\%$ యజమాని వాటాలో $1\frac{1}{6}\%$ మినహాయించి ఆసొమ్మును పెన్షన్ నిధికి కేటాయించబడుతుంది. ఉదాహరణకు : ఒక కార్మికుని జీతం 100 రూ. అనుకుందాము. అందులో ప్రావిడెంటు ఫండు వాటా $6\frac{1}{4}\%$ (రూ. 6-25) యజమాని వాటా $6\frac{1}{4}\%$ (రూ. 6-25) అందులో $1\frac{1}{6}\%$ (రూ 1-25)...$1\frac{1}{6}\%$ (రూ. 1 25) మొత్తం 2-50 పెన్షను ఫండుకు జమచేయబడుతుంది. మిగిలిన 5 | 5 . 10రూ ప్రావిడెంటుఫండు ఖాతాలో వుంటుంది. దీనికి గాను అతనికి అటు ప్రావిడెంటు పథక సదుపాయాలు, యిటు పెన్షను ఫండు పథక సదుపాయాలు లభిస్తాయి. అంటే అదనంగా ఏమీ చెల్లించకుండానే, అదనపు సౌకర్యాలు లభిస్తాయన్నమాట. ఇదే యీ పథకములోని విశేషం అందరూ గమనించవలసిన విషయం.

## పథకం ప్రయోజనాలు

ఈ పథకంలోని సదుపాయాలను పొందాలన్న కార్మికుడు కనీసం 2 సంవత్సరాలు పెన్షను ఫండు సభ్యుడుగా వుండాలి. ఈ లోపుగా సభ్యుడు పనిలోంచి విరమించినట్టయితే అతనికి పథక సౌకర్యాలు లభించవు. తనవాటాలో వున్న ఫండును $5\frac{1}{2}\%$ వడ్డీతో కలిపి తిరిగి చెల్లించబడుతుంది.

ఈ పథకం క్రింద లభించు సదుపాయాలను ముఖ్యంగా నాలుగు విధాలుగ పరిగణించవచ్చు. ఈ సదుపాయాలు అతను పథక సభ్యత్వ కాలాన్ని బట్టి, అంటే చేరిన నాటి వయస్సుకు మానివేసిన నాటి వయస్సుకు అనుబంధంగా వుంటుంది. ఈ లెక్కింపు పథకంలో వివరించబడిన పట్టీల ననుసరించి లెక్కించవలసి వుంటుంది.

## కుటుంబ పెన్షను పథకం

కార్మికుడు సర్వీసులో వుండగా అకస్మాత్తుగా మరణించినట్టయితే కుటుంబ సభ్యులకు ప్రతినెల కనీసం 40 రూ. నుంచి 150 రూ. పెన్షను యివ్వటం యీ పథక ఉద్దేశం. సభ్యుడు మరణించేనాటికి అతని వేతనాన్నిబట్టి యీ క్రిందిరేటులో పెన్షను యివ్వబడుతుంది.

(1) సభ్యుని నెల వేతనం 800 రూ. లకు పైనున్నట్టయితే వేతనంలో 12 శాతం రూ. 150 లకు మించకుండా పెన్షను వస్తుంది. (2) రూ. 200-800/- మధ్యన వున్నట్టయితే, జీతంలో 15% గాని 96 రూ. మించకుండా. కనీసం 60 రూ. వస్తుంది. (3) 200 రూ. లోపు వేతనమయితే వేతనంలో 30% కనీసం 40 రూపాయలు వస్తుంది.

పై నుదహరించిన మేరకు పెన్షను పూర్తిగా పొందాలన్న కార్మికుడు 25 సంవత్సరముల వయస్సులోపలనే పెన్షనుఫండు సభ్యుడుగా చేరివుండాలి. లేనట్టయితే ఫండులో చేరిననాటివయస్సుకు తగ్గట్టు లభిస్తుంది

ఉదా :—పెన్షను ఫండులో చేరిన నాటికి వయస్సు 32 సం॥ మరణించిననాటికి వయస్సు 36 సంవత్సరములు అప్పటికి అతని వేతనం రూ. 400 అనుకుందాము.

పై వివరాలు చూచినట్టయితె $400 \times 15/100 =$ రూ. 60 అతనికి రావలసి వుంది. ఆ కార్మికుడు 25 సంవత్సరముల వయస్సు లోపల పెన్షను పథక సభ్యుడై వుండివుంటే మొత్తం 60 రూ. వచ్చివుండేవి. కాని పెన్షను ఫండులో చేరిననాటికి అతని వయస్సు 32 సంవత్సరాలు. అందువలన అతనికి లభించే పెన్షను పై సూచించిన దాని ననుసరించి చూడాలి. 32 సంవత్సరాల వయస్సులో అతను ఫండుసభ్యుడయినచో రూపాయకు 76 నయాపైసల వంతున వస్తుంది. అంటే $60 \times 76$ రూ. 45 వస్తుంది.

పెన్షను విషయంలో మరో అదనపు సౌకర్యం కూడావుంది. కార్మికుడు 7 సంవత్సరాల పెన్షను ఫండు సభ్యత్వ అనంతరం మరణించినట్టయితే, మరణించిన నాటినుండి 7 సంవత్సరముల వరకు రెట్టింపు రేటువంతున పెన్షను యివ్వబడుతుంది. ఆ పిదప మామూలురేటు ప్రకారం పెన్షను కుటుంబసభ్యులకు లభిస్తుంది.

పెన్షను ఎవరికి లభిస్తుంది ? (1) భార్యలేక భర్తలకు వారు పునర్వివాహం చేసుకునేంతవరకుగాని, మరణించేంత వరకు గాని. ఇద్దరు భార్యలున్నట్టయితే పెద్ద భార్యకు, ఆమె మరణానంతరం రెండవ భార్యకు యివ్వబడుతుంది.

(1) పెద్దకుమారునికి 18 సంవత్సరాల వయస్సు వచ్చేంత వరకు,

(3) పెద్దకుమార్తెకు వివాహం అయ్యేంతవరకుగాని-లేనట్టయితే 21వ సంవత్సరముల వయస్సువరకుగాని,

పెన్షను అందరికీ ఏకకాలంలోరాదు. వరుస క్రమేణ వస్తుంది.

## జీవనభృతి (భీమా) హామీ సదుపాయం

సభ్యుని అకాల మరణ సమయంలో కుటుంబపెన్షనుతోబాటు యీ జీవన భృతి హామీ సదుపాయం (Family Assurance Benefit) సమకూరుతుంది. కార్మికులు 25వ సంవత్సరము లోపు వయస్సున్న పెన్షను ఫండులో చేరి కనీసం రెండు సంవత్సరాలు సభ్యుడుగావుండి మరణించినట్లయితే అతని కుటుంబానికి రూ. 1000 ఈ పథకంక్రింద యివ్వబడుతుంది. 25 సం॥ల వయస్సు అనంతరం పెన్షను ఫండు సభ్యుడుగా చేరివున్నట్లయితే దానికి తగ్గట్టుగా వుంటుంది. పెన్షను ఫండువలెనే యిదికూడా సభ్యుడుగా చేరిననాటి వయస్సుననుసరించి పథకంలోని టేబిలు II తో లెక్కించవలసి వుంటుంది.

ఉదా :—పెన్షనుఫండులో చేరేనాటివయస్సు 32 సంవత్సరాలనుకుందాము. టేబిలు II ననుసరించి రూపాయకు 76 నయాపైసల వంతున అంటే 1000×76/100 రూ. 760 వస్తుంది.

## ఉద్యోగ విరమణ సదుపాయం

కార్మికుడు 25 సంవత్సరముల వయస్సులోపున పెన్షను ఫండులోచేరి, 60 సంవత్సరముల వయస్సు అనంతరం ఉద్యోగం నుంచి విరమించినట్లయితే, ప్రావిడెంటు ఫండుతోబాటు రూ. 4000/ మొత్తం ఒకేసారి యివ్వబడుతుంది. దానితో అతని సభ్యత్వం రద్దవుతుంది. 25 సంవత్సరాల అనంతరం పెన్షను ఫండులో చేరినట్లయితే దానికి తగ్గట్టుగా వుంటుంది.

ఉదా:—30 సంవత్సరముల వయస్సున ఫండులోచేరి 60 సంవత్సరముల అనంతరం విరమించినట్లయితే టేబిలు II ననుసరించి లెక్క కట్టాలి. 30 సంవత్సరాలకు రూపాయకి 83 పైసల వంతున అంటే రూ. 1000×83/100=3320/ లభిస్తుంది.

## ఉపసంహరణ సదుపాయం

ఏకారణంగానైనా కార్మికుడు 60 సంవత్సరములు పని చేయకనే మధ్యలో మానివేసినప్పుడు లభించే సదుపాయాన్ని ఉపసంహరణ (Withdrawal Benefit) అని అంటారు. ఇది ఎంత వస్తుందని నిర్ణయించడానికి పెన్షను స్కీములోని పేరా 33లో యిచ్చిన ఫార్ములాతో అనుబంధంగా యిచ్చిన టేబిలు I మరియు టేబిలు IIలో ఇచ్చిన రేటు ప్రకారం లెక్క కట్ట వలసి వుంటుంది

ఫార్ములా : $\frac{y}{60}\ \frac{x}{60} \ldots \frac{-x}{-x} \times 4000 \times f$

Y పెన్షను ఫండులో వయస్సు విరమించిన నాటివయస్సు

X చేరిననాటి వయస్సు

F టేబిలు I (విరమణవయస్సు)లో చూపినమేరకు.

ఉదా: ఒక కార్మికుడు పెన్షను ఫండులో 22 సంవత్సరముల వయస్సునాడు చేరి 56వ సంవత్సరములో మానివేసినాడనుకుందాము

ఫార్ములా మేరకు: $\frac{56-22}{60-22} \times 1000 \times 92$ = రూ. 3392.60

25 సంవత్సరముల అనంతరం చేరి మధ్యలో మానివేసినట్లయితే దానికి తగ్గట్టుగా వుంటుంది. ఈ క్రింది ఉదాహరణ చూడండి.

ఉదా: పై ఉదాహరణలో చూపిన మేరకు 22 సంవత్సరములో కాకుండా 32వ వయస్సునాటికి చేరినాడు అనుకుందాము. అప్పుడు చేరిననాటి వయస్సును బట్టి టేబిలు IIవ ప్రకారం లెక్క కట్ట వలసి వుంటుంది. రూపాయకు 76 పైసల వంతున వస్తుంది. అంటే 3392 — 60×76 = రూ 2502.10 వస్తుంది.

అటు కార్మికులకు యిటు యజమానులకు అదనపు భారం లేకుండా కార్మికులకు ప్రావిడెంటు ఫండు సదుపాయాలతో బాటు అకాల మృతి చెందే కార్మికుల కుటుంబసభ్యులకు తగినంత దీర్ఘ కాల భద్రతా సదుపాయాలను సమకూర్చటానికి ఉద్దేశింప బడిన యీ పథకం కార్మిక సంక్షేమరంగంలో నూతన శకానికి నాందిగా పరిగణించవచ్చు. ఈ పథకం వలన ఒక్క ఆంధ్రప్రదేశ్‌లోనే సుమారు 3,400 ఫ్యాక్టరీలలో పనిచేసే 333000 కార్మికులు దేశం మొత్తంపై సుమారు 55 లక్షల కార్మికులు, సదుపాయాలను పొందబోతున్నారు. ఇంకా ఎక్కువ మందికి సదుపాయాలను కల్పించడానికి ప్రభుత్వం కృషి చేస్తున్నది. ప్రావిడెంటుఫండు చట్టాన్ని 10 మంది అంటే తక్కువగా ఉన్న ఫ్యాక్టరీలకు కూడా అన్వయింపజేయాలని ప్రభుత్వం సంకల్పిస్తూంది. అలాంటప్పుడు దేశంలో కోట్లాది కార్మికులకు యీ పెన్షన్ పథకం సదుపాయాలు లభించుచున్నవి.

## పథక నిర్వహణ

ఈ పథకనిర్వహణను కేంద్ర ప్రభుత్వం చేపట్టింది. ఇందుకై సాలీనా 11.61కోట్ల రూపాయలు ఖర్చు పెట్టనున్నది. అయినాసరే దేశంలో విప్లవాత్మక చర్యల ద్వారా అన్ని వర్గాల వారికి సమాన అవకాశాలు సాంఘిక న్యాయం. సాంఘిక భద్రత సమకూర్చటానికి మన కేంద్రప్రభుత్వం దృఢసంకల్పంతో కృషి చేస్తున్నది.

ఈ పథకాన్ని ప్రావిడెంటు ఫండు సంస్థ కేంద్ర రాష్ట్ర కమిషనర్ల ద్వారానిర్వహిస్తుంది దీనికి యజమానులు, ఇటు కార్మికులు సంపూర్ణ సహకారాన్ని అందజేయవలసి వుంటుంది.

ఇది నూతనంగా ప్రవేశపెట్టబడిన పథకం. ఇందులోని ముఖ్యాంశాలు అందరికీ సమగ్రంగా అవగాహన కాకపోవచ్చును. యజమానులు కార్మికులకు వివరించటంలో ఉదాసీనత వహించకోవాలి. ఈ పథకంక్రింద అవసరమయ్యే వివరాలను నిర్ణీత ఫారములలో ఎప్పటికప్పుడు ప్రావిడెంటు శాఖకు అందజేయాలి. కార్మిక సంఘాలు కూడా తమ తమ సభ్యులకు యీ పథక సదుపాయాలను వివరించి యజమానులతో సహకరించేలా చూడాలి.

ఈ పథకానికి సంబంధించిన వివరాలను ప్రాంతీయ ప్రావిడెంటుఫండు కమీషనరు ద్వారాగాని, ప్రాంతీయ ప్రావిడెంటు ఇన్స్పెక్టర్ల ద్వారా గాని తెలుసుకొనవచ్చును. కార్మికుల సంక్షేమానికి కృషి చేయటానికి యీ డిపార్టుమెంటు సర్వదా సంసిద్ధంగా వుంది.







# నగరంలో వార్తా చిత్రాలు

ఎడమవైపు పైన : ఎగ్జిబిషన్ మైదానంలో ఏప్రిల్ 21 వ తేదీన ముఖ్యమంత్రికి సన్మానం

మధ్యలో : కేంద్ర దేశీయ వ్యవహారాలమంత్రి శ్రీ రామ్‌నివాస్ మిర్ధా జూబ్లీహాలో ఏప్రిల్ 22వ తేదీన ఆంధ్రప్రదేశ్ సివిల్ సర్వీసెస్ అసోసియేషన్ సభను ప్రారంభించారు.

క్రింద : పంచాయతీ రాజ్ శాఖామాత్యులు శ్రీ టి. హయగ్రీవాచారి ఉత్తర వియత్‌నామ్ నుండి వచ్చిన వ్యవసాయప్రతినిధి బృందం వారితో ఏప్రిల్ 15న చర్చలు జరిపారు.

కుడివైపు పైన : నేపాల్ ప్రధానమంత్రి శ్రీ కీర్తినిధి బిస్తా ఏప్రిల్ 21న హైదరాబాద్ సందర్శించారు.

క్రింద : ఎగ్జిబిషన్ మైదానంలో ఏప్రిల్ 9 వ తేదీన వైశాఖి మేళా సందర్భంగా ముఖ్యమంత్రి ప్రసంగించారు.











# నగరంలో వార్తా చిత్రాలు

ఎడంవైపు : ఆంధ్ర ప్రదేశ్ ఫెడరేషన్ ఆఫ్ ఛేంబర్ ఆఫ్ కామర్స్
పైన : ఇండస్ట్రీ వార్షికోత్సవాల సందర్భంగా ఏప్రిల్ 22 న ముఖ్యమంత్రి జూబ్లీహాల్లో ప్రసంగిస్తున్న దృశ్యం.

మధ్యలో : ఏప్రిల్ 30 న 18వ అఖిలభారత చేనేతవారోత్సవాలకు ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు.

క్రింద : భారీ నీటిపారుదల శాఖ మంత్రి శ్రీ పి. నరసారెడ్డి ఏప్రిల్ 16 న ఆంధ్రప్రదేశ్ డివిజనల్ అకౌంటెంట్ల సంఘ సమావేశంలో ప్రసంగించారు.

కుడివైపు : ఆంధ్ర ప్రదేశ్ గవర్నరు శ్రీ ఖండూభాయి దేశాయి
పైన : వ్యవసాయ విశ్వవిద్యాలయ 7 వ కాన్వొకేషన్‌లో ప్రసంగిస్తున్న దృశ్యం.

క్రింద : ఉస్మానియా విశ్వవిద్యాలయంలోని జర్నలిజం విద్యార్థులు ఆనంద నిలయంలో ముఖ్యమంత్రిని కలిసారు.








# నగరంలో ప్రధానమంత్రి



ఏప్రిల్ 27వ తేదీన ప్రధానమంత్రి నగరానికి వచ్చినపుడు
విమానాశ్రయంలో గవర్నరు, ముఖ్యమంత్రి స్వాగతం పలికారు



రెండవసారి ముఖ్యమంత్రిగా ఎన్నికైన సందర్భంగా అజుంమాన్ ఎ-తాక్షి
అదబ్ సంస్థవారు శ్రీ పి. వి. నరసింహారావుగారిని అభినందించిన సందర్భం



విమానాశ్రయంలో లంబాడీ మహిళలతో ప్రధానమంత్రి



శాసన సభ్యురాండ్రతో శ్రీమతి ఇందిరాగాంధీ [ఏప్రిల్ 28]



ఏప్రిల్ 28వ తేదీన ముఖ్యమంత్రి, రాష్ట్ర భారతీయ వైద్యశాస్త్ర, యోగ,
హోమియోవైద్యుల సమావేశం ప్రారంభించారు



ప్రకాశం జిల్లా షెడ్యూల్డు కులాలు, షెడ్యూల్డు జాతుల సహకార సంఘం నిర్మించిన హరిజన కాలనీకి గవర్నరు ఏప్రియల్ 8వ తేదీన ప్రారంభోత్సవం చేశారు.

# జిల్లాల్లో

## జమ్మలమడుగులో రక్షిత నీటిసరఫరా పథకానికి శంఖుస్థాపన

ఉపముఖ్యమంత్రి శ్రీ బి. వి. సుబ్బారెడ్డి, కడపజిల్లాలోని జమ్మలమడుగులో ఏప్రిల్ 19వ తేదీన రక్షిత నీటి సరఫరా పథకానికి శంఖుస్థాపన చేశారు. ఈ సందర్భంలో ఆయన ప్రసంగిస్తూ ఈపథకం విధానం చేయడానికి 15 సంవత్సరాల కంటె ఎక్కువకాలం పట్టినది. పని పూర్తి కావడానికి ఎంతకాలం పట్టుతుందో చెప్పలేను అన్నారు. అయితే జీవితభీమా సంస్థనుంచి రుణం సంపాదించి పనిని సత్వరంగా అమలు చేసే విషయంలో తన సంపూర్ణ సహకారం వుంటుందని ఆయన హామీ యిచ్చారు.

తనకు సమర్పించిన విజ్ఞాపన పత్రాన్ని గురించి ప్రస్తావిస్తూ ఎన్నో విషయాలు అందులో చేర్చడంవల్ల ప్రయోజనం వుండదని, ఒక్కొక్క విషయానికి వేరువేరుగా విజ్ఞప్తిపత్రాలు వున్నట్లయితే వాటిపై అవసరమైన చర్యలు తీసుకోవడానికి, సంబంధించిన శాఖలకు పంపడం సులభతరమవుతుందని ఆయన చెప్పారు.

రక్షిత నీటిసరఫరా పథకం పూర్తి అయిన తరువాత డ్రైనేజి ఆలోచించవచ్చని ఆయన తెలిపారు. కరువు సహాయక పనుల గురించి ప్రస్తావిస్తూ నిధుల కొరతవల్ల పనులు ఆపి వేయవలసివచ్చిందని మంత్రివర్గం ఈ విషయమై చర్చిస్తుందని కేంద్రప్రభుత్వం మనరాష్ట్రానికి సహాయం చేసినప్పుడు ఈ పనులు మళ్లీ కొనసాగుతాయని ఉప ముఖ్యమంత్రి చెప్పారు.

## ఖమ్మం జిల్లాలో గోధుమ ఉత్పత్తి

ఖమ్మం జిల్లాలోని ఊటుకూరు, కామపల్లి, మాణిక్యారం, గాంధీనగరం గ్రామాలలో రబీకాలంలో 95 ఎకరాల ప్రాంతంలో సోనాలిక, కల్యాణ సోనా అనే మెక్సికన్ గోధుమ రకాలు వేయబడినాయి. వీటివల్ల 910 క్వింటాళ్ల గోధుమలు ఉత్పత్తి అయినాయి. ఊటుకూరు గ్రామ పంచాయతీ అధ్యక్షులు శ్రీ వై. రామలింగం ఎకరానికి 16 క్వింటాళ్ల గోధుమ పండించారు. కామపల్లి గ్రామ పంచాయతీ అధ్యక్షులు శ్రీ అజిమీర్ భాజ్య ఎకరానికి 12 1/2 క్వింటాళ్ల గోధుమ పండించారు. వీరిద్దరికి ఖమ్మం జిల్లాలో ఈరకం గోధుమ విషయంలో వరుసగా ప్రథమ, ద్వితీయ స్థానాలు వచ్చాయి. శ్రీ భాజ్య, లంబాడ తెగకు చెందినవారు.

## మురికిపేటలనిర్మూలన మండలి ఏర్పాటు

గృహనిర్మాణ శాఖామంత్రి శ్రీ యల్. లక్ష్మణ దాస్ చిత్తూరులో పత్రికా ప్రతినిధులతో మాట్లాడుతూ రాష్ట్రంలో మురికివాడలలో నివసించే ప్రజలకు సౌకర్యాలు కల్పించే నిమిత్తమై ప్రభుత్వం త్వరలో మురికిపేట నిర్మూలన మండలిని ఏర్పాటు చేస్తుందని తెలిపారు. తక్కువ, మధ్యతరగతి ఆదాయవర్గాల వారికి గృహవసతి సౌకర్యాలు కల్పించే ఉద్దేశ్యంతో హౌసింగ్ బోర్డు కార్యకలాపాలను తాలూకా స్థాయికి విస్తరింపచేసే విషయమై ప్రభుత్వం ఆలోచిస్తున్నదని ఆయన చెప్పారు. తిరుపతిలో హౌసింగ్‌బోర్డు ప్రాజెక్టుకు నివేశన స్థలాల కేటాయింపుకై మంత్రి చిత్తూరు జిల్లా కలెక్టరు శ్రీ బి.వి. రామారావుతో చర్చలు జరిపారు.

## చెన్నమగుడిపల్లెలో పాఠశాల భవనానికి ప్రారంభోత్సవం

పంచాయతీ రాజ్ శాఖామంత్రి శ్రీ టి. హయగ్రీవాచారి, చిత్తూరు పంచాయతీ సమితిలోని చెన్నమగుడి పల్లిలో ఏప్రిల్ 18వ

ప్రాథమిక పాఠశాల భవనానికి ప్రారంభోత్సవం చేశారు. సమితిలో ప్రాథమిక పాఠశాలలన్నిటికి భవన సౌకర్యాలు కల్పించేందుకు సమితి అధ్యక్షులు, సభ్యులు కృషిచేస్తున్నందుకు వారిని ఆయన అభినందించారు. ఈ పాఠశాల ప్రారంభోత్సవానికి చిన్న తరహా నీటిపారుదల శాఖామంత్రి శ్రీ కె. గోపాలనాయుడు అధ్యక్షత వహించారు. చిత్తూరుజిల్లా కలెక్టరు శ్రీ బి. వి రామారావు, శాసన సభ్యులు శ్రీ సి. దాస్‌గారలు ఈసభలో ప్రసంగించారు. చిత్తూరు పంచాయతీ సమితి అధ్యక్షులు శ్రీ యన్.పి. వెంకటేశ్వర చౌదరి అంతకుముందు ముఖ్య అతిథులకు స్వాగతం చెప్పారు.

## చిత్తూరు జిల్లాలో వెనకబడిన తరగతులవారికి ఇండ్లు

చిత్తూరు జిల్లా కలెక్టరు శ్రీ బి వి రామారావు, ఏప్రిల్ 18న చెన్నమ గుడిపల్లిలో ఒక బహిరంగ సభలో ప్రసంగిస్తూ చిత్తూరు జిల్లాలో షెడ్యూలు తరగతులు గిరిజన గృహనిర్మాణం పథకం క్రింద ఈ సంవత్సరం జూలై ఆఖరునాటికి 4,100 ఇళ్లు నిర్మించబడతాయని చెప్పారు. పరిశుభ్రమైన ఇండ్లు నిర్మించడానికి అన్నివిధాల కృషి చేయడం జరుగుతుందని ఆయన చెప్పారు.

## ఖమ్మంలో విలేజిలెవెల్ వర్కర్ల అసోసియేషన్ భవనానికి శంఖుస్థాపన

పంచాయతీరాజ్ శాఖామంత్రి శ్రీ టి హయగ్రీవాచారి ఏప్రిల్ 23వ తేదీన ఖమ్మంలో ఆంధ్రప్రదేశ్ విలేజిలెవెల్ వర్కర్లు గ్రామ సేవికల అసోసియేషన్ భవనానికి శంఖుస్థాపన చేశారు. దీనికి పార్థసారథిభవనం అని పేరు పెట్టబడింది. ఈ భవన నిర్మాణానికి రూ 25,000లు ఖర్చు కాగలదని అంచనా వేయబడింది. ఈ సందర్భంలో ఏర్పాటైన బహిరంగసభలో మంత్రి ప్రసంగిస్తూ విలేజిలెవెల్ వర్కర్లు గ్రామ సేవికల పదవులను గ్రామఅభివృద్ధి అధికార్లుగా మార్చే విషయమై ప్రభుత్వం తీవ్రంగా పరిశీలిస్తున్నదని చెప్పారు. విలేజిలెవెల్ వర్కర్లు గ్రామసేవికల సమస్యలు తనకు బాగా తెలుసని వారి పరిస్థితులను చక్కబరచడానికి వారి సమస్యలు ఉన్నతాధికార సంఘం పరిశీలించే విషయమై తాము ప్రయత్నం చేయగలమని ఆయన హామీ యిచ్చారు. వెంగళరావు కమిటీ నివేదిక ఆధారంగా పంచాయతీరాజ్ సంస్థలలో ఎన్నికలు నిర్వహించే విషయంలో మార్పులు తీసుకొనిరావడానికి ప్రభుత్వం యోచిస్తున్నదని కూడా ఆయన తెల్పారు.

జిల్లా కలెక్టరు శ్రీ ఆర్. పార్థసారథి ఈ సభకు అధ్యక్షత వహించారు. అంతకుముందు ఈ అసోసియేషన్ కార్యదర్శి శ్రీ ఎం. అనంతరామన్ నివేదిక చదివారు. విలేజి లెవెల్ వర్కర్లు, గ్రామసేవికలు ఎదుర్కొంటున్న సమస్యలను ఆయన వివరించి చెప్పారు.

జిల్లా పరిషత్తు అధ్యక్షులు శ్రీ ఆర్. భువనసుందరరెడ్డి, జిల్లా అడ్‌హాక్ కమిటీ అధ్యక్షులు శ్రీ యల్. నర్సయ్య, శాసన సభ్యులు శ్రీ కాశయ్యగారలు కూడా ఈ సభలో ప్రసంగించారు.



హయత్‌నగర్‌లో హరిజన గిరిజన కాలనీకి ముఖ్యమంత్రి ఏప్రిల్ 21న శంఖుస్థాపన చేశారు



ఏప్రిల్ 21వ తేదీన ఖమ్మంలో, గిరిజన సంక్షేమ మంత్రి శ్రీ కె. భీంరావు 70 మంది గిరిజన బాలురతో బయలుదేరుతున్న విశాఖ యాత్రా బస్సుకు ప్రారంభోత్సవం చేశారు



ఏప్రిల్ 17వ తేదీన పరిశ్రమల మంత్రి శ్రీ జలగం వెంగళరావు ఖమ్మంలో 4వ తరగతి ఉద్యోగుల కాలనీకి శంఖుస్థాపన చేశారు.

## కరీంనగర్ జిల్లాలో హరిజన గృహనిర్మాణ కార్యక్రమం

సాంఘిక సంక్షేమశాఖ డైరెక్టరు, ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర షెడ్యూలు తరగతుల గిరిజన గృహనిర్మాణ సమాఖ్య మేనేజింగ్ డైరెక్టరు అయిన శ్రీ కె. ఆర్. వేణుగోపాల్ ఏప్రిల్ 20, 21వ తేదీలలో కరీంనగర్ జిల్లాలో 10 పంచాయతీ సమితులలో పర్యటించి ఈ సమాఖ్య హరిజనుల కొరకు నిర్మిస్తున్న 20 కాలనీలలో జరుగుతున్న గృహనిర్మాణ కార్యక్రమాలను పరిశీలించారు. తాను చూచిన ప్రాంతాలలో కాలనీల నిర్మాణ కార్యక్రమం చురుకుగా కొనసాగుతున్నదని 1972 మే నెల ఆఖరు నాటికి మొత్తం 75 కాలనీల నిర్మాణం పూర్తి కాగలదని చెప్పారు. జిల్లా గృహనిర్మాణ సంఘం కార్యక్రమాలను సక్రమంగా, సంతృప్తికరంగా అమలు జరుపుతున్నందువల్ల దానికి షెడ్యూలు తరగతులు, గిరిజన గృహనిర్మాణ సమాఖ్య కరీంనగర్ జిల్లాలో మరొక 1000 ఇండ్ల నిర్మాణం పనులు కేటాయించింది. కరీంనగర్ జిల్లాలో మొత్తం 4253 ఇండ్లు నిర్మించడం జరుగుతుంది. ఈ ఇండ్ల నిర్మాణం విషయంలో జిల్లా కలెక్టరు శ్రీ యస్. వి. సుబ్రహ్మణ్యం చూపుతున్న శ్రద్ధాసక్తులను శ్రీ వేణుగోపాల్ ప్రశంసించారు.

## హేమగడ్డలో లిఫ్ట్ ఇర్రిగేషన్‌కు ప్రారంభోత్సవం

ఉప ముఖ్యమంత్రి శ్రీ బి. వి. సుబ్బారెడ్డి, ఏప్రిల్ 14న మహబూబ్‌నగర్ జిల్లా హేమగడ్డలో లిఫ్ట్ ఇర్రిగేషన్ పథకానికి ప్రారంభోత్సవం చేశారు. రూ. 2,01,000ల ఖర్చుతో 1971లో యీ పథకం అమలును పూర్తిచేశారు. దీని ద్వారా 357 ఎకరాలకు సేద్యపు నీరు లభిస్తుంది. 22 కుటుంబాలకు ప్రయోజనం కలుగుతుంది.

ఉప ముఖ్యమంత్రి యీ సభలో ప్రసంగిస్తూ అవసరమైన ఆర్థిక సహాయం అందజేస్తూ భూములు అభివృద్ధిపర్చుకోవడంలో రైతులకు సహాయపడాలని అధికారులకు సూచించారు.

జిల్లాపరిషత్తు అధ్యక్షుడు శ్రీ కె. కె. రెడ్డి ప్రసంగిస్తూ ఈ ప్రాంతం వెనుకబడిన తనాన్ని దృష్టిలో ఉంచుకుని మరికొన్ని యిటువంటి పథకాలను మంజూరు చేయాలని ఉప ముఖ్యమంత్రికి విజ్ఞప్తి చేశారు.

ఆరోగ్యశాఖామంత్రి శ్రీ ఇబ్రహీం అలీ అన్సారి ప్రసంగిస్తూ ఆత్మకూరు ఆసుపత్రిలో లేడీ డాక్టరును నియమిస్తామని ప్రజలకు హామీ యిచ్చారు.

## నల్లగొండ జిల్లాలో 100 గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా

నల్లగొండ జిల్లా కలెక్టరు శ్రీ కె. ఓబయ్య ఏప్రిల్ 11వ తేదీన నల్లగొండలో జరిగిన జిల్లా సంయుక్త సమావేశంలో ప్రసంగిస్తూ నల్లగొండ జిల్లాలో గత సంవత్సరం 103 గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేయబడినదనీ, 1971–72 సంవత్సరంలో 100 గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేసే కార్యక్రమాన్ని అమలు జరుపనున్నారనీ తెలిపారు.

సాధించగలిగిన వాస్తవమైన లక్ష్యాలను నిర్ణయించాలని జిల్లా అధికారులకు ఆయన సూచించారు. బ్లాకు స్థాయిలో తక్కావీ రుణాలు పన్నులు వగైరాలను త్వరితగతిని సేకరించడానికి యంత్రాంగాన్ని ఆయత్తం చేయాలని బ్లాకు అభివృద్ధి అధికారులకు, సహకార శాఖ అధికారులకు ఆయన విజ్ఞప్తి చేశారు. పన్నుల బకాయిల శాతం ఆందోళన కలిగించే విధంగా ఉందని ఆయన అన్నారు.

1971–72 సంవత్సరంలో 6,986 కుటుంబ నియంత్రణ శస్త్రచికిత్సలు నిర్ణయించబడినాయని కలెక్టరు అన్నారు. నల్ల



పశ్చిమ గోదావరి జిల్లాలో అధిక పంట రకాల ప్రదర్శన క్షేత్రం



మరొక ప్రదర్శన క్షేత్రం—ఆ జిల్లాలో



గుంటూరుజిల్లాలోని నిడుముక్కలలో ఫాతిమానగర్ కాలనీకి రాష్ట్రగవర్నరు శ్రీ ఖండూభాయ్ దేశాయ్ ఏప్రిల్ 5వ తేదీన ప్రారంభోత్సవం చేశారు

గొండ జిల్లాలో మంచినీటి బావుల కొరత దృష్ట్యా, 26 లక్షల ఖర్చుతో 656 గొట్టపు బావులను త్రవ్వే పథకాన్ని ప్రభుత్వం మంజూరు చేసిందనీ, యింతవరకు 407 బావులను త్రవ్వి, పంపు సెట్లు నెలకొల్పడం జరిగిందనీ ఆయన తెల్పారు. ఖరీఫ్ పంట కాలంలో సకాలంలో విత్తనాలు పంపిణీ చేయాల్సిన అవసరాన్ని గూర్చి కలెక్టరు నొక్కిచెప్పారు.

జిల్లా పరిషత్తు అధ్యక్షుడు శ్రీ కె. రంగారెడ్డి, జిల్లా అధికారులు, భోనగిరి సబ్ కలెక్టరు, రెవిన్యూ డివిజనల్ అధికారులు, బ్లాక్ అభివృద్ధి అధికారులు యీ సమావేశంలో పాల్గొన్నారు.

## "పంచాయతీరాజ్ వ్యవస్థను పటిష్ఠం చేయాలి"

దేశంలో పంచాయతీరాజ్ వ్యవస్థను పటిష్ఠంచేయవలసిన అవసరంపట్ల ప్రజలు సుముఖంగా ఉన్నారు. దానిని రద్దుచేయాలనే కోరిక వారికి లేదు: అంటూ పంచాయతీరాజ్ శాఖామంత్రి శ్రీ టి. హయగ్రీవచారి హైదరాబాదు జిల్లాపరిషత్తు సభ్యుల సమావేశంలో ప్రసంగిస్తూ అన్నారు.

సర్వత్రా పంచాయతీరాజ్ వ్యవస్థను గురించి అనేకచర్చలు జరుగుతున్నాయి. ఈ వ్యవస్థలోని లోపములను సరిదిద్ది దాన్ని పటిష్ఠం చేయడానికి ప్రజాభిప్రాయం సుముఖంగా ఉన్నది. ఏ కొద్దిమంది మాత్రమే దీన్ని రద్దు చేయాలని అంటున్నారు. నిర్మాణాత్మక దృక్పథంతో ఈ వ్యవస్థను అభివృద్ధి పర్చడానికి పంచాయతీరాజ్ పరిపాలన వ్యవహారాలను సమర్థవంతంగా నిర్వహించడానికి విద్యావిషయిక ఆసక్తి దృష్ట్యా విశ్వవిద్యాలయాలు ఉత్తమమైన చర్చా వేదికలుగా ఉపకరించ గలవని ఆయన అన్నారు. మార్పు చెందుతున్న కాలానికి అనుగుణంగా ఈ వ్యవస్థలో కూడా మార్పులు రావడం శ్రేయస్కరం. పంచాయతీరాజ్ పని విధానాన్ని గురించి పరిశీలన చేయడానికి నియమించబడిన ఉన్నతాధికారుల సంఘం తన నివేదికను త్వరలో పూర్తి చేయాలని ఆయన సూచించారు.

అనధికారులు, అధికారుల మధ్య సన్నిహిత సహకారం ఉన్నప్పుడు ఫలితాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ప్రజా ప్రతినిధులు తమ ప్రాంతాల్లో జరుగుతున్న కరువు సహాయక పనులను జాగరూకతతో పర్యవేక్షణ చేయాలి. నీటి ఎద్దడిని గురించి ప్రజలలో భయాందోళనలను నివారించడానికి వారు ప్రయత్నించారు. ఈ సమస్యలను తీర్చడానికి ప్రభుత్వం తన యావచ్ఛక్తిని వినియోగిస్తు



గుంటూరులో ఏప్రిల్ 5వ తేదీన గాంధీ కస్తూర్బా భవనానికి గవర్నరు ప్రారంభోత్సవం చేశారు.



ప్రకాశం జిల్లా, కొత్తపట్నంలో ఏప్రెల్ 7వ తేదీన రాష్ట్ర గవర్నరు శ్రీ ఖండూభాయ్‌దేశాయ్ మత్స్య పరిశ్రామికుల కాలనీకి శంఖుస్థాపన చేశారు

న్నది. ప్రజాసమస్యలను ఆచరణయోగ్యమైన పద్ధతిలో పరిష్కరించడానికి కృషిచేయాలని ప్రజాదృష్టిలో పంచాయతీరాజ్ సంస్థల గౌరవ ప్రతిష్ఠలు పెరిగే విధంగా సభ్యులుకృషిచేయాలని ఆయన వినతి చేశారు.

మునిసిపల్ శాఖామంత్రి శ్రీ ఎం. మాణిక్యరావు ప్రసంగిస్తూ నీటిఎద్దడిగల ప్రాంతంలో నీటిసరఫరా చేయడానికి ప్రభుత్వం కృతనిశ్చయంతో వున్నదని అవసరమైతే లారీలద్వారా అయినాసరే నీటిని సరఫరా చేయడానికి ప్రభుత్వం నిర్ణయించినదనీ ఇందుకొరకు రూ. 20 లక్షలు కేటాయించడం జరిగిందని చెప్పారు.

జిల్లా కలెక్టరు శ్రీ టి. లక్ష్మారెడ్డి మంత్రులకు స్వాగతం చెబుతూ హైదరాబాదు జిల్లాలో మార్చినెల ఆఖరువరకు కరువు సహాయక పనుల క్రింద కోటి రూపాయలు ఖర్చుపెట్టడం జరిగిందని తెల్పారు. మొత్తం 1,151 పనులు చేపట్టబడినాయి.

వీటిలో 436 పనులు పూర్తి అయినవి. రోజుకు సగటున 13,078 మంది వ్యక్తులకు ఉపాధి కల్పించడం జరిగింది. చిన్నతరహా నీటి పనులను పూర్తి చేయడానికి అదనంగా 25 లక్షలు ప్రభుత్వం మంజూరు చేయాలని ఆయన చెప్పారు.

కలెక్టరు ఇంకా యిలా అన్నారు. జిల్లాలో 26,848 మంది సన్నకారు రైతులకు ఆపత్కాల తక్కావి ఋణాల క్రింద రూ. 31 లక్షలు పంపిణీ చేయడం జరిగింది. రిగ్గులు ఉపయోగించి బావులు లోతు చేయడానికి రూ. లక్ష, బోరింగు బావులు త్రవ్వడానికి మరొక లక్ష రూపాయాలు ప్రత్యేకించబడినాయి. వికారాబాదు బ్లాకులో యునిసెఫ్ రిగ్గులు పని చేస్తున్నాయి. హయత్‌నగర్, వర్గి బ్లాకుల్లో మరొక రెండు రిగ్గులు త్వరలో పనిచేయడం ఆరంభిస్తాయి.

జిల్లాపరిషత్తు అధ్యక్షులు శ్రీ ఎం. భోజిరెడ్డి ప్రసంగిస్తూ పంచాయతీరాజ్ సంస్థ వనరులను సమీకరించడానికి వున్నతాధికార సంఘం తగిన సూచనలు చేయవచ్చునని ఆశాభావం వెల్లడించారు. పంచాయతీరాజ్ సంస్థల కార్యదర్శి శ్రీ బి.ఆర్.కె. శాస్త్రిగారు చేస్తున్న కృషిని ఆయన ప్రశంసించారు.

జిల్లాపరిషత్తు సమావేశానికి యాత్రావిషయాల శాఖామంత్రి శ్రీ డా. సి. హెచ్. దేవానందరావు, స్పోర్ట్సు శాఖామంత్రి శ్రీ ఎం.ఆర్. శ్యామ్‌రావు, పంచాయతీరాజ్ శాఖ కార్యదర్శి శ్రీ బి.ఆర్.కె. శాస్త్రి, చీఫ్ ఇంజనీరు శ్రీ టి.ఎన్. స్వామి హాజరైనారు.



రాష్ట్ర గవర్నరు ఏప్రెల్ 7వ తేదీన ఒంగోలులో మహిళామండలికి ప్రారంభోత్సవం చేశారు

## లక్ష్మయ్య కండ్రిగలో పాఠశాలభవనం ప్రారంభం

చిత్తూరు పంచాయతీ సమితి లక్ష్మయ్య కండ్రిగలో 19-4-1972న జిల్లా కలెక్టరు శ్రీ బి వి రామారావు గారిచే పాఠశాల భవన ప్రారంభోత్సవము జరుపబడింది

శ్రీ ఎన్. పి. వెంకటేశ్వరచౌదరి స్వాగతము చెప్పారు. స్థానిక శాసన సభ్యులు శ్రీ డి. ఆంజనేయులునాయుడు అధ్యక్షత వహించి ప్రతి గ్రామమునకు పాఠశాల అవసరం గురించి నొక్కి చెప్పారు.

భవన ప్రారంభోత్సవానంతరము జిల్లా కలెక్టరు శ్రీ బి వి. రామారావు మాట్లాడుతూ ప్రజల అభివృద్ధి కొరకు ప్రభుత్వము ఎన్నో కార్యక్రమాలు చేపట్టినదనీ, గతసంవత్సరము జిల్లాలో 75 గ్రామాలకు విద్యుచ్ఛక్తి యివ్వబడినదనీ, అదే విధముగా చిన్న నీటి వనరులందు గణనీయమైన అభివృద్ధిని సాధించినదనీ అన్నారు.

జిల్లా విద్యాశాఖాధికారి శ్రీ పి. వి. సూర్యనారాయణమూర్తి కూడా ప్రసంగించారు.

## జూనియర్ కాలేజి వార్షికోత్సవం

సత్యవేడు ప్రభుత్వ జూనియర్ కళాశాల తృతీయ వార్షికోత్సవము హైస్కూలు 24 వ వార్షికోత్సవము ఏప్రిల్ 23 తేదీన ఘనంగా జరిగాయి. శ్రీ వేణుగోపాలరెడ్డిగారు తమ సందేశమును, విద్యార్థులకు దీవెనలను పంపారు. సభ శ్రీ వెంకటేశ్వర్లుగారి అధ్యక్షతన జరిగినది. శ్రీ ప్రేమయ్య, బాలకృష్ణరావు నరసింహ గార్లు మాట్లాడారు.

ప్రిన్సిపాల్ నరసింగరావుగారు వార్షిక నివేదిక చదివి వినిపించారు. ఆటలలోను, వక్తృత్వపు పోటీలలోను గెలుపొందిన వారికి శ్రీ సంతోజిరావుగారు బహుమతి ప్రదానము జేశారు. అనంతరము విద్యార్థులచే సాంస్కృతి కార్యక్రమాలు ప్రదర్శింపబడ్డాయి.



PUBLISHED BY THE DIRECTOR OF INFORMATION, PUBLIC RELATIONS & TOURISIM ANDHRA PRADESH, HYDERABAD
PRINTED BY THE DIRECTOR OF PRINTING, GOVT. OF ANDHRA PRADESH, AT THE GOVT. CENTRAL PRESS HYDERABAD

# స్వీయ చరిత్ర ఆధారంగా - బుజ్జాయి



























